# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 17 సంచిక : 12 హైదరాబాద్ 221 డిసెంబర్ 2019 పేజీలు : 68 రు. 25

- ✳ తెలంగాణలో ప్రశ్నించే గొంతులపై కత్తి
- ✳ ఆర్‌టిసి రక్షణకు రాజీలేని పోరాటం
- ✳ దేశాన్ని చీకట్లోకి నెడుతున్న అయోధ్య తీర్పు
- ✳ ప్రపంచీకరణ కొత్తరూపం ఆర్‌సిఇపి
- ✳ ప్రపంచవ్యాప్తంగా ప్రజాపోరాటాల వెల్లువ
- ✳ ఫ్రెడరిక్ ఎంగెల్స్ ద్విశత జయంతి
- ✳ సంపాదకుడిపై అక్రమ కేసు - సర్వత్రా నిరసన

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 120 |
| కుట్రారాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| ప్రపంచీకరణ ప్రాభవంలో... | విద్యాభూషణ్ | 120 |
| మార్క్స్ రాసిన పెట్టుబడి | డేవిడ్ స్మిత్, ఫిల్ ఇవాన్స్ | 200 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| కొత్త వంతెన | క. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |
| మానని గాయాలు | తెలంగాణ విద్యావంతుల వేదిక | 100 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| ప్రకృతి - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |
| శాస్త్రీయ విద్యా విధానం | ఆకుల భూమయ్య | 30 |

## కులం-మతం

| | | |
|---|---|---|
| జెండర్ కులం | ఉమా చక్రవర్తి | 150 |
| బొజ్జా తారకం నీలిజెండా వ్యాసాలు | హెచ్.బి.టి | 250 |
| ఇది రిజర్వేషన్ల దేశం | బొజ్జా తారకం | 150 |
| అంటరాని తనం ఇంకానా? | బొజ్జా తారకం | 50 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| వెలివాడల వెతలు | కుల నిర్మూలన ప్రచురణ | 100 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |

## చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| గోదావరి వచ్చినపుడు | ఆర్. ఉమామహేశ్వరి | 280 |
| హైదరాబాద్ స్వాతంత్ర్య సంరంభం | ఎన్. వేణుగోపాల్ | 25 |
| పద్య సాహిత్యం:సంఘ చరిత్ర | బూదరాజు రామకృష్ణ | 25 |
| నగరంలో కర్ఫ్యూ | మలుపు ప్రచురణ | 75 |
| నరమేధాలూ నియోగాలూ | బి. విజయభారతి | 250 |
| జీనా హైతో మర్‌నా సీకో | కాత్యాయని | 100 |
| పరిమళించిన మానవత్వం | ప్రొ. జి. హరగోపాల్ | 120 |
| సన్నిహితుల జ్ఞాపకాలలో అంబేద్కర్ | హెచ్‌బిటి | 200 |
| మా జ్ఞాపకాల్లో కెవిఆర్ | వకుళాభరణం లలిత | 80 |
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| టిపు సుల్తాన్ | యార్లగడ్డ నిర్మల | 150 |
| నా మాటే తుపాకి తూటా | విమల, కాత్యాయని | 120 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |
| కశ్మీర్‌లో నిషిద్ధ రాత్రి | బషారత్ పీర్ | 170 |

## సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| సహచరులు | వరవరరావు | 100 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| తత్వశాస్త్ర దారిద్ర్యం | కార్ల్ మార్క్స్ | 150 |
| తలకిందుల లోకం | మనీషా సేథీ | 150 |
| ప్రశ్నలు అలాగే ఉన్నాయి | ఎం. రాఘవాచారి | 150 |
| సముద్ర స్వరం | పాలమూరు అధ్యయన వేదిక | 150 |
| వ్యక్తిత్వమే కవిత్వం | మలుపు ప్రచురణ | 100 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| 30 ఇయర్స్ దండకారణ్య కల్చరల్ మూవ్‌మెంట్ | ఎన్.ఎం. చేతనా | 250 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |
| భీమా కోరేగాం 12 - వివి | స్వేచ్ఛా సాహితి ప్రచురణ | 50 |
| యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం | ఎస్.అలెక్సీయెవిచ్ | 100 |
| రగులుతున్న అడవి | నందినీ సుందర్ | 290 |

## కథ - నవల

| | | |
|---|---|---|
| మేరువు | విరసం ప్రచురణ | 90 |
| మానధనులు | హూవర్డ్ ఫాస్ట్ | 150 |
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నిషిధ | నల్లూరి రుక్మిణి | 180 |
| మాటిగరి | గూగి వా థియోంగో | 120 |
| మట్టికాళ్ల మహారాక్షసి | గూగి వా థియోంగో | 200 |
| బంది | గూగి వా థియోంగో | 200 |
| నేను చావును నిరాకరిస్తున్నాను | జి.ఎన్. సాయిబాబా | 125 |

## డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2018) | 400 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

221 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2019
సంపుటి : 17
సంచిక : 12







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌పై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన శ్రేయోభిలాషులు, వై. రాజేశ్వరి, నెల్లూరు - రు. 4,100; ఎస్. జీవన్‌కుమార్, హైదరాబాద్ - రు. 2,000; కడితం సుభాషిణి, కర్నూలు - రు. 2,000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం పత్రికలో పాఠకుల అభిప్రాయాలను నిష్పాక్షికంగా ప్రచురించి, తమ నిజాయితీని నిరూపించుకుంటోంది. అదే వీక్షణం ప్రత్యేకత. ఇక వ్యాసాల విషయానికి వస్తే, విచారణకు నోచుకోకుండా జైళ్లలో మగ్గుతున్న వారి గురించి మానవీయ వాదులు పెద్దఎత్తున స్పందించి తగు రీతిలో ఉద్యమించక తప్పదని ఆ వ్యాసం హెచ్చరిస్తోంది. ఆర్‌టిసి సమ్మెపైనా, కశ్మీర్‌లో సైనిక నిర్బంధంపై వ్యాసాలు నిస్తేజంగా ఉన్న చాలా మందిలో ఆలోచనల్ని కలుగజేసే విధంగా ఉన్నాయి. ఇక నిర్బంధంలో ప్రజా సంఘాలు, లక్ష్మణ్ వ్యాసం పాలకుల పిరికితనాన్నీ తద్వారా వారి క్రూరత్వాన్నీ కళ్లకు కట్టినట్టూ ఉంది. అదే సందర్భంలో మేధావులూ, కార్మికులూ, ప్రజలూ పాలకుల క్రూరత్వానికి వ్యతిరేకంగా పోరాటం ఉధృతం చేయాలనే సందేశం ఉంది. అలా చేయకపోతే సమస్త హక్కులూ కోల్పోయి నిన్న వాళ్లూ, నేడు నేనూ, రేపు ఇంకెవరో ఇంకెంతమందో నిరపరాధుల్ని అపరాధులుగా మార్చుతారీ పాలకులు గనుక ప్రజలారా, ప్రజాస్వామిక వాదులారా, విద్యార్థి యువజన మహిళలారా పోరాడండి. పోరాడితే పోయేవి బానిస సంకెళ్లేనని చాటండి.

**– బి.ఎ. నారాయణరావు**
విశాఖపట్నం

వీక్షణంలో వస్తున్న వ్యాసాలు చాలా బాగున్నాయి. ఆంధ్రప్రదేశ్, తెలంగాణలో వస్తున్న అనేక సామాజిక, రాజకీయాంశాలు ఉన్నాయి. కాని పర్యావరణానికి సంబంధించిన అంశాలు, చాలా లోతైన విషయాలు రావలసిన అవసరం ఉంది. ప్రకృతి, సమాజాల మధ్య అగాదం ఎందుకు ఏర్పడుతుంది. దానికి ప్రధాన కారణాలు ఏమిటి అనే విషయాలు మార్క్సిజం కోణంలో రావలసిన అవసరం ఉంది. నా దృష్టిలో ఇంతవరకు జరిగిన 'వర్గ పోరాటాల్ని' పర్యావరణ అంశాన్ని వర్గ దృక్పథంతో తెలియపరచవలసిన అవసరం ఎంతైనా ఉంది. స్పార్టకస్ నుండి నేటివరకు జరిగిన ఉపయోగ విలువ, మారక విలువ మొత్తం 'పర్యావరణ సంక్షోభం'లో చూడవలసిన అవసరం ఉంది.

**– ముత్తనగారి రాజేందర్‌రెడ్డి**
భూంపల్లి, సిద్దిపేట్

వీక్షణం నవంబర్ సంచికలో అచ్చయిన 'భావోద్వేగాల కేంద్రంగా ఎన్నికలు' అనే వ్యాసంలో రచయిత ఎన్నికల ప్రచారంలో పార్టీలు ప్రజల మౌలిక సమస్యలకు ప్రాధాన్యత ఇవ్వకుండా భావోద్వేగాలను కేంద్రంగా చేసుకొన్నారనే విషయాన్ని తెలిపారు. రెండు రాష్ట్రాల్లో జరిగిన ఎన్నికల్లో ఏ ఒక్క పార్టీకి కూడా ప్రజలు అనుకూలమైన తీర్పును ఇవ్వకుండా అన్ని పార్టీలను అధికారానికి సమదూరంలో ఉంచి పాలకుల వైఫల్యాన్ని ఎండగట్టారనే విషయాన్ని చాలా స్పష్టంగా తెలిపారు. ఈ సమాజంలో ఎన్నికలే ప్రజా ఆమోదానికి గీటురాయి కాదని చెప్పి పాఠకులకు స్పష్టత నిచ్చారు. కొన్ని పార్టీలు అధికార పార్టీలకు అనుకూలంగా తమ ఎన్నికల అవకాశవాద ఎత్తుగడలను రూపొందించుకొని పరోక్షంగా అవి అధికారంలోకి రావడానికి తోడ్పడుతున్న విషయాన్ని వివరించి ఉంటే బాగుండేది. మహారాష్ట్రలోని ప్రకాష్ అంబేద్కర్ నాయకత్వంలోని 'వంచిత్ బహుజన్ అగాడి పార్టీ' 238 స్థానాల్లో పోటీ చేసి 25,23,583 లక్షల ఓట్లను (4.58 శాతం) సాధించి పరోక్షంగా అధికార పార్టీ ఎక్కువ స్థానాలు సాధించడానికి తోడ్పడింది తప్ప ఒక్క స్థానాన్ని కూడా గెలవలేదు. భీమా కోరేగాంలో దళిత బహుజనులపై హిందుత్వ శక్తులు చేసిన దాడికి నిరసనగా పెద్ద ఎత్తున దళితులు ఉద్యమించారు. ఈ ఉద్యమాన్ని కూడా నియంత్రించారనే విమర్శ కూడా ఈ పార్టీ నాయకత్వంపై ఉంది. ఈ విషయాన్ని వ్యాసంలో చర్చించి ఉంటే బాగుండేది. దళిత బహుజన పార్టీలు అని చెప్పుకుంటున్న పార్టీలు ఆ సమూహాలను ఎలా తప్పుతోవ పట్టిస్తున్నాయో, పాలకులకు అనుకూలంగా ఎటువంటి పాత్ర పోషిస్తున్నాయో అర్థం చేసుకోవడానికి ఉపయోగపడేది. ఇదే పనిని ఎంఐఎం పార్టీ కూడా చేసింది. 7,37.888 ఓట్లు పొంది రెండు స్థానాల్లో నెగ్గింది. హర్యానాలో జననాయక్ జనతా పార్టీ ఎన్నికలకు ముందే బిజెపితో అవకాశవాద పొత్తుపెట్టుకొన్న విషయాన్ని ఈ వ్యాసంలో చెప్పిఉంటే బాగుండేది. పాలక పార్టీలు అన్ని కూడా అధికారంకోసం తమ సైద్ధాంతిక అవగాహనను పక్కకు పెట్టి అంకెల గారడీతో అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి మహారాష్ట్రలో ఎన్ని కుతంత్రాలకు పాల్పడుతున్నాయో మన కళ్ల ముందే ఉంది. ప్రజల్ని దోపిడీకి, అణచివేతకు, ఆత్మహత్యలకు, అవమానాలకు, హత్యలకు, అత్యాచారాలకు గురిచేస్తున్న పాలకులు ఒక్కటై అధికారంలోకి వస్తున్న సందర్భం. ఇలాంటి పరిస్థితులనే ఎదుర్కొంటున్న విదేశాల్లోని ప్రజలు సంఘటితమై లక్షోపలక్షలుగా పాలకుల విధానాలను నిరసిస్తూ తమ హక్కులకోసం గొంతు విప్పుతున్నారు. తెలంగాణ రాష్ట్రంలో ఆర్‌టిసి కార్మికులు చేసిన చారిత్రాత్మక సమ్మె పట్ల తెలుగు సమాజం స్పందించాల్సినంత స్పందించకపోవడంతో పాలకులు తమ ప్రయోజనాల్ని నెరవేర్చే ప్రైవేట్ రంగం వైపు మొగ్గు చూపుతున్నారు. ఇప్పటికైనా కార్మికులు సమాజ శ్రేయస్సు కోసం చేసిన సమ్మెను గుర్తించి పాలకులు దిగివచ్చేలా ఉద్యమాన్ని నిర్మించాల్సిన అవసరం ఉంది. 20 మంది వరకు ఆర్‌టిసి కార్మికులు ఆత్మహత్యలకు పాల్పడి ఇప్పటికీ ఉద్యమ స్ఫూర్తిని కొనసాగిస్తున్నారు. అటువంటి కార్మికులపై పోలీసులను ఉసిగొల్పి అణచివేయడమే ప్రభుత్వం దగ్గర ఉన్న పరిష్కారం. పాలకుల వద్ద ప్రజల మౌలిక సమస్యలకు పరిష్కరించే విధానాలు లేకనే అణచివేత విధానాలను పరిష్కారంగా ఎంచుకుంటున్నారు. తమ మౌలిక సమస్యలకోసం ప్రజలే లక్షోప లక్షలుగా కదిలి పోలీస్ స్టేషన్‌లు, జైల్లు కూడా సరిపోని విధంగా కదిలితే తప్ప ప్రభుత్వం స్పందించేలా లేదనే విషయాన్ని సమాజహితం కోరేవారు గుర్తించాల్సిన సందర్భంలో ఉన్నాం.

**– వి. లక్ష్మణ్**
నిజామాబాద్

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# సంఘ్ పరివార్ బీభత్సానికి రెండు నిదర్శనాలు



సంఘ్ పరివార్ భావజాలానికి ప్రజాస్వామ్యమన్నా, చట్టబద్ధ పాలనన్నా, సామాజిక సమతౌల్యమన్నా, ఆధునిక పాలనా సంప్రదాయాలన్నా కంటగింపు అని ఇన్నాళ్లుగా విమర్శకులు చెపుతున్న మాటను నమ్మనివారెవరన్నా ఉంటే ఈ ఒక్క నెలలో జరిగిన పరిణామాలు చూస్తే చాలు. వారి అనుమానాలు తొలగిపోతాయి. సంఘ్ పరివార్ ఇటు భూస్వామ్యానికీ అటు సామ్రాజ్యవాదానికీ విశ్వసనీయంగా ప్రయోజనాలు పరిరక్షించే కావలి కుక్క. భారతీయ భూస్వామ్యంలో ప్రధానాంశమైన హిందుత్వ బ్రాహ్మణ్యమే సంఘ్ పరివార్ భావజాలం. దానికి ప్రజాస్వామ్యమంటే గిట్టదు, కావలసింది నిరంకుశత్వం. దానికి చట్టబద్ధ పాలనంటే, రాజ్యాంగ స్ఫూర్తి అంటే గిట్టదు, కావలసింది మనుధర్మ పాలన. దానికి సామాజిక సమతౌల్యమంటే గిట్టదు, కావలసింది అగ్రవర్ణాల, సంపన్నుల దోపిడీ పీడనల కింద మిగిలిన వర్గాలన్నీ అణగారి పోవడం. దానికి ఆదాన ప్రదానాలతో కూడిన ఆధునిక పాలనా సంప్రదాయాలు గిట్టవు, కావలసింది చాణక్యుడు ఎప్పుడో చెప్పిన సామదానభేద దండోపాయాలతో తన మాట, తన ప్రయోజనాలు నెగ్గించుకోవడం. అందుకోసం అది ఎంతకైనా తెగబడుతుంది, ఎంతకైనా దిగజారుతుంది, ఎంత రక్తపాతమైనా సరే, ఎన్ని సిగ్గుమాలిన చర్యలైనా సరే. దాని ఏకైక లక్ష్యం భూస్వామ్య, సామ్రాజ్యవాద దళారీ పాలనను నిలబెట్టి ఆ ప్రయోజనాలను కాపాడడం. ఈ ఒక్క నెలలోనే అటు అయోధ్య తీర్పు ద్వారా దాని భూస్వామ్య, హిందుత్వ బ్రాహ్మణ్య లక్షణాలూ, ఇటు దేశ ఆర్థిక రాజధాని ముంబాయి మీద పట్టు వదులుకోగూడదనే సామ్రాజ్యవాద దళారీ వర్గ లక్షణాలూ కలిసి అది ఎంతకు తెగించగలదో చూపి సంఘ్ పరివార్ అసలు స్వభావం దేశం ముందు నిస్సిగ్గుగా ప్రదర్శించబడింది. ఇది ఒక్క భారతీయ జనతా పార్టీకో, ఆ పార్టీ నాయకత్వంలో నడుస్తున్న ప్రభుత్వానికో, ప్రభుత్వాలకో మాత్రమే పరిమితం కాదు. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ భావజాలాన్ని నమ్మే, పాటించే, ఆ పరివారంలో చేరే, చేరడానికి తహతహలాడే న్యాయమూర్తులకూ, అధికారులకూ, రాజకీయ నాయకులకూ, మధ్యతరగతి బుద్ధిజీవులకూ అందరికీ వర్తించే విషయం. అటు అయోధ్య తీర్పులోనూ, ఇటు మహారాష్ట్ర రాజకీయ పరిణామాలలోనూ వీరందరూ నిర్దిష్టమైన, కచ్చితమైన సంఘ్ వైఖరి తీసుకున్నారు. ఆ వైఖరి ఈ దేశపు బహుళత్వానికీ, మనుగడకూ, భవిష్యత్తుకూ ఎంత ప్రమాదకరమైనదో, విధ్వంసకరమైనదో స్పష్టంగా కనబడుతున్నది.

అయోధ్య తీర్పు సుప్రీం కోర్టు న్యాయమూర్తులనబడేవారి ద్వారా వెలువడిన సంఘ్ తీర్పు. హిందుత్వ బ్రాహ్మణ్యంలో అంతర్గతంగా ఉన్న అనేక వైరుధ్యాల, అసంగతాల వలెనే ఈ తీర్పు కూడ అవకతవకల కుప్పగా ఉంది. ఒక ఆధారాలు లేని విశ్వాసానికీ, కళ్ల ముందర నిలిచి ఉన్న కట్టడాన్ని కూలగొట్టిన నేరపూరిత చర్యకూ మధ్య వివాదం వచ్చినప్పుడు దాన్ని ఆస్తితగాదాగా మాత్రమే చూడడం, ఆ ఆస్తి మీద అధికారం ఎవరిదని నిర్ణయించడానికి ప్రయత్నించడం మొదటి తప్పు. అప్పుడు కూడ నాలుగు వందల సంవత్సరాలు నిలిచి ఉన్న కట్టడం తమదే అని ముస్లింలు రుజువు చేయలేకపోయారని, కాని అక్కడే రాముడు జన్మించాడని భక్తులు విశ్వసిస్తున్నారు గనుక రుజువైనట్టేనని అనడం వంచనాశిల్పానికి పరాకాష్ఠ. 1949లో రామ్ లల్లా విగ్రహాలు మసీదులోకి దొంగతనంగా చేరవేయడం తప్పే, 1992లో బాబ్రీ మసీదును కూల్చివేయడం తప్పే అని రాసిన న్యాయమూర్తులు, మరి ఆ తప్పులకు పరిహారం చూపకుండా కూల్చివేసినవారి, అంటే న్యాయమూర్తుల ప్రకారమే నేరస్తుల, అభీష్టాన్ని నెరవేర్చే తీర్పు ఇవ్వడం తలకిందుల న్యాయమే. న్యాయస్థానం సంప్రదాయాలకు అనుగుణంగా తీర్పు ఎవరి రచనో పేర్కొనకపోవడం, తీర్పుకు అనుబంధంగా అనామక రచనగా రాముడు అక్కడే పుట్టాడని చెప్పే తప్పులతడక, పుక్కిటి పురాణాన్ని చేర్చడం ఈ దేశంలో న్యాయవ్యవస్థ ఇంకెంతమాత్రమూ తటస్థ న్యాయవ్యవస్థగా మిగలలేదని, అది సంఘ్ భగ్వధ్వజానికి కర్రగా మారిందని చూపుతున్నాయి. అలా అందరినీ సమానంగా చూసే లిఖిత చట్టం స్థానంలో అసమానతను ఎత్తిపట్టే విశ్వాస స్మృతి తీర్పరిగా ఉండాలనే సంఘ్ కోరిక నెరవేరింది.

ఇక గణనీయమైన సంపదకూ పారిశ్రామిక వ్యవస్థకూ నిలయమైన మహారాష్ట్ర, పీష్వా బ్రాహ్మణుల నుంచీ, నాగపూర్ కేంద్రం నాటి నుంచీ భావజాలపరంగా తనకు పట్టుకొమ్మ అయిన మహారాష్ట్ర తన చేతుల్లో ఉండాలని సంఘ్ కోరిక. జోతిరావు ఫులే, బిఆర్ అంబేద్కర్‌ల ఆలోచనాధార ఫలితంగా దళిత, బహుజన, సంస్కరణ ఉద్యమాల సంప్రదాయాలు నెలకొన్నప్పటికీ మహారాష్ట్ర సమాజం ఇవాళ్టికీ ప్రధానంగా మతతత్వం నిండిన విభజిత సమాజంగానే, సంఘ్ పరివార్ భావజాలపు భూమికగానే కొనసాగుతున్నది. మత తత్వాన్నీ, మరాఠా జాతీయ తత్వాన్నీ తీవ్రవాద ధోరణితో మిళితం చేసిన శివసేనకు కూడ అక్కడ ప్రాబల్యం ఎక్కువే.

స్థూలంగా భావజాలపరంగా చూస్తే భారతీయ జనతా పార్టీ, శివసేన రెండూ కూడ సంఘ్ పరివార్‌లో భాగమే కాని అధికారం పంచుకునే విషయంలో ఇద్దరి మధ్య గత కొన్ని సంవత్సరాలుగా విభేదం పెరుగుతున్నది. ఎన్నికలకు ముందు రెండు పార్టీల మధ్య ఐక్యత కుదిరినప్పటికీ, ఎన్నికల్లో భాజపా బలం తగ్గడంతో శివసేన ముఖ్యమంత్రిత్వాన్ని ఆశించింది. ముఖ్యమంత్రిత్వాన్ని వదులుకోవడానికి సిద్ధంగా లేని భాజపా చట్టానికీ, రాజ్యాంగ స్ఫూర్తికీ, ప్రజాస్వామ్య సంప్రదాయాలకూ, గత డెబ్బై సంవత్సరాలలో నెలకొన్న వ్యవస్థాగత సూత్రాలకూ తిలోదకాలు వదిలి నిస్సిగ్గుగా కప్పల తక్కెడ రాజకీయం ప్రారంభించింది. చట్టవ్యతిరేకంగా రాష్ట్రపతి పాలన విధించింది. అన్ని ప్రమాణాలనూ తుంగలో తొక్కి రాత్రికి రాత్రి రాష్ట్రపతి పాలన ఎత్తివేసి, హడావిడిగా ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసి ప్రభుత్వాన్ని స్థాపించింది. శాసనసభా వేదిక మీద బలప్రదర్శనకు ఎక్కువ వ్యవధి దొరికితే వీలైనంతమంది శాసనసభ్యులను కొని తన ప్రభుత్వాన్ని నిలబెట్టుకోవాలనుకుంది. అది సాధ్యం కాకపోయేసరికి మళ్లీ రాజీనామా చేసింది. ఒక్కమాటలో చెప్పాలంటే అసహ్యకరంగా ప్రవర్తించింది. అయితే అది సంఘ్ భావజాలానికి సహజమైనదే.

ఈ దుర్మార్గ భావజాలాన్ని, ఆచరణను అర్థం చేసుకుని, ప్రజలకు అర్థం చేయించి, సంఘ్ పరివారాన్ని తుదముట్టించడమే ఇవాళ దేశంలోని బుద్ధిజీవుల ముందున్న ప్రధాన కర్తవ్యం. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# దొరతనం గెలుసుడా ఓడుడా?

దొరా, దొరతనం జూపుకుంటానవులే. కని నాకు ఒక్క ముచ్చట సమజైత లేదు. ఇంకా నీ చింతమడక దొరతనమే నడుస్తాందని అనుకుంటానవా ఏంది. జగిత్యాల్ల, సిరిసిల్లల పడిపోయిన గడీలు యాదికస్తలేవా? అది గుడ పోనీ, దొరతనం పోయిందంటరు గాదు బాంచెన్, గదేందో నాకు నోరు దిరగది గని పజాసామ్యమో ఏందో అంటరు గద. గద్దెమీద కూసున్నోని ఇష్టం కాదు, జనం ఇష్టమే చెల్లుతదంటరు గాదు. గట్ల జనం వోట్లు గుద్దితెనె గద నలుపై ఏండ్ల సంది రాజకీయాల్ల ఉన్నవు, ముప్పై ఏండ్ల సంది ఎమ్మెల్లేగనే ఉన్నవట గద. మరి గిదేంది దొరా. నా మాటినకపోతే జీతగాణ్ని చెట్టుగ్గట్టి గుత్పలు ఇరిగిపోయేదాక కొట్టుడే, చంపిపారేసుడే, పొలంల తొక్కుడే, గడ్డివాముల ఇసిరేసి అగ్గిపెట్టుడే అని మీ తాతలనాడు అనుకున్నట్టే ఇయాల గుడ అనుకోబడ్తివి. పని పాటలోల్లకు, సుద్దరోల్లకు ఇంత గమాండా అని మీ తాతలు అన్నట్టే అనబడ్తివి బాంచెన్. అన్నాలం గాదు నాయిన. అట్ల జేసుడొదిలిపెట్టు, మనిషైనోడు అట్ల సోంచాయిస్తడా దొరా అసలు. ఇంతకు నీకు ఇంత గుస్స యాడికెల్లి వచ్చె? గా ఎఱ్ఱబస్సుల కండక్టర్లు, డైబర్లు, మెకానికులు, పాపం బట్టపేగులోల్లు గాదు నాయిన. ఇయాల దింటె రేపటికెట్ల అనుకునేటోల్లు గాదు తండ్రి. గవాండ్ల మీదనా నీ గుస్స? ఇంతకు ఏమడిగిరి వాండ్లు, ఏమన్న నీ జాయిదాద్ దోచి పెట్టుమనిరా, ఎన్న గాల్చి పెట్టుమనిరా? మేము సర్కారు నౌకర్లమే గద, సర్కారు నౌకర్లకిచ్చినంత మాకియ్యి అనిరి. ఊ అంటె తీసేసుడు, ఆ అంటె తీసేసుడు వద్దనిరి. కొత్త బస్సులు కొనమనిరి. ఇంకెక్కువ ఊళ్లకు బస్సులెయ్యిమనిరి. సర్కారు అన్నాక అన్ని మాటలినాలె గద, మాట ముచ్చట పెట్టాలె గద. వాండ్లు రూపాయి అడిగింద్రనుకో, నువ్వు పావులే ఇస్తనను, పది పైసలే ఇస్తనను. ఏదో ఒకటి కూసోబెట్టి మాట్లాడాలె గద. అసలు మాట్లాడనే మాట్లాడ. ఇంగ వాని ముఖం నేను జూడ అని పాతకాలపు దొర లెక్క అంటె ఎట్ల బాంచెన్. అయిపాయె, రాజెక్కువనా మొండెక్కువనా అని పాత శాత్రం ఉండె. ఇయాల రాజువు నువ్వేనాయె, మొండివి నువ్వేనాయె. రాజ్జెం ఆగుతదా దొరా? ఆ కచ్చీరోని పాడుగాను, వాడు నానబెట్టి నానబెట్టి ఎటు గానియ్యకపాయె. మారె, మా జనం గుడ అటు నీకు సై అనకపోయిరి, ఇటు మజ్దూర్లకు సై అనకపోయిరి. మన్నుదిన్న పాములోలె మాట్లాడకుంట గూసునిరి. అయితె గీ సంగతి జెప్పకపోతివి. నువ్వేదో దొరతనాన్నే ఇట్ల బిఱ్ఱబిగిసి ఉన్నవని నేననుకుంటాన. కని నిన్న గాయినెవలో వచ్చి, ఉట్టి దొరతనం ఒక్కటే గాదు, దొర దగ్గర ఇంకో మతలబున్నది అనె. నిచ్చమేనా బాంచెన్. అగో, నువ్వు బస్సులన్ని బంజేయాలని అనుకుంటానవట గద. నీ దోస్తులు బస్సులు కొని పెట్టుకున్నరట గద. ఇగ వాండ్ల బస్సులే రయ్యి రయ్యిన తిరుగుతయట గద. మరి మా ఊరికి పల్లెవెలుగు బస్సుంటదా పోతదా బాంచెన్? బస్సు స్టాండ్ల జాగలు, డిపోల జాగలు అన్ని గుడ అడ్డికి పావుసేరుకు నీ దోస్తులకే అమ్మి పారేత్తన్నవట గద. మరి గంత కొట్లాడి తెలంగాణ తెచ్చుకున్నది గిందుకేనా దొరా? బంగారి తెలంగాణ, బంగారి తెలంగాణ అంటాంటె ఇంకేందో అనుకుంటి, గిప్పుడు ఎరుకైతాంది, తెలంగాణ పేరు మాకు, బంగారం నీకూ నీ దోస్తులకా దొరా? వారెవ్వా అవ్వల్ దర్జగున్నదీ మాట. కాని దొరా, ఆర్టీసీ మజ్దూర్లు గుడ అవ్వల్ దర్జకు అయ్యల తీర్గ ఉన్నరు. నువ్వు గుడ్లురిమి చూడు, గద్దిరిచ్చు, కొలువు ఊడబీకుత అను, వాండ్లు మాత్రం అర్గీజు కదలలే. యాబై వేల మందిల నీ మాటిన్నోల్లు మూడు వందల మందేనా బాంచెన్. అబ్బ దొరతనం పడిపోయిందని ఇంక నీకు తెలివైతలేదా....

వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అసలు విషయాలు విస్మరిస్తున్న మీడియం చర్చ

ఉన్న సమస్యలను పక్కనపెట్టి కొత్తగా వచ్చిపడిన సమస్యల గురించి ఆందోళన పడేలా చేయడం, మొత్తం మీద అసలు సమస్యలు వదిలి కొసరు సమస్యల మీద బుఱ్ఱలు బద్దలు కొట్టుకునేలా చేయడం పాలకులు నేర్చుకున్న కొత్త విద్యలు. ఆంధ్రప్రదేశ్ సమాజం ముందర ఉన్న అత్యవసరమైన సమస్యలన్నీ విస్మరించి, కొత్త విభేదాలూ కొత్త ఘర్షణలూ తెచ్చుకుని కొత్తగా చీలిపోయి, అసలు సమస్యల నుంచి పక్కదారి పట్టించడానికి ప్రభుత్వం కొత్త సమస్యను ఒకదాన్ని తెచ్చిపెట్టింది. ప్రభుత్వ పాఠశాలల్లో ఇక ముందు పాఠాలు నేర్చుకునే భాష తెలుగుగా ఉండదని, అన్ని పాఠాలూ ఇకనుంచి ఇంగ్లిష్ లోనే నేర్చుకోవాలని ఒక ఉత్తర్వు విడుదల చేసింది. ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు సమాజం, ప్రధానంగా బుద్ధిజీవులు రెండు వర్గాలుగా చీలిపోయారు. ఇంగ్లిష్ ఎంత గొప్ప భాష అని వాదించేవారు ఒక వర్గంగా, తెలుగు ఎంత గొప్ప భాష అని వాదించేవారు మరొక వర్గంగా తయారయ్యారు. బోధనా మాధ్యమంగా ఏ భాష ఉండడం మంచిది అని వందల సంవత్సరాల విద్యా బోధనానుభవంతో, పిల్లల మనస్తత్వశాస్త్ర అధ్యయనాలతో, ప్రపంచంలోని అనేక దేశాల, అనేక జాతుల అనుభవాలతో కొన్ని శాస్త్రీయ నిర్ధారణలు ఇప్పటికే ఏర్పడి ఉన్నాయి. అవసరమైతే ఆ నిర్ధారణల పునస్సమీక్ష కూడ జరపవచ్చు. సంభాషణ ద్వారా కొత్త నిర్ధారణలకు కూడ రావచ్చు. కాని తెలుగు సమాజంలో చర్చ అనేది కనుమరుగై, రచ్చే మిగిలిన ఒక దుస్థితి ఏర్పడి చాల కాలమైంది. బోధనా భాషగా మాతృభాష ఉండాలనేవారు దళిత, బహుజన వ్యతిరేకులైనట్టు, ఇంతకాలమూ ఆధిపత్య కులాలు అనుభవించిన ఆధిక్యతా సాధనాన్ని ఇప్పుడు దళిత, బహుజనులు చేపట్టబోతుంటే అడ్డుకుంటున్నట్టు ఒక వర్గం వాదిస్తున్నది. భాషకు వర్గ, కుల, అధికార స్వభవమేమీ లేనట్టు, మాతృభాష అనేది దానికదిగానే అతీతమైనదీ అత్యుత్తమమైనదీ అయినట్టు, నిర్బంధపూరితంగానైనా సరే మాతృభాషలో మాత్రమే బోధన జరగాలన్నట్టు మరొక వర్గం వాదిస్తున్నది. ఈ ప్రత్యర్థి వాదనల్లో పడి రెండు వర్గాలూ మౌలికమైన అంశాలను విస్మరిస్తున్నట్టు కనబడుతున్నది. ఏ భాషా ఎక్కువదీ కాదు, తక్కువదీ కాదు. రాజకీయార్థిక అంశాలే ఒక భాషకు అగ్ర స్థానం గాని, న్యూన స్థానం గాని ఇస్తాయి. రాజకీయార్థిక విషయాల ప్రస్తావన లేకుండా భాషా చర్చ వల్ల ప్రయోజనం లేదు. అలాగే ఇంగ్లిష్ చదవగానే ఉద్యోగాలూ లేవు, తెలుగులో చదివినంత మాత్రాన అవి రాకుండా పోయేదీ లేదు. ప్రభుత్వ రంగంలో ఎక్కువ నిధులతో నాణ్యంగా ఉండవలసిన విద్యను ప్రభుత్వం వదులుకోవడం, నిర్లక్ష్యం చేయడం అసలు సమస్య. ప్రభుత్వ పాఠశాలల విద్యా బోధన ప్రమాణాలు – ప్రైవేట్ పాఠశాలల విద్యా బోధన ప్రమాణాలు – విద్య పట్ల ప్రభుత్వ వైఖరి అనే ప్రధానాంశాల భూమిక మీద బోధనా భాష చర్చ జరగాలి గాని మాట్లాడేవాళ్లు వాళ్ల పిల్లలను ప్రభుత్వ పాఠశాలలో చదివిస్తున్నారా, తెలుగు మీడియంలో చదివిస్తున్నారా అనే నైతిక చర్చ వల్ల ఉపయోగం లేదు. విద్య పట్ల ప్రభుత్వ వైఖరి ఉండవలసినట్టుగా ఉంటే, ప్రభుత్వ నిర్వహణలోని విద్యాసంస్థల ప్రమాణాలు మెరుగ్గా ఉంటే, ప్రైవేట్ విద్యాసంస్థల నిర్వహణ మీద ఉండవలసిన పర్యవేక్షణ ఉంటే ఎవరు ఎక్కడ చదువుకుంటారు, ఏ మీడియంలో చదువుకుంటారు, లేత వయసులో, చుట్టూ ఒక భాష వినబడే వాతావరణంలో ఏ భాష బోధనా భాషగా ఉండడం మంచిది అనేవి చర్చించవచ్చు.

వీ

# బొలీవియాలో మొరాలెస్ ప్రభుత్వంపై అమెరికా కుట్ర

**ఎ. నర్సింహారెడ్డి**

బొలీవియాలో సామాజిక ఆర్థికాభివృద్ధికి నమూనాగా నిలిచిన మొరాలెస్ ప్రభుత్వం అమెరికా సామ్రాజ్యవాదుల కుట్రలకు బలైంది. బొలీవియాలో ఆందోళన సృష్టించి సైన్యం మద్దతుతో మొరాలెస్ ప్రభుత్వాన్ని కూలదోయడం వెనుక దేశంలోని సంపన్న వర్గాలతో పాటు అమెరికా కార్పొరేటు సంస్థల హస్తం ఉంది. కార్మికోద్యమ నేతగా ప్రస్థానం ప్రారంభించి దేశాధ్యక్ష స్థాయికి ఎదిగి దశాబ్దంన్నర కాలంపాటు దేశాన్ని పాలించిన మూవ్‌మెంట్ టువార్డ్స్ సోషలిజం (ఎంఎఎస్) పార్టీ నేత ఇవో మొరాలెస్ మొదటి భూమి పుత్ర నాయకుడు. శ్వేత జాతీయులకు ఇది మింగుడుపడడం లేదు. మొరాలెస్ అధికారంలోకి వచ్చాక బొలీవియాలోని హైడ్రోకార్బన్ నిక్షేపాలపై అమెరికా కంపెనీల గుత్తాధిపత్యాన్ని అంతమొందించాడు. సహజ వనరులను ప్రజలపరం గావించేందుకు పూనుకున్నాడు. గాలిని, నీటిని కలుషితం చేసే కంపెనీలకు కళ్లెం వేస్తూ కఠిన చట్టాలు తీసుకొచ్చాడు. అత్యంత విలువైన లిథియం నిల్వల్లో 70 శాతం దాకా ఇక్కడే ఉన్నాయి. ఖనిజ, వాయు నిక్షేపాలపై అమెరికా, యూరప్ దృష్టి పడింది. మొరాలెస్ అధికారంలో ఉన్నంత కాలం ఇక్కడ తమ పప్పులుడకవని అమెరికాకు తెలుసు. అక్టోబర్ 20న జరిగిన ఎన్నికల్లో ఇవో మొరాలెస్ అధ్యక్షుడిగా నాల్గవసారి తిరిగి ఎన్నిక కావడాన్ని జీర్ణించుకోలేకపోయిన మితవాద గ్రూపులకు అమెరికా డాలర్ల మూటలు ఇచ్చి ఎగదోసింది. మితవాద శక్తుల ఆందోళనలకు తన మీడియా ద్వారా పెద్దయెత్తున ప్రచారం కల్పించింది.

లాటిన్ అమెరికాను తన పెరటి దొడ్డిగా భావించిన అమెరికా అక్కడి వనరులను యథేచ్ఛగా కొల్లగొట్టేది. క్యూబాతో మొదలై ఒక్కొక్క దేశం అమెరికా ఆధిపత్యం నుండి స్వేచ్ఛ పొందాయి. ఈ ధిక్కార ధోరణిని సహించలేని అమెరికా ఆ ప్రభుత్వాలను కూల్చి, కీలుబొమ్మ ప్రభుత్వాలను ప్రతిష్టించడమే పనిగా పెట్టుకుంది. సంపన్న వర్గాల ప్రతినిధి, మాజీ అధ్యక్షుడు కార్లోస్ మొయిసా నాయకత్వంలోని ప్రతిపక్ష పార్టీలు గత అక్టోబర్ ఎన్నికల్లో ఓడిపోయిన దగ్గర్నుంచి 'శాశ్వత నిరసనల'కు పిలుపు ఇచ్చాయి. సంపన్న కూటమి శ్రేణుల్లో పోలీసులు చేరడంతో అది తిరుగుబాటు రూపం తీసుకుంది. సైన్యం కూడా తటస్థత విడనాడి మొరాలెస్ రాజీనామా కోరడంతో అతడు వైదొలగక తప్పని స్థితి ఏర్పడింది. బొలీవియాలో తిరిగి తాజాగా ఎన్నికలు నిర్వహిస్తానని, ఎన్నికల కమిషన్‌ను పూర్తిగా ప్రక్షాళన చేస్తానని మొరాలెస్ ప్రకటించిన తరువాత కూడా అధ్యక్ష భవన ముట్టడిని మితవాద గ్రూపులు కొనసాగించాయి. దీంతో అధ్యక్షుడు మొరాలెస్ తన పదవికి నవంబర్ 10న రాజీనామా చేసి, మెక్సికోలో ఆశ్రయం కోసం వెళ్లే పరిస్థితి కల్పించాయి. మొరాలెస్ స్థానంలో జీనైన్ అనీజ్ తానే తాత్కాలిక అధ్యక్షురాలిగా నవంబర్ 12న ప్రకటించుకుంది. మొరాలెస్‌ను కూలదోసేందుకు అమెరికా పన్నిన కుట్రలో లూయిస్ ఫెర్నాండో కమాచో పాత్ర కీలకమైంది. కమాచో విదేశీ నిధులు దండిగా సమకూరే శాంతాక్రజ్ సంస్థకు చెందిన వ్యక్తి. ఈ సంస్థకు దేశంలోని వేర్పాటు వాద, మితవాద శక్తులతో సంబంధాలు ఉన్నాయి. ఇది తీవ్రవాద సంస్థ తరహా వంటిదేనని అంతర్జాతీయ మానవ హక్కుల సంస్థ పేర్కొంది. ఈ ప్రాంతంలోని మూలవాసులపై జాత్యాహంకార, వివక్షత దాడులకు పాల్పడుతోంది. మొరాలెస్ 2006లో బొలీవియా అధ్యక్షుడిగా తొలిసారి ఎన్నికైనప్పటి నుండి ఆయనను జాతి దురహంకార యుజెని వ్యతిరేకిస్తూ వస్తోంది. మూలవాసులకు చెందిన వ్యక్తిని దేశాధినేతగా ఎన్నికవడాన్ని జీర్ణించుకోలేకపోతోంది. వీ




(ప్రసాద్ రాధాకృష్ణన్, ఎకనామిక్ టైమ్స్)



❖ **అశోక నివాళి** – మూడవ భాగం – శ్రీశ్రీ – సింగంపల్లి అశోక్ కుమార్ – ఆలోచన ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **అశోక నివాళి** – నాలుగవ భాగం – శ్రీశ్రీ – సింగంపల్లి అశోక్ కుమార్ – ఆలోచన ప్రచురణలు– 120 పేజీలు, 1/8 డెమీ, రు. 100
పై రెండు ప్రతులకు: ఆలోచన ప్రచురణలు, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520004, ఫోన్ : 9246277357



❖ **బాచనపల్లి** – తెలంగాణలో 'ఒక గుట్టలకింద పల్లె' – కె. ముత్యం – కాశెట్టి స్వయం ప్రకాశ్ – రాజేశ్వర యాది బాచనపల్లి ప్రచురణ – 94 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: కె. స్వయం ప్రకాశ్, ఎడిటర్, అగ్నిపూలు, పక్షపత్రిక, ఇ.నెం. 6–9–58, ఆదర్శనగర్, నిజామాబాద్ – 503002, ఫోన్ : 7730069131




❖ **చైనా కవిత్వం** – ప్రాచీనకాలం నుండి నేటి తరం దాకా – తెలుగు అనువాదం: దీవి సుబ్బారావు – బోధి ఫౌండేషన్ ప్రచురణ – 124 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: బోధి ఫౌండేషన్, కొత్తపేట్, హైదరాబాద్ – 500035, ఫోన్ : 9848254745



❖ **పడమటి గాలిపాట** – ఆంగ్ల కవితల అనువాదం – డా. ముద్దు వెంకటరమణారావు – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 264 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఇ.నెం. 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట, హైదరాబాద్ – 500036




❖ **కంచికి వెళ్లకూడని కథలు** – కల్లూరి శ్యామల – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 100




❖ **దేశభక్తి గీతాలు** – సేకరణ పి. నారాయణరెడ్డి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **వ్యక్తిత్వ వికాసం ఆనంద మార్గాలు** – ముకుంద రామారావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 88 పేజీలు, 1/8 డెమీ, రు.70, పై మూడు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ, (నాగోల్), జిఎస్ఐ – పోస్ట్, హైదరాబాద్ – 500068, ఫోన్ : 040–29884454




❖ **స్లీపింగ్ విత్ ది రెయిన్‌బో** – దేవిప్రియ ప్రేమకవితలు – కొత్తవీ పాతవీ – దేవిప్రియ – సమత బుక్స్ ప్రచురణ – 164 పేజీలు, 1/8 డెమీ, రు. 399, ప్రతులకు: సమత బుక్స్, అమ్మచెట్టు, 204, రాచకొండ టవర్స్, అల్వాల్, సికింద్రాబాద్ – 500010




❖ **తథాగతుని అడుగుజాడలు** – రాణీ శర్మ ఈమని – ఉణుదుర్తి సుధాకర్ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 195 పేజీలు, 1/8 డెమీ, రు. 180, ప్రతులకు: హైదరాబాద్ బుక్స్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500006, ఫోన్ : 040–23521849




❖ **దండకడియం** – కవిత్వం – తగుళ్ల గోపాల్ – కవిసంగమం బుక్స్ ప్రచురణ – 164 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: తగుళ్ల గోపాల్, కలకొండ గ్రామం, మద్దుల్ మండలం, రంగారెడ్డి జిల్లా – 509360, ఫోన్ : 9505056316



❖ **తీగలచింత** – కవిత్వం – యాకూబ్ – కవిసంగమం బుక్స్ ప్రచురణ – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: యాకూబ్, 'సుఫి ఘర్', ఇ.నెం. 1–7–9/1/3, స్ట్రీట్ నెం. 17, చైతన్యపురి, హైదరాబాద్ – 500060, ఫోన్ : 9849156588




❖ **హీరాలాల్ రాయ్ కవిత్వం** – అమృత పథం – తెలుగు ఊటుకూరు రంగారావు, ప్రణయసౌధం – తెలుగు దాశరథి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 126 పేజీలు, 1/8 డెమీ, రు. 55




❖ **తెలుగుపై ఉర్దూ, పారశీకముల ప్రభావం** – కె. గోపాలకృష్ణారావు – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 216 పేజీలు, 1/8 డెమీ, రు. 90




❖ **అస్తిత్వ** – ప్రాతినిధ్య తెలంగాణ కథలు – డా. నందిని సిధారెడ్డి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 440 పేజీలు, 1/8 డెమీ, రు. 250



❖ **తరం మారింది** – నవల – మాదిరెడ్డి సులోచన – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 60

పై నాలుగు ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాడమి, కళాభారతి, రవీంద్రభారతి ప్రాంగణం, హైదరాబాద్ – 500004, ఫోన : 040–297031422

# వీక్షణం సంపాదకుడిపై అక్రమ కేసు

## వీక్షణం కలెక్టివ్ పత్రికా ప్రకటన

'వీక్షణం' రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక సంపాదకుడు, సీనియర్ జర్నలిస్టు ఎన్ వేణుగోపాల్ పై తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం తరఫున పోలీసులు ఇండియన్ పీనల్ కోడ్ (ఐపిసి), అన్ లాఫుల్ ఆక్టివిటీస్ ప్రివెన్షన్ ఆక్ట్ (యుఎపిఎ), తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ సెక్షన్ల కింద అక్రమ కేసులను బనాయించారు. ఈ చర్య రాజ్యాంగం హామీ ఇచ్చిన భావప్రకటనా స్వాతంత్ర్యానికి అనుగుణంగా, ప్రజావ్యతిరేక ప్రభుత్వ విధానాలను విమర్శిస్తున్నందుకు ఒక పత్రికా సంపాదకుడిపై పాలకుల కక్ష సాధింపుకు నిదర్శనమే.

నవంబర్ 12న హైదరాబాదులో అరెస్టు చేసిన ఎన్. రవిశర్మ, బి. అనూరాధల కేసులో హఠాత్తుగా ఎన్. వేణుగోపాల్ పేరు నిందితుడిగా చేర్చి పోలీసులు ఆయనను వేధించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ చర్య కక్ష సాధింపు మాత్రమే కాక, పచ్చి అబద్ధాలతో కూడిన హాస్యాస్పదమైన ప్రయత్నంగా ఉంది. ఎల్‌బి నగర్ రెండవ మెట్రోపాలిటన్ మెజిస్ట్రేట్ దగ్గర నవంబర్ 13న సమర్పించిన రిమాండ్ కేస్ డైరీలో ఆయనను ఏడవ ముద్దాయిగా (ఎ7) చూపి, పక్కన "విరసం విప్లవ రచయితల సంఘం సభ్యుడు" అని, "పరారీలో ఉన్నాడు" అనీ రాశారు. 2009లో వేణుగోపాల్ రాసిన ఒక వ్యాసం మీద వివాదంతో ఆయన విప్లవ రచయితల సంఘం నుంచి దూరమయ్యాడని అందరికీ తెలుసు. ఆ తర్వాత ఆయన ఏ సంస్థలోనూ సభ్యుడుగా లేడు. పూర్తికాలం వీక్షణం నిర్వాహకుడిగా ఉన్నాడు.

గత పది సంవత్సరాలుగా ఆయన జీవితం చూసిన ఎవరికైనా ఇవి తెలుసు. ప్రగతిశీల, ప్రజాస్వామిక, వామపక్ష భావాలున్నంతమాత్రాన ఒక సంస్థలో సభ్యుడుగా ఉండనక్కరలేదు. అంతకు ముందు విరసం సభ్యుడు గనుక ఎవరైనా ఆ పాత గుర్తింపుతోనే వ్యవహరించినా ఆయన ఎన్నో వేదికల మీద దాన్ని సవరించాడు. తాను ఏ సంస్థలోనూ సభ్యుడిని కాదని చెప్పుకున్నాడు. అయినా ఆయన మీద ఆ నిందాముద్ర వేయడానికి, స్వతంత్ర పాత్రికేయుడిగా ఆయన ప్రతిష్ఠను దిగజార్చడానికి పోలీసులు దురుద్దేశపూర్వకంగా చేసిన ప్రయత్నం ఇది.

తెలుగు, ఇంగ్లిష్ దినపత్రికలలో పదిహేను సంవత్సరాలు పనిచేసి, పదిహేడు సంవత్సరాలుగా స్వతంత్ర మాసపత్రిక సంపాదకుడిగా ఉన్న ఎన్ వేణుగోపాల్ పాత్రికేయ కృషి గురించి తెలుగు పాఠకులకు, ప్రజలకు కొత్తగా చెప్పనక్కరలేదు. రచయితగా, వక్తగా సుప్రసిద్ధుడైన వేణుగోపాల్ వ్యవస్థకు ప్రత్యామ్నాయ భావజాలం కలిగి ఉన్నాడని కూడ అందరికీ తెలుసు. గత ముప్పై సంవత్సరాలలో ఆయన ప్రచురించిన ఇరవై ఐదు పుస్తకాలు, అనువదించిన ఇరవై ఐదు పుస్తకాలు, రాసిన వందలాది వ్యాసాలు, చేసిన వందలాది ఉపన్యాసాలు తెలుగు సమాజానికి తెలిసినవే. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సాధన ఉద్యమంలో ఇవాళ ప్రభుత్వంలో ఉన్న ఎంతో మందితో కలిసి వేదికల మీద మాట్లాడి, జిఓ 610 మీద తెలంగాణ ఎన్జీవోల సంఘం నిర్వహించిన సభల్లో రాష్ట్రమంతటా ఉపన్యసించి ఆయన నిర్వహించిన పాత్ర కూడ అందరికీ తెలిసిందే. తెలంగాణ ఏర్పడిన తర్వాత ప్రభుత్వం ప్రజా ఉద్యమ ఆకాంక్షలకు వ్యతిరేకంగా పనిచేస్తున్నదని గత ఐదు సంవత్సరాలుగా ఆయన రచిస్తున్నాడు, ప్రసంగిస్తున్నాడు. ఇలా బహిరంగ ప్రజాజీవితంలో, చట్టబద్ధంగా, రాజ్యాంగబద్ధంగా తనకు ఉన్న వాక్సభాస్వాతంత్ర్యాలతో తన అభిప్రాయాలు ప్రకటిస్తున్నందుకు, ప్రభుత్వం అమలు చేస్తున్న ప్రజావ్యతిరేక విధానాలను విమర్శిస్తున్నందుకు ఆయన మీద పాలకులకు కన్నెర్రగా ఉందని కూడ చాల మందికి తెలుసు.

అలాగే, రాష్ట్రప్రభుత్వ అక్రెడిటేషన్ కార్డు ఉన్న పత్రికా రచయితగా, ప్రతిరోజూ ఏదో ఒక వేదిక మీద ఉపన్యసిస్తూ, ఒక ప్రముఖ దినపత్రికలో శీర్షిక రాస్తూ, ఒక మాసపత్రిక నడుపుతూ బహిరంగ ప్రజా జీవితంలో ఉన్న వ్యక్తిని పరారీలో ఉన్నాడు అని అబద్ధం చెప్పి న్యాయస్థానాన్ని తప్పుదారి పట్టించడం పోలీసుల కుట్ర వైఖరిని బైటపెడుతున్నది. ఆయన పరారీలో లేడని సమాజానికి తెలుసు. రిమాండ్ కేస్ డైరీ మొదటి పేజీలో అలా ఆయన పేరు రాసి, పక్కన రెండు అబద్ధాలు చేర్చిన పోలీసులు, ఆ వెనుక ఉన్న పన్నెండు పేజీల్లో ఆయన పేరు కూడ ప్రస్తావించలేదు. ఆయన ఏ నేరం ఎప్పుడు, ఎక్కడ చేశాడో మాట మాత్రం కూడ లేదు. అంటే ఈ పేరు చేర్పు కేవలం ఆయన మీద కక్ష సాధించడానికి, తద్వారా ఆయన సంపాదకుడుగా ఉన్న వీక్షణం ను బెదిరించడానికి జరుగుతున్న దుష్ప్రయత్నం మాత్రమే.

ఇటు నవ తెలంగాణ దినపత్రికలో 'తెలంగాణార్థం' శీర్షికలో, అటు 'వీక్షణం' మాసపత్రికలో సంపాదకీయాల్లో, అచ్చువేస్తున్న వ్యాసాల్లో, రాష్ట్రంలో అనేక చోట్ల అనేక వేదికల మీద ఉపన్యాసాలలో, యూట్యూబ్ చానళ్లలో ఆయన తెలంగాణ ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాల మీద తన విమర్శ సాగిస్తున్నాడు. అందువల్ల ఆయన స్వరం మూసివేసేందుకు, భిన్న స్వరాలు వినబడకుండా చేసేందుకు ప్రభుత్వం, పాలకులు, పోలీసులు చేస్తున్న కుట్రగా మాత్రమే ఈ చర్యను చూడవలసి ఉంటుంది. వి హనుమంతరావు సంపాదకుడుగా, ఎబికె ప్రసాద్ గౌరవ సంపాదకుడుగా 2003లో మొదలై, 2005 నుంచి ఎన్ వేణుగోపాల్ నిర్వహణలో నడుస్తున్న వీక్షణం ఈ పదిహేడు సంవత్సరాలుగా అనేక భిన్న స్వరాలకు వేదికగా నిలిచింది. ప్రజల తరఫున ప్రభుత్వ విధానాలను నిశిత పరీక్షలకు గురిచేసింది. ఇవాళ తెలంగాణ ప్రభుత్వం భిన్న స్వరాలన్నిటి పైన ఉక్కుపాదం మోపే ప్రయత్నంలో వీక్షణంను ఇబ్బందుల పాలు చేసేందుకే సంపాదకుడిపై ఈ అబద్ధపు కేసు బనాయిస్తున్నది.

వీక్షణం సంపాదకుడిపై పెట్టిన ఈ అక్రమ కేసును తక్షణమే ఉపసంహరించుకోవలసిందిగా, భిన్నాభిప్రాయం ప్రకటించే పాత్రికేయులపై, మేధావులపై కక్షసాధింపు చర్యలు మానుకోవలసిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాం.

వీక్షణం కలెక్టివ్ ప్రకటన వెలువడగానే తక్షణమే ఈ అక్రమ కేసును ఎత్తివేయాలని తెలంగాణ వర్కింగ్ జర్నలిస్ట్స్ ఫెడరేషన్ (టిడబ్ల్యుజె ఎఫ్), హైదరాబాద్ యూనియన్ ఆఫ్ జర్నలిస్ట్స్ (హెచ్ యు జె), తెలంగాణ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ (టియుడబ్ల్యుజె – హెచ్ 143), ఇండియన్ జర్నలిస్ట్స్ యూనియన్ (ఐజెయు), తెలంగాణ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ (టియుడబ్ల్యు జె – హెచ్ 9) నా మీద కేసును ఖండించాయి, కేసు ఎత్తివేసుకోవాలని ప్రభుత్వాన్ని కోరాయి. ప్రధాన స్రవంతి పత్రికలు, న్యూస్ వెబ్ సైట్లు అక్రమకేసు వార్తను, ఖండనలను ప్రముఖంగా ప్రచురించాయి. తెలంగాణ విద్యావంతుల వేదిక, రైతు స్వరాజ్య వేదిక, విప్లవ రచయితల సంఘం, ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక, సిపిఐ ఎంఎల్, పియుసిఎల్ తెలంగాణ, సిపిఐ కడప జిల్లా కమిటీ, మానవ హక్కుల వేదిక, డిటిఎఫ్ నిజామాబాద్ జిల్లా కౌన్సిలర్, జై భారత్, ఒపిడిఆర్ జాతీయ కార్యవర్గం వంటి ఎన్నో సంస్థలు ఖండన ప్రకటనలు ఇచ్చాయి.

నవతెలంగాణ సంపాదకులు ఎస్ వీరయ్య అక్రమ కేసును వెంటనే ఖండించారు. ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్ తన శీర్షికలో వివరమైన ఖండన వ్యాసం రాశారు.

సోషల్ మీడియాలో కొన్ని వందల మంది మిత్రులు, పెద్దలు తమ ఖండన ప్రకటించారు. వీక్షణం సంపాదకుడికి సంఘీభావం తెలిపారు. కొన్ని వందల మంది ఖండన–సంఘీభావ ప్రకటనలను విస్తృతంగా షేర్ చేశారు. వీరిలో ఎఎం ఖాన్ యాజ్దానీ, జహా ఆరా, మల్లేశం ముప్పా, శ్రీరామోజు హరగోపాల్, కిన్నెర, నర్సిం కార్టూనిస్ట్, విజయ్ రాఘవన్, బాసుదేవ్ బెనర్జీ, టెన్నిసన్ బక్కా, అనుమాండ్ల విద్యాసాగర్, సీమా ఆజాద్, ప్రసాద్ ఇంద్రగంటి, శ్రీధర్ రాయల, రమాసుందరి, విజయ భండారు, పద్మజా షా, కుమార్ కె క్యూబ్, ప్రసాద్ ఇప్పు, వెంకటేశ్వర్లు భూపతి, కె ఉదయ్ చందు, జాన్ కోరా, అయూబ్ మహమ్మద్, జిషా ఎలిజబెత్, పురుషోత్తం కాళిదాసు, రత్నం ఏసేపు, రవి గుంటి, నరసింహారెడ్డి పెంచుకలపాడు, మందపాక కామేశ్వర రావు రాజు, విజయ్ కుమార్ రెడ్డి, డా. తిరుపతి సందెవేని, కిషోర్ దాస్, జాజి మల్లి, నగుమోతు వేణుగోపాల్ రావు, రామకృష్ణ బుద్ధవరపు, కృష్ణ కిషోర్ తిప్పర్తి, విజయ కుమార్ గుర్రం, సుబ్రత దాస్, విజయ కుమార్ కారుమంచి, జయ వింధ్యాల, దొంత భద్రయ్య, శివలక్ష్మి పట్టేం, విజయ చంద్ర, పి సత్యవతి, చుక్కంబొట్ల రామ్మోహన్, ఆశోక్ రాజ్ మల్తుంకర్, ఆల్ల దుర్గారావు, శ్రీపెరంబుదూరు జైకిషన్, కాత్యాయని కేతవరపు, రమణమూర్తి రూపాకుల, రాజ్ రెడ్డి, రమేష్ జనవిజ్ఞాన వేదిక, నాగ నివాసరావు పోదూరి, ఎల్లారెడ్డి కర్రా, యోగానందచారి కొదుమగుండ్ల, సుజాత వెలపర్తి, ఉపేందర్ వెలపర్తి, నారాయణస్వామి వెంకటయోగి, ఎస్ ఎ దేవిడ్, ప్రమోద్ కుమార్, కృష్ణకుమార్ బాచిరాజు, నడవల రవి కుమార్, సుబ్రహ్మణ్యం ఆవుల, రమేష్ తోటకూర, కుసుమ గిరిజ, శ్రీకాంత్ ముక్కు, సాయి రమణి గరిమెళ్ల, పద్మ మీనాక్షి, కాజ వెంకట రమణ కుమార్, అజిత కొల్లా, ఆస్నాల శ్రీను, పందుల సైదులు, గురిజాల రవీందర్, ఎన్ చిన్నా నాయక్, వేణుగోపాల్ గంపా, రూపావత్ రమేశ్, పల్లా నర్సింహా రెడ్డి, సర్దార్ వినోద్ కుమార్, నర్సయ్య గౌడ్ ఉయ్యాల, హరి కాళోజీ, బొల్గూరి కిరణ్, నాగయ్య అంబటి, పంతంభిక్షం గౌడ్, నరేందర్ యాదవ్ రావుల, తిప్పర్తి యాదయ్య, క్రాంతి, వర్ష, అపర్ణ తోట, జిలుకర శ్రీనివాస్ మహరాజ్, మాధవ్ పి ఎస్ పి కె, సూర్య గుబ్బల, సత్య రాపెల్లి, పద్మ వంగపల్లి, కవిత కట్ట, చెన్నూరి గణేష్, స్టాలిన్ ఒయు, శివరాత్రి సుధాకర్ ఇనోష్ జెరెమియ, పెనుగొండ బాషా, రమేశ్ మడావి, నారాయణ రావు, కొండల్ రెడ్డి, రాజీష్ కొలక్కన్ని,హారూన్ కవనూర్, భూమేష్ దేశవేని, రంజిత్ బ్రామన్ పల్లి, కోయ చంద్రమోహన్, నందిరాజు రాధాకృష్ణ, వరలక్ష్మి విరసం , కవి యాకూబ్, పద్మ కొండిపర్తి, బాల సుధాకర్ మౌళి, మెర్సిడెస్ సాంకెజ్, కాత్యాయని ఎస్, కుమారస్వామి మదాన, రఘు భువనగిరి, రవి బల్ల, చైతన్య పింగళి, సంజీవ పాక, శ్రీమన్ చక్రవర్తుల, రామకృష్ణ చెరుకూరి, సంతోష్ వి, రూప ఎన్ టి, షేక్ యాసీన్, శివరావు రామినేని గోత్రస్య, రమాకాంత్ నెల్లుట్ల, కత్తెరశాల కుమారస్వామి, మంజుల ఆవంచ, జెజిసిపి బాబూ రావు, ఎర్రంరెడ్డి సునిల్ రెడ్డి, రవి పిట్ల, బిల్ల మహేందర్, జనార్ధన్ అంబల్ల, సురేంద్ర శీలం, దళపతి రామాంజనేయులు, రవీందర్ విలాసాగరం, శ్రీకాంత్ సోదుం, మల్లుల సురేష్, విజయ్ గారి భిక్షపతి, కుమార్ ఎస్ డి, క్రాంతి కుమార్, ప్రకాశ్ రామగిరి, మణి జాను, హనిత వైదికె, డిండినాథ్ ముక్కా, స్నేహలత పాక, ఉమా తెనాలి, శ్యాంకుమార్ మారెపల్లి, రమేశ్ ఆకుల, సి ఎ ప్రసాద్, శ్రీరామమూర్తి, కవిని ఆలూరి, టేక్మాల్ లక్ష్మణ్, సురేష్ కొసరాజు, అరుణ్ విరసం, అనల పెండ్యాల, వెంకటేశ్వర్లు సజ్జా, అనిల్ అట్లూరి, చందు గోపరాజు, రాజు భువనగిరి, భాస్కర్ కూరపాటి, రవికుమార్ బొమ్మగాని, మెర్సీ మార్గరెట్, అరుణ క్వీన్, రాయదాస్ రాయ్ మంతెన, సోగరా బేగం, వసంత కన్నబిరాన్, అయూబ్ మొహమ్మద్, సాహస, పద్మలత కొణతం, హర్ష్ ఠాకోర్, అరణ్య, గుర్బీర్ సింగ్, దిశా మారోజు, మల్లేశం ముప్పా, నాగవర్ధన్ రాయల, ప్రకృతి పిడిఎస్ యు, రమేష్ బాబు వొమ్మి, నారాయణస్వామి వెంకటయోగి, రాజీవ్ వెలిచేటి, వనజ సి, కోడం కుమారస్వామి, శోభ కందడి, బాసుదేవ్ బెనర్జీ, కె వి కూర్మనాథ్, సాయిపద్మ, అక్కిరాజు భట్టిప్రోలు, మహేష్ కత్తి, జీనా ఒబెరాయ్ వంటి ఎందరో ఉన్నారు.

శ్రీరామోజు హరగోపాల్, కత్తెరశాల కుమారస్వామి, పల్లిపట్టు ప్రత్యేకంగా కవితలు రాశారు. చేంజ్.ఆర్గ్ మీద అక్రమ కేసును ఖండిస్తూ ఒక సంతకాల ప్రకటన తయారైంది. దివైర్.ఇన్, బిబిసి తెలుగు, ది లీడ్.ఇన్, ది లాజికల్ ఇండియన్.కామ్ వంటి వెబ్ పత్రికలు వివరమైన వార్తా కథనాలు రాశాయి. కమిటీ టు ప్రొటెక్ట్ జర్నలిస్ట్స్ అనే అంతర్జాతీయ సంస్థ న్యూయార్క్ నుంచి ఈ అక్రమ కేసును ఖండిస్తూ ప్రకటన విడుదల చేసింది.

***రెండు రాష్ట్రాలలోనూ, దేశ వ్యాప్తంగానూ, అంతర్జాతీయంగానూ వెలువడిన స్పందనలో, నిరసన వెల్లువలో ఇది కొంత భాగం మాత్రమే. కష్టకాలంలో వీక్షణంతో నిలిచిన, సంఘీభావం ప్రకటించిన వారందరికీ వినమ్రంగా కృతజ్ఞతలు.***




**TELANGANA STATE UNION OF WORKING JOURNALISTS (TUWJ)**
(Regd.No.H-9/2014)
[ Affiliated to Indian Journalists Union (IJU), New Delhi ]

No.5-9-60/B, Desoddharaka Bhavan, Fateh Maidan, Hyderabad-500 001.
Telefax : 040-2323 2660 • E-mail : tuwj2014@yahoo.com • website : www.tuwj.net

మీడియా ప్రకటన Date: 18-11-2019

వేణుగోపాల్ పై అక్రమ కేసు ఎత్తివేయాలి

ఐజేయు, టీయుడబ్ల్యుజె

హైదరాబాద్: 'వీక్షణం' మాసపత్రిక సంపాదకుడు, సీనియర్ జర్నలిస్టు ఎన్.వేణుగోపాల్ పై పోలీసులు నమోదు చేసిన అక్రమ కేసును వెంటనే ఎత్తివేయాలని ఇండియన్ జర్నలిస్ట్స్ యూనియన (ఐజేయు), తెలంగాణ రాష్ట్ర వర్కింగ్ జర్నలిస్టుల సంఘం(టీయుడబ్ల్యుజె)లు సోమవారం నాడు విడుదల చేసిన ఒక ప్రకటనలో డిమాండ్ చేశాయి. ప్రజావ్యతిరేక విధానాలను ఎత్తి చూపినందుకు ఓ పత్రికా సంపాదకుడిపై పాలకుల కక్ష్య సాధింపు చర్యకు నిదర్శనం వేణుగోపాల్ పై అక్రమ కేసు నమోదు చేయడమేనని ఐజేయు అధ్యక్షులు కె.శ్రీనివాస రెడ్డి, టీయుడబ్ల్యుజె అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు నగునూరి శేఖర్, కె.విరాహత్ అలీ, ఐజేయు కార్యదర్శి వై నరేందర్ రెడ్డి, టీయుడబ్ల్యుజె ఉప ప్రధాన కార్యదర్శి విష్ణుదాస్ శ్రీకాంత్ లు ఆరోపించారు. ఈ చర్య రాజ్యాంగం కల్పించిన భావ ప్రకటన స్వేచ్ఛకు విరుద్ధమని వారు పేర్కొన్నారు. ఈ నెల 13న పోలీసులు కోర్టుకు అందించిన రిమాండ్ కేసు డైరీలో వేణుగోపాల్ పరారీలో ఉన్నాడని పేర్కొనడం అవాస్తవమన్నారు. అక్రెడిటెడ్ జర్నలిస్టు అయిన వేణుగోపాల్ ఎక్కడికి పారిపోలేదని, విధినిర్వహణలోనే ఉన్నాడని వారు స్పష్టం చేశారు. జర్నలిస్టుగా, రచయితగా, వక్తగా సుప్రసిద్ధుడైన వేణుగోపాల్ వ్యవస్థకు ప్రత్యామ్నాయ భావజాలం కలిగి ఉండడంతోనే ప్రభుత్వం కక్ష్య సాధింపు చర్యగా అతనిపై అక్రమ కేసు నమోదు చేసిందని ఐజేయు, టీయుడబ్ల్యుజె నాయకులు ఆరోపించారు.

(కె.విరాహత్ అలీ)
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి
టీయుడబ్ల్యుజె




**JAIBHARAT**
CONTINUATION OF THE INDIAN REVOLUTION

పత్రిక ప్రకటన
తేదీ : 24.11.2019, హైదరాబాద్.

**వీక్షణం పత్రిక సంపాదకుడు, ప్రజాస్వామ్య వాది, హక్కుల ఉద్యమకారుడు, విమర్శకుడు ఎన్. వేణుగోపాల్ ను అక్రమ కేసుల్లో ఇరికించి అరెస్ట్ చేయడానికి పోలీసులు, ప్రభుత్వం పన్నుతున్న కుట్రను జైభారత్ తీవ్రంగా ఖండిస్తోంది.**

ప్రభుత్వ అపసవ్య, అప్రజాస్వామిక ధోరణులపై నిరంతర పోరాటం చేస్తున్నందుకే వేణుగోపాల్ పై నిరంకుశంగా 'చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం' (UAPA) తో పాటు తెలంగాణ ప్రజాభద్రత చట్టం (TPSA) మొదలైన వాటికింద అక్రమంగా కేసులు బనాయించి నిర్బంధించాలని ప్రభుత్వం కుయుక్తులు పన్నుతోందని, వీటికి తక్షణమే స్వస్తి చెప్పాలని జైభారత్ డిమాండ్ చేస్తోంది.

వేణుగోపాల్ వివిధ పత్రికల్లో, వివిధ స్థాయిల్లో పనిచేసి, సుదీర్ఘమైన అనుభవం గడిచిన సీనియర్ జర్నలిస్టు . ఒక పత్రికకు సంపాదకుడిగా గౌరవస్థానంలో వున్న మేధావి. బహుగ్రంధ రచయిత.

ప్రజల కోసం, హక్కులకోసం, స్వేచ్ఛ కోసం ఎలుగెత్తే గొంతుల్ని నొక్కేయాలని చూసే ఇలాంటి ప్రయత్నా లు అత్యంత దారుణం. దుర్మార్గం. ప్రజాస్వామ్య వ్యవస్థకు చేటునీ, విఘాతాన్నీ కలిగించే పోలీసుల చర్యను జైభారత్ తీవ్రంగా ఖండిస్తోంది.

వేణుగోపాల్ ను అరెస్టు చేసే కుట్ర పూరిత చర్యలకు స్వస్తి చెప్పాలని, ప్రజాస్వామ్య వాదుల స్వేచ్ఛకు ఎలాంటి ఆటంకాలు కల్పించరాదని జైభారత్ ముక్త కంఠంతో డిమాండ్ చేస్తోంది.

| రజని | కె.లోక్‌నాద్ | సత్యనారాయణ గోల |
|---|---|---|
| జాతీయ కార్యదర్శి, జైభారత్ | జాతీయ కార్యదర్శి, జైభారత్ | జాతీయ కార్యదర్శి, జైభారత్ |

JAIBHARAT Central Head Qtrs: KHAN ABDUL GHAFFAR KHAN BHAVAN, 3-8-420, Suryodaya colony, L.B.Nagar, Hyderabad-68
Telangana. Mobile No 9849995538. Email: jaibharat02@gmail.com




**TELANGANA UNION OF WORKING JOURNALISTS**
PRESIDENT : ALLAM NARAYANA GENEREL SECRETARY : KRANTHI KIRAN

Date: 17.11.2019

**పత్రిక ప్రకటన**

వీక్షణం సంపాదకుడు ఎన్. వేణుగోపాల్ పై పెట్టిన అక్రమ కేసును వెంటనే ఎత్తివేయాలని తెలంగాణ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్టు సంఘం ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. మూడు దశాబ్దాల అనుభవం గల సుప్రసిద్ధ జర్నలిస్ట్ గా, తెలంగాణ ఉద్యమ కారుడిగా తన వంతు భూమిక పోషించిన వేణుగోపాల్ పై అక్రమంగా కేసులు పెట్టడం పత్రిక స్వేచ్ఛ కు భావ ప్రకటన స్వేచ్ఛ కు భంగకరమని ఆ సంఘం రాష్ట్ర నాయకులు అస్కాని మారుతి సాగర్, సయ్యద్ ఇస్మాయిల్, రమణ కుమార్ లు అభిప్రాయపడ్డారు. వేణుగోపాల్ అరెస్ట్ విషయంలో పోలీస్ ల చర్యను ఖండిస్తూ ఆయన పై నమోదు చేసిన కేసును వెంటనే ఎత్తివేసి బేషరతుగా విడుదల చేయని డిమాండ్ చేశారు.భిన్నాభిప్రాయాలు ప్రకటించే పాత్రికేయుల పై, మేధావుల పై కక్ష సాధింపు చర్యలు మానుకోవాలని అటు ప్రభుత్వాన్ని, ఇటు పోలీస్ శాఖను ఈ సందర్భంగా కోరారు.

| అస్కాని మారుతి సాగర్ | సయ్యద్ ఇస్మాయిల్ | ఎ.రమణ కుమార్ |
|---|---|---|
| TUWJ రాష్ట్ర కోశాధికారి | TEMJU రాష్ట్ర అధ్యక్షులు | TEMJU రాష్ట్ర ప్రధాన కార్యదర్శి |

Flat 103, Block - I, New MLA Quarters, Adarshnagar, Hyderabad, Email : tuwjh143stateoffice@gmail.com
Mobile No : 90107 56666, 80087 11884

## మానవ హక్కుల వేదిక

వీక్షణం రాజకీయ, ఆర్థిక మాసపత్రిక సంపాదకుడు, ప్రముఖ జర్నలిస్ట్ ఎన్. వేణుగోపాల్, ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు ప్రొఫెసర్, రచయిత, విరసం సభ్యుడు ప్రొఫెసర్ కాసింపై ఉపా – అన్‌లాఫుల్ ప్రివెన్షన్ ఆక్టివిటీస్ ఆక్ట్, తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ చట్టాల కింద అక్రమంగా తెలంగాణ పోలీసులు కేసులు బనాయించడాన్ని మా వేదిక తీవ్రంగా ఖండిస్తుంది. పోలీసులు కోర్టుకు సమర్పించిన నివేదికలో పూర్తిగా తప్పుడు వివరాలతో, ఈ ఇద్దరిని, తప్పించుకుని తిరుగుతున్నట్టుగా, వేణుగోపాల్‌ను విరసం సభ్యుడిగా పేర్కొన్నారు. ఎన్.వేణుగోపాల్ విరసం సంస్థ నుండి తప్పుకుని చాలా సంవత్సరాలైంది. మావోయిస్టు పార్టీ నక్సలైట్లతో సంబంధం ఉందన్న అనుమానంతో అరెస్ట్ చేసిన వారితో వీళ్ల పేర్లను చేర్చడం, అవాస్తవాలను పేర్కొనడం చూస్తే తెలంగాణ పోలీసులు కుట్రపూరితంగా వీరి పట్ల వ్యవహరిస్తు న్నారని అర్థమవుతుంది. వక్తలుగా, రచయితలుగా, ఆలోచనాపరులుగా వీరు ప్రభుత్వ పాలనపై, పని విధానంపై విమర్శలు పెడుతున్నారు. ఈ భావ ప్రకటన స్వేచ్ఛను, అణచడానికే వీరిపై అక్రమ కేసులు బనాయిస్తున్నట్టు మేము భావిస్తున్నాం.

ఎన్.వేణుగోపాల్, ప్రొ. కాసింపై పెట్టిన కేసులను ఉపసంహరించాలని, ఇదివరకే రకరకాల ఆరోపణలతో అరెస్ట్ చేసిన ప్రజా సంఘాల నాయకులను వెంటనే విడుదల చేయాలని మానవ హక్కుల వేదిక తెలంగాణ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంది.

*– వేమన వసంత లక్ష్మి, ఎస్. జీవన్‌కుమార్*
*(ఉభయ రాష్ట్రాల సమన్వయ కమిటీ సభ్యులు)*

# తెలంగాణలో ప్రశ్నించే గొంతులపై కత్తి

***తెలంగాణలో ప్రజా సంఘాల బాధ్యులపై, ప్రశ్నించేవారిపై గత రెండు నెలలుగా పోలీసులు సాగిస్తున్న దుష్ప్రచారాలను, బనాయిస్తున్న అక్రమ కేసులను వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

మొదటి విడత నాలుగున్నర సంవత్సరాల పాలనలోనూ, రెండో విడత గడిచిన ఆరు నెలల లోనూ తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం తెలంగాణ ప్రజా ఉద్యమ ఆకాంక్షలన్నిటినీ తుంగలో తొక్కి, అవినీతిమయమైన కుటుంబ పాలనకూ, పౌర ప్రజాస్వామ్య హక్కులపై ఉక్కుపాదానికీ తెగబడుతున్న స్థితిలో అన్ని ప్రజాసమూహాలలోనూ విపరీతమైన అసంతృప్తి చెలరేగుతున్నది. ఎన్నికలనూ, ఎన్నికల ఫలితాలనూ ఏదో ఒకరకంగా తనకు అనుకూలంగా మలచుకుని అధికారంలో కొనసాగుతున్నప్పటికీ పాలకులకు ఆ ప్రజా అసంతృప్తి వేడి తగులుతూనే ఉన్నది. అందువల్ల ఆ అసంతృప్తిని వ్యక్తీకరించే, సంఘటితం చేసే, నాయకత్వం వహించే శక్తులు లేకుండా చేయడమే ఏకైక లక్ష్యంగా ఇవాళ తెలంగాణ పాలకులు పావులు కదుపుతున్నారు. దానిలో భాగంగానే ప్రజల పక్షాన నిలిచి, ప్రభుత్వ విధానాలను ప్రశ్నిస్తున్న, విమర్శిస్తున్న ప్రజా సంఘాల నాయకుల మీద, వ్యక్తుల మీద, మొత్తంగా ప్రత్యామ్నాయ ఆలోచనా ధార మీద తెలంగాణ ప్రభుత్వం, పోలీసులు కత్తి కట్టారు.

గతంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పాలనలో 1969 నుంచీ తెలంగాణలో ప్రజా ఉద్యమాల మీద, ప్రజా సంఘాల మీద, ప్రగతిశీల, ప్రజాస్వామిక, విప్లవ శక్తుల మీద నిరంతరంగా సాగుతున్న ఈ దాడి గత రెండు నెలలుగా తెలంగాణ ప్రభుత్వ హయాంలో మరింత విచ్చలవిడిగా, నిస్సిగ్గుగా పెచ్చరిల్లడం మొదలయింది. దుష్ప్రచారాలతో, బెదిరింపులతో, అబద్ధాలతో, అక్రమకేసులతో, కనీస రాజ్యాంగ బద్ధ హక్కుల ఉల్లంఘనతో సాగుతున్న ఈ దమనకాండ గతంలో వెంగళరావు, చంద్రబాబునాయుడు, రాజశేఖరరెడ్డిల దుర్మార్గ పాలనలలో కన్న ఘోరంగా సాగుతున్నది.

ఈ దమనకాండ అక్టోబర్ మొదటివారంలో ఆర్టీసీ కార్మికుల సమ్మె మొదలైన తర్వాత పరాకాష్ఠకు చేరింది. తనకు ఎదురులేదని భావిస్తున్న ముఖ్యమంత్రి అహంకారపు బండారాన్ని ఆర్టీసీ కార్మికులు బైటపెట్టడంతో పాలకుల కళ్లు బైర్లు కమ్మాయి. ముఖ్యమంత్రి ఎన్ని బెదిరింపులు, హెచ్చరికలు, దుష్ప్రచారాలు, కుట్రలు, చీలిక ప్రయత్నాలు చేసినా కార్మికులు తమ వీరోచితమైన, సమరశీలమైన సమ్మెను కొనసాగించడంతో ప్రశ్నించే ప్రతి ఒక్కరినీ అనుమానించడం ప్రారంభమయింది.

ఒకరకంగా తెలంగాణ సమాజంలో ధిక్కార ధోరణి సద్దుమణగలేదని, సమయం కోసం వేచి చూస్తున్నదని, దొరహంకారాన్ని తెలంగాణ ఎంతమాత్రం సహించబోదని ఆర్టీసీ కార్మికుల సమ్మె తేటతెల్లం చేయగా, ఆ కార్మికుల మీద ఉక్కుపాదం మోపిన ప్రభుత్వం, వారికి క్రియాశీలక మద్దతు ఇస్తున్న ప్రజాస్వామిక శక్తుల మీద, విప్లవోద్యమ సానుభూతిపరుల మీద కూడ కత్తి గట్టింది. తెలంగాణ సమాజంలోని పోరాటశక్తులను ఆర్టీసీ కార్మికుల నుంచి దూరం చేసే కుట్రలు ప్రారంభించింది.

అక్టోబర్ 5న సమ్మె మొదలైన నాటి నుంచి, సమ్మె విరమణ జరిగిన నవంబర్ 25 దాకా, విరమణ మర్నాడు కూడ, ఆర్టీసీ కార్మికుల మీద ప్రభుత్వం ప్రదర్శించిన దమన నీతి దానికదే ఒక దుర్మార్గ చరిత్ర. డిపోల చుట్టూ పోలీసుల మోహరింపు, డిపోల దగ్గరా, బస్ స్టాండుల దగ్గరా కండక్టర్ల, డ్రైవర్ల విచ్చలవిడి అరెస్టులు, నిరసన ప్రదర్శనల మీద లాఠీచార్జిలు, బాష్పవాయు ప్రయోగాలు, కార్మికుల ఇళ్లమీద దాడి చేసి అరెస్టులు చేయడం, పనిచేసిన నెలకు కూడ జీతం ఇవ్వకపోవడం, నాయకత్వాన్ని, ట్రేడ్ యూనియన్లను చీలదీయడానికి ప్రయత్నాలు, సెల్ఫ్ డిస్మిస్ బెదిరింపులు, హైకోర్టు నాటకాలు, యాజమాన్యం, ప్రభుత్వం విడుదల చేసిన బెదిరింపు ప్రకటనలు... ఎన్ని జరిగినా కార్మికులు తమ పోరాటాన్ని ఆపలేదు.

ఆర్టీసీ కార్మికుల సమరశీల చైతన్యం ఇంత పెద్దఎత్తున వ్యక్తం కావడం వెనుక విప్లవోద్యమమో, విప్లవోద్యమ సానుభూతిపరులో, ప్రజా సంఘాలో ఉన్నాయని పాలకులు, పోలీసులు అనుమానించడం ప్రారంభించారు. సమ్మెకు మద్దతు ప్రకటిస్తున్న మిగిలినవాళ్లందరినీ ఏదో విధంగా ఎదుర్కోవచ్చు గాని, మావోయిస్టు ఉద్యమమో, వారి సానుభూతిపరులో సమ్మె వెనుక ఉంటే వారి ప్రభావాన్ని అడ్డుకోవడం కష్టమని పోలీసుల అంచనా. అసలు మొత్తంగానే మావోయిస్టులను తెలంగాణ నుంచి తుడిచిపెట్టాలని ఆశిస్తున్న, తుడిచిపెట్టామని ప్రగల్భాలు పలుకుతున్న పోలీసులకు ఆర్టీసీ సమ్మెలో మావోయిస్టులున్నారనే పేరుతో ప్రశ్నించే గళాలన్నిటి మీద కత్తి పెట్టడానికి కొత్త అవకాశం దొరికించుకోవాలని ఆశ కలిగింది.

నక్సలైట్లు, మావోయిస్టుల బూచి చూపితే పాలకుల నుంచి లెక్క చూపనక్కరలేని విపరీతమైన నిధులు, వాహనాలు, మితిమీరిన అధికారం దండుకోవచ్చు ననేది గత యాభై ఏళ్లలో పోలీసు వ్యవస్థ నేర్చుకున్న పాఠం. నక్సలైట్ ఉద్యమ అణచివేత పేరుతో గత ఐదు దశాబ్దాలలో పోలీసు అధికారులు కోట్లాది రూపాయల అక్రమ నిధులు, ఆస్తులు సంపాదించారు. పాలకులను నిరంతర భయంలో, అభద్రతలో ఉంచి సమాజం మీద ప్రశ్నించడానికి వీలులేని అధికారం సంపాదించారు. ప్రజాధనం కొల్లగొట్టినా, ప్రజలమీద ఉక్కుపాదం మోపినా సరే, తమ ప్రయోజనాలకు అడ్డు లేకుండా, ప్రజలను, ప్రశ్నించేవారిని తొలగిస్తే చాలునని పాలకులు కోరుకున్నారు. అలా 1960ల చివరి నుంచీ ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోనూ, ఇప్పుడు రెండు రాష్ట్రాలలోనూ పాలకులూ పోలీసులూ కనీస రాజ్యాంగ బద్ధ పౌర హక్కులకు అవకాశం లేని నిరంకుశ పాలన సాగిస్తున్నారు.

సరిగ్గా ఆర్టీసీ సమ్మె సమయంలో కూడ అమలైనది ఈ పాలక–పోలీసు నిరంకుశ వ్యూహమే. అంతకు ముందు నుంచే నల్లమలలో యురేనియం తవ్వకాలకు వ్యతిరేకంగా ప్రారంభమైన ఉద్యమాన్ని అణచివేయడానికి విప్లవ, ప్రజాస్వామిక శక్తుల మీద దాడి చేయాలని పోలీసులు ప్రయత్నిస్తున్నారు. ఇక ఆర్టీసీ సమ్మె మొదలైన వారంలోనే విప్లవ ప్రజా సంఘాల నాయకుల మీద దాడి ప్రారంభించి, కొందరిని అరెస్టు చేసి, కేసుల మీద కేసులు పెడుతూ, వారి బంధుమిత్రులను కోర్టు పనులలో తలమునకలు చేసి, మిగిలిన వారిలో అత్యధికులను ఎప్పుడు అరెస్టు చేస్తారో అనే సందేహాలు వ్యాపింపజేసి, విప్లవ, ప్రగతిశీల, ప్రజాస్వామిక సంస్థలను నిషిద్ధ సంస్థలుగా ప్రకటించి, మొత్తంగా విప్లవ, ప్రజాస్వామిక శిబిరంలో గందరగోళం వ్యాపింపజెయ్యాలని, అలా సమ్మెకు విప్లవోద్యమ మద్దతు తగ్గించాలని తెలంగాణ పాలకులు, పోలీసులు కుట్ర పన్నారు.

సమ్మె మొదలైన అక్టోబర్ 5 నుంచి గడిచిన ఆరు వారాలలో మూడు కొత్త కేసులు బనాయించి, వాటిలో 64 మందిని నిందితులుగా చూపారు. మూడు కేసులలోనూ ఉమ్మడిగా ఉన్న ఐదారు పేర్లు, అజ్ఞాత నాయకుల, కార్యకర్తల పేర్లు మినహాయిస్తే కనీసం యాభై మంది తెలంగాణ ప్రజాసంఘాల నాయకులను, కార్యకర్తలను, ప్రజాస్వామిక ఉద్యమాలలో పాల్గొంటున్న, ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను ప్రశ్నిస్తున్న తెలంగాణ బిడ్డలను ఇలా అక్రమ కేసుల్లో ఇరికించారన్నమాట. అలా విప్లవ శిబిరంలో భయభీతావహం వ్యాపింపజేయగలిగామని చంకలు గుద్దుకుంటున్నప్పటికీ పాలకుల, పోలీసుల మనసులలో భయం తొలగిపోలేదనడానికి నవంబర్ 9 చలో టాంక్ బండ్ లో మావోయిస్టులు ఉన్నారని ప్రకటించడమే చిహ్నం.

ఈ మూడు అబద్ధపు కేసుల ప్రక్రియను మరింత సూక్ష్మంగా చూస్తే పాలకుల ప్రయోజనాల కోసం తెలంగాణ పోలీసులు సాగించిన అక్రమాలు, అబద్ధాలు, చట్టవ్యతిరేక ప్రవర్తన తేటతెల్లమవుతాయి.

సరిగ్గా ఆర్టీసీ కార్మికుల సమ్మె ప్రారంభం కావడానికి ఒకరోజు ముందు అక్టోబర్ 4న గద్వాలలో ఒక ధర్నాలో పాల్గొని వస్తుండగా తెలంగాణ విద్యార్థి వేదిక గద్వాల జిల్లా కన్వీనర్ పులిగ నాగరాజును అక్రమంగా అరెస్టు చేసి అక్టోబర్ 5న అరెస్టు చేసినట్టుగా చూపారు. అలాగే, తెలంగాణ విద్యార్థి వేదిక రాష్ట్ర నాయకుడు పైనమోని బలరాంను అక్టోబర్ 7న మహబూబ్ నగర్ లో అరెస్టు చేశారు. వారి మీద భారత శిక్షా స్మృతి సెక్షన్ 120 బి, (నేరపూరిత కుట్ర) తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ సెక్షన్ 8 (1) (2) (చట్టవ్యతిరేక సంస్థ సభ్యత్వం, సభలో భాగస్వామ్యం, ఆ సంస్థ తరపున నిధుల వసూళ్లు), చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం సెక్షన్లు 18 (చట్ట వ్యతిరేక చర్యకు కుట్ర), 18 బి (చట్ట వ్యతిరేక చర్యకు మనుషులను పురిగొల్పడం), 20 (చట్ట వ్యతిరేక సంస్థలో సభ్యత్వం)ల కింద కేసు నమోదు చేశారు. ఈ కేసులో వారితో పాటు నిందితులుగా విరసం నాయకుడు, స్టూడెంట్ మార్చ్ సంపాదకుడు, ఉస్మానియా విశ్వవిద్యాలయ అధ్యాపకుడు కంతి జగన్, తెలంగాణ విద్యార్థి వేదిక అధ్యక్షుడు బండారి మద్దిలేటి, చైతన్య మహిళా సంఘం రాష్ట్ర కార్యదర్శి చుక్కల శిల్ప, కార్యవర్గ సభ్యురాలు గుంత రేణుక, తెలంగాణ ప్రజా ఫ్రంట్ రాష్ట్ర కార్యదర్శి మెంచు రమేశ్, ఉపాధ్యక్షుడు నలమాస కృష్ణల పేర్లు చేర్చారు. వీరిలో మద్దిలేటి ఇంట్లో లేని సమయంలో అక్టోబర్ 8న ఆయన ఇంటి మీద దాడి చేసి ఎలక్ట్రానిక్ పరికరాలు, పుస్తకాలు ఎత్తుకుపోయారు. మద్దిలేటి సహచరి చంద్రకళను బెదిరించారు. ఆమె ఫోన్ ఎత్తుకుపోయారు. ఆ తర్వాత అక్టోబర్ 11న జగన్ ను దారిలో అడ్డగించి, ఇంటికి తీసుకువెళ్లి రోజంతా ఇల్లు సోదా చేసి, తమ్ముడిని పిలిపించి లాప్ టాప్ తెప్పించుకుని, లాప్ టాప్, ఎలక్ట్రానిక్ పరికరాలు, పుస్తకాలు ఎత్తుకుపోయారు.

జగన్ అరెస్టు గురించి, అంతకు ముందరి అరెస్టుల గురించి చెప్పడానికి అక్టోబర్ 12న ఏర్పాటు చేసిన పత్రికా సమావేశంలో హైదరాబాద్ పోలీస్ కమిషనర్ "నిషేధిత సంస్థల జాబితా" పేరుతో తెలంగాణలో పనిచేస్తున్న ఇరవై మూడు ప్రజా సంఘాల జాబితాను పత్రికలవారికి అందజేశాడు. ఆ జాబితాలో ఉన్న పేర్లు: 1. ఆదివాసి విద్యార్థి సంఘం. 2. అమరుల బంధుమిత్రుల సంఘం. 3. చైతన్య మహిళా సంఘం. 4. సివిల్ లిబర్టీస్ కమిటీ. 5. కమిటీ ఫర్ ది రిలీజ్ ఆఫ్ ది పొలిటికల్ ప్రిజనర్స్. 6. డెమొక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్. 7. గిరిజన ఐక్య వేదిక. 8. హ్యూమన్ రైట్స్ ఫోరం. 9. కుల నిర్మూలన పోరాట సమితి. 10. పేట్రియాటిక్ డెమొక్రటిక్ మూవ్ మెంట్. 11. పీపుల్ అగెనెస్ట్ పోలవరం ప్రాజెక్ట్. 12. భూనిర్వాసితుల కమిటీ. 13. ప్రజా కళా మండలి. 14. తెలంగాణ అసంఘటిత కార్మిక సమాఖ్య. 15. తెలంగాణ డెమొక్రటిక్ ఫోరం. 16. తెలంగాణ ప్రజా ఫ్రంట్. 17. తెలంగాణ రైతాంగ సమితి. 18. తెలంగాణ విద్యార్థి సంఘం. 19. తెలంగాణ విద్యార్థి వేదిక. 20. తెలంగాణ యూత్ ఫోరం. 21. తుడుం దెబ్బ 22. విప్లవ రచయితల సంఘం. 23. విస్థాపన విరోధి జన వికాస్ ఆందోళన్. నిజానికి వీటిలో ఏ ఒక్క సంస్థా నిషేధానికి గురైనది కాదు. ప్రభుత్వం ఒక సంస్థను నిషేధించాలంటే జరగవలసిన చట్టబద్ధమైన ప్రక్రియ ఏదీ వీటిలో ఏ ఒక్క సంస్థ విషయంలోనూ జరగలేదు. వీటిలో కేవలం విప్లవ రచయితల సంఘంను మాత్రం 2005 ఆగస్ట్ లో అప్పటి రాష్ట్ర ప్రభుత్వం నిషేధించగా, చట్టబద్ధంగా ఏర్పడిన ముగ్గురు న్యాయమూర్తుల పర్యవేక్షణ కమిటీ ఆ నిషేధాన్ని కొట్టివేసింది. అలా 2005 నవంబర్ లోనే ఆ నిషేధాన్ని ఎత్తివేశారు.

ఒకవైపు అలా తప్పుడు నిషేధాల ప్రకటన వస్తుండగానే, అక్టోబర్ 15 ఉదయం తెలంగాణ ప్రజా ఫ్రంట్ కార్యాలయం మీద దాడి చేసి అక్కడి నుంచి నలమాస కృష్ణను, మద్దిలేటిని మహారాష్ట్ర నంబర్ ప్లేట్ ఉన్న వాహనంలో ఎత్తుకుపోయారు. వెంటనే కోర్టులో హెబియస్ కార్పస్ దాఖలైతే ఆ రాత్రికే వారిని గద్వాల కేసు నిందితులుగా అరెస్టు చేసినట్టు గద్వాల కోర్టులో హాజరు పరిచారు.

ఈలోగా భద్రాద్రి కొత్తగూడెం జిల్లా చర్లలో ఐతా అనిల్ కుమార్, దాసరపు సురేష్ అనే ఇద్దరు మావోయిస్టు కొరియర్లను పట్టుకున్నామని, వారి దగ్గర మావోయిస్టు పార్టీ తెలంగాణ రాష్ట్ర కార్యదర్శి హరిభూషణ్ రాసిన ఉత్తరాలు దొరికాయని అక్టోబర్ 20న కొత్తగూడెంలో పోలీసులు పత్రికా సమావేశం ఏర్పాటు చేశారు. వీరిలో అనిల్ కుమార్ తెలంగాణ విద్యార్థి వేదిక వరంగల్ జిల్లా కార్యదర్శి, న్యాయశాస్త్ర విద్యార్థి. ఈ అరెస్టుల తర్వాత మరొక కేసు తయారుచేసి అందులో వీరిద్దరితో సహా 45 మందిని నిందితులుగా చూపారు. భారత శిక్షా స్మృతి సెక్షన్ 120

బి, ఊపా సెక్షన్లు 10 (చట్ట వ్యతిరేక సంస్థలో సభ్యత్వం), 13 (చట్ట వ్యతిరేక కార్యకలాపాలు), 18, 20, తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ సెక్షన్ 8 (1) (2) ల కింద ఈ కేసు నమోదు చేశారు.

మావోయిస్టు పార్టీ నాయకులు హరిభూషణ్, దామోదర్, బండి ప్రకాశ్, ఆజాద్, భాస్కర్, లచ్చన్న, కంకణాల రాజిరెడ్డి, భద్రు, జజ్జరి సమ్మక్క, సుధాకర్ లతో పాటు తెలంగాణ ప్రజా ఫ్రంట్ నాయకులు కుసుమ రవిచంద్ర, నలమాస కృష్ణ, మెంచు రమేశ్, పౌరహక్కుల సంఘం నాయకులు డా. గడ్డం లక్ష్మణ్, నక్కా నారాయణరావు, తెలంగాణ విద్యార్థి వేదిక నాయకులు మద్దిలేటి, మెంచు సందీప్, తుడుం దెబ్బ నాయకులు రమణాల లక్ష్మయ్య, వట్టం ఉపేందర్, గంటా శ్యామ్, చైతన్య మహిళా సంఘం నాయకులు చుక్కల శిల్ప, దొంగరి దేవేంద్ర, దుబాసి స్వప్న, ఆత్మకూరు అన్నపూర్ణ, తెలంగాణ విద్యార్థి సంఘం నాయకులు కోట శ్రీనివాస్, ఎండి సమీర్, రషీద్ ఖాన్, డెమొక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ నాయకులు కంచర్ల బద్రి, ఎలకుర్తి అరుణాంక్, జనార్దన్, తెలంగాణ యూత్ ఫ్రంట్ నాయకులు పనికెల మోహన్ రాజు, గుందూరు పాండురంగారెడ్డి, భూక్య శ్రీనివాస్, పేట్రియాటిక్ డెమొక్రటిక్ మూవ్ మెంట్ నాయకులు చంద్రమౌళి, దుబాసి దేవేందర్, తెలంగాణ డెమొక్రటిక్ ఫ్రంట్ నాయకులు చిక్కుడు ప్రభాకర్, బండి దుర్గా ప్రసాద్, కమిటీ ఫర్ ది రిలీజ్ ఆఫ్ ది పొలిటికల్ ప్రిజనర్స్ నాయకులు బల్ల రవీంద్రనాథ్, బల్ల సావిత్రి, గొలుసుల జాబాలి, బచ్చలకూర సారంగపాణి, తెల్లూరి వెంకటేశ్వర్లు, తెలంగాణ రైతాంగ సమితి నాయకులు సాయన్నలను ఈ కేసులో నిందితులుగా చూపారు. అప్పటికే మొదటి కేసులో నిర్బంధితులుగా జైలులో ఉన్న నలమాస కృష్ణ, మద్దిలేటిలను ఈ కేసులో నిందితులుగా చూపడం మాత్రమే కాక, మరి కొన్ని పాత కేసులు కూడ తవ్వి తీశారు.

తర్వాత కొద్ది రోజులకే నవంబర్ 9న అయోధ్య భూవివాదం కేసులో సుప్రీం కోర్టు అన్యాయమైన తీర్పు ప్రకటించింది. ఆ తీర్పును విశ్లేషిస్తూ నవంబర్ 12న హైదరాబాద్‌లో ఒక పత్రికా సమావేశం ఏర్పాటు చేయాలని అఖిల భారత హిందుత్వ ఫాసిస్టు దాడి వ్యతిరేక వేదిక తలపెట్టింది. ఆ సమావేశం జరగవలసిన సమయానికి అక్కడ భారీగా మోహరించిన పోలీసులు ఆ సమావేశాన్ని భగ్నం చేసి, ప్రసంగించవలసిన కన్వీనర్లను, కార్యకర్తలను అరెస్టు చేసి, పత్రికా విలేఖరులను బెదరగొట్టి పంపేశారు.

సమావేశ సమయానికి ఐదు గంటల ముందే, ఉదయం ఆరున్నరకే కన్వీనర్ బి. అనూరాధ, ఆమె సహచరుడు ఎన్ రవి శర్మల ఇంటి మీద దాడి చేశారు. సోదా పేరుతో పదిహేను గంటల పాటు వారిని ఇంటిలోనే వేధించి, చివరికి రాత్రి తొమ్మిదిన్నర సమయంలో అరెస్టు చేసి తీసుకుపోయారు. అప్పటికి నమోదైన ఎఫ్ఐఆర్‌లో నిందితులుగా ఆ ఇద్దరి పేర్లు మాత్రమే ఉండగా, మర్నాడు మధ్యాహ్నం వారిని కోర్టులో హాజరు పరిచే సమయానికి సమర్పించిన రిమాండ్ కేస్ డైరీలో మరొక ఎనిమిది మందిని నిందితులుగా చేర్చారు.

ఐపిసి సెక్షన్ 120 బి రెడ్ విత్ ఐపిసి సెక్షన్ 34 (ఉమ్మడి లక్ష్యంతో ఇతరులతో కలిసి పనిచేయడం), యుఎపిఎ సెక్షన్ 10, 13, 18, 18 (బి), 20, తెలంగాణా స్టేట్ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ సెక్షన్ 8(1)(2) కింద నమోదైన ఈ కేసులో, వారిద్దరితో పాటు మావోయిస్టు పార్టీ నాయకులు నంబళ్ల కేశవరావు, మల్లోజుల వేణుగోపాల్, కటకం సుదర్శన్, హరిభూషణ్, విప్లవ రచయితల సంఘం నాయకులు సి. కాశీం, తెలంగాణ ప్రజా ఫ్రంట్ నాయకులు నలమాస కృష్ణ, మెంచు రమేశ్ లను, వీక్షణం సంపాదకుడు ఎన్. వేణుగోపాల్‌లను కూడ నిందితులుగా చూపారు. జైలులోనే ఉన్న నలమాస కృష్ణతో సహా మిగిలిన నిందితులందరూ "అబ్ స్కాండింగ్" (పరారీలో ఉన్నారు) అనీ, విరసంతో ఏ సంబంధం లేని వేణుగోపాల్‌ను విరసం సభ్యుడు అనీ పోలీసులకు సహజమైన అబద్ధాలు రాశారు.

ఈ మూడు కేసుల్లో కూడ కొందరిని అరెస్టు చేసిన, కొందరి ఇళ్ల మీద దాడి చేసి సోదాలు జరిపిన పోలీసులు ఒక్క సందర్భంలో కూడ చట్టబద్ధమైన సర్చ్ వారంట్ గాని, అరెస్ట్ వారంట్ గాని చూపలేదు. జప్తు చేసుకున్నామని ప్రకటించిన వస్తువులు నిజంగా వారి ఇళ్లలో జప్తు చేసుకున్నవో కావో తెలియదు. జప్తు పంచనామాల మీద సాక్షి సంతకాలు పెట్టినవారు చట్టంలో నిర్దేశించినట్టుగా "స్థానిక పెద్దమనుషులు" కాకపోగా, పోలీసులు తీసుకువచ్చిన సొంత సాక్షులే. అరెస్టు సందర్భాలలో చట్టబద్ధంగా కుటుంబ సభ్యులకు తెలియజేయ వలసిన పోలీసులు ఆ పని అతి తక్కువ సందర్భాలలో మాత్రమే చేశారు.

న్యాయవ్యవస్థ సూత్రాల ప్రకారమే పోలీసులు జత చేసిన ఒప్పుదల ప్రకటన (కన్ఫెషన్ స్టేట్‌మెంట్)లు న్యాయస్థానాలలో చెల్లవు. కాని ఈ మూడు కేసులలోనూ పచ్చి అబద్ధాలతో ఒప్పుదల ప్రకటనలు రాసి, ముందు అరెస్టయిన వారు ఆ ప్రకటన చేసినట్టుగా, తర్వాతి అరెస్టులు ఆ ప్రకటనల ఆధారంగానే జరిపినట్టుగా పోలీసులు తప్పుడు ప్రచారం చేస్తున్నారు. ఒకరి మీద ఒకరికి అనుమానాలు కలిగించే కుటిల ప్రయత్నాలు చేస్తున్నారు. ఆ ఒప్పుదల ప్రకటనలలో కేసులలో నిందితులుగా ఇంకా చూపని కొందరి పేర్లు కూడ ఉన్నాయంటే, రేపు మరికొన్ని అబద్ధపు కేసులు బనాయించదలచుకున్న పోలీసుల కుట్రపూరిత వైఖరి బైటపడుతుంది.

ఈ మూడు కేసులలోనూ కలిపి దాదాపు యాభై మంది బహిరంగ, ప్రజాసంఘ కార్యకర్తలను, ఏ సంఘంతో సంబంధం లేని వారిని నిందితులుగా చూపిన పోలీసులు వారిలో పది మందిని మాత్రమే ఇప్పటికి అరెస్టు చేశారు. అంటే మిగిలిన నలభై మంది మెడల మీద అరెస్టు కత్తి వేలాడుతున్నదన్నమాట. ఏ క్షణాన ఎక్కడ అరెస్టు చేస్తారోననే భయసందేహాలతోనే ప్రతి ఒక్కరూ తమ కార్యకలాపాలు సాగించాలన్న మాట.

ఇటువంటి భయభీతావహ పరిస్థితి, అబద్ధ ప్రకటనలు, బెదిరింపులు, సోదాలు, అరెస్టులు, తప్పుడు ఒప్పుదల ప్రకటనలు, మెడ మీద నిరంతరం కత్తి వేలాడుతుండడం కలగలిసిన ఈ మొత్తం కుటిల పథకపు లక్ష్యం ఒకటే – తెలంగాణ ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజావ్యతిరేక విధానాల గురించి ప్రశ్నించేవారు, మాట్లాడేవారు, విశ్లేషించేవారు, ప్రజలకు చైతన్యం కలిగించేవారు, ప్రజలను మేల్కొలిపేవారు, ప్రజలను సంఘటితం చేసి పోరాటాలలోకి నడిపించేవారు ఉండగూడదని మాత్రమే. చరిత్ర పొడవునా నిరంకుశ ప్రభువులెందరో ఇటువంటి దుర్మార్గ ప్రయత్నాలు చేశారు. వారిలో ఒక్కరైనా ఎల్లకాలానికీ విజయం సాధించలేదని కూడ చరిత్ర నమోదు చేసింది.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

# దేశాన్ని చీకట్లోకి నెడుతున్న అయోధ్య తీర్పు

*న్యాయవ్యవస్థపై ఎంతో కొంత ఉన్న నమ్మకం కూడా అయోధ్య తీర్పు ద్వారా సడలిపోయిందనీ, ఈ తీర్పు దేశాన్ని మరింత చీకట్లోకి నెడుతున్నదనీ అంటున్నారు* **హర్ష్‌మందర్**

మసీదు లేదా గుడి కట్టటానికి భూమిని కేటాయించడం అన్నది అసలు సమస్య కాదు. మసీదుని కూలగొట్టిన వాళ్లని శిక్షించాలా లేక ఆ నేరం జరిగిన స్థలంలో గుడి నిర్మాణాన్ని అనుమతించడం ద్వారా వాళ్లని సత్కరించాలా అన్నది అసలు ప్రశ్న.

అయోధ్యలో వివాదాస్పద భూమిపై చారిత్రకమైన తీర్పు వెలువడిన తరవాత భారతదేశంలో ఏదో బద్దలైంది, ఏదో జరిగింది, ఏదో మారింది. ఉత్తర్ ప్రదేశ్‌లోని ఒక చిన్న పట్టణంలో రెండు ఫుట్‌బాల్ మైదానాలంత ఉండే చిన్న స్థలంపై ఇంతకాలం నడిచింది కేవలం ఆస్తి హక్కు వివాదం కాదన్నది వరసగా అన్ని రోజులపాటు వాదనలు విన్న సర్వోన్నత న్యాయస్థాన విద్వాంసులైన న్యాయమూర్తులకు తెలియనిది కాదు.

మధ్య యుగాలనాటి కూల్చివేయబడిన మసీదుకి, ఇప్పటికీ ఊహల్లోనే ఉన్న బ్రహ్మాండమైన గుడికి మధ్య కూడా ఇది పోటీ కాదు. ఇది ఎటువంటి దేశం, భవిష్యత్తులో ఇది ఏమి కానున్నది, ఇది ఎవరికి చెందినది, ఈ విశాల భూమిలో భిన్న అస్తిత్వాలు, నమ్మకాలకు చెందినవాళ్లు ఏ షరతుల మీద ఇక్కడ కలసి జీవించాలి అన్నది ఇందులోని అసలైన వివాదం.

భారతదేశం అంటే ఒకే భావన, భారత దేశానికి ఒకే భావన ఉండేవి– దాని కోసం మహాత్మా గాంధి తన ప్రాణాలను సంతోషంగా బలిచేశాడు. అన్ని అస్తిత్వాలు, అన్ని మతాలకు చెందిన ప్రజలకు అన్ని విధాల ఈ దేశం చెందుతుందన్న భావన అది. భారతదేశ హిందు, సిక్కు, జైన, బౌద్ధ, క్రైస్తవ, పారశీ మతస్తుల లాగానే భారతదేశ ముస్లిం పౌరులు కూడా ఈ భూమి మీద సమానమైన హక్కుని ఆత్మవిశ్వాసంతో, చట్టబద్ధంగా కోరగలుగుతారన్న భావన అది. మత విశ్వాసాలు, నమ్మకాలు, సెంటిమెంట్ల మధ్య ఎక్కువ, తక్కువ బేధాలు ఉండవని, అధికసంఖ్య, కండబలం గల మతస్తుల వాదనలను మన్నించటానికి ఒక వర్గ ప్రజలు తమ వాదనలను వదులుకోనవసరం లేదన్న ఆశ్వాసన అది.

ఈ భావనకి వ్యతిరేకంగా భారత దేశం అంటే, భారత దేశానికి మరొక భావన ఉంది – ఈ దేశం దాని (ఉన్నత కుల) హిందూ ప్రజలకు చెందినదన్న భావన అది; భారత గడ్డపై పుట్టినందున సిక్కు, జైన, బౌద్ధ మతాలను అది స్వాగతిస్తుంది; కానీ 'విదేశీ' మతాలైన ఇస్లాం, క్రైస్తవ మతస్తులను అధిక సంఖ్యలో ఉన్న మత విశ్వాసాలకు, సెంటిమెంట్లకు లోబడి ఉండాలన్న షరతుపై 'అనుమతిస్తుంది'.

తీర్పు తొలి పేరాలను బట్టి ఈ వివాదాన్ని భారత దేశ హిందూ, ముస్లింల మధ్య వివాదంగా న్యాయమూర్తులు పరిగణించారని తేటతెల్లం అవుతోంది. ఇది సరి కాదు. హిందువులు, ముస్లిముల ప్రయోజనాలు, సెంటిమెంట్లకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని తమకు తాముగా ప్రకటించుకున్న సంస్థల మధ్య ఏర్పడిన వివాదం ఇది. ఆయా మతాలకు ప్రాతినిధ్యాన్ని వారికి ఎవరూ కట్టబెట్టలేదు, ఆ మతస్తుల విస్తృత ప్రజామోదం వీటికి ఉందన్న దాఖలాలు కూడా ఏమీ లేవు.

అయినప్పటికీ, వివాదాస్పదస్థలం ఇరుమతస్తులకు చాలా ప్రాముఖ్యత కలిగినదని తీర్పు తొలిపేరాలలో న్యాయమూర్తులు పేర్కొన్నారు. దావాలో ఉన్న వ్యక్తులు, సంస్థల పేర్ల స్థానంలో తీర్పులో పలు చోట్ల 'హిందువులు', 'ముస్లింలు' అని పేర్కొన్నారు. ఇది ఆందోళన కలిగించే విషయం, పక్క దోవ పట్టించే విషయం. మిలిటెంట్ హిందుత్వ సంస్థ అయిన విశ్వ హిందూ పరిషత్‌కు రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌తో దగ్గర సంబంధాలు ఉన్నాయి. కానీ, హిందువులలో అధిక సంఖ్యాకులకు ఇది ప్రాతినిధ్యం వహించడం లేదు. అలాగే ఉత్తరప్రదేశ్‌లోని సున్ని కేంద్ర వక్ఫ్ బోర్డు భారతీయ ముస్లిములందరికీ ప్రాతినిధ్యం వహించడం లేదు.

చరిత్రనీ, మతవిశ్వాసాలను విచారణలో సునిశితంగా పరిశీలించారు, కానీ చివరికి తీర్పులో వీటిని పరిగణనలోకి తీసుకోలేదని పేర్కొన్నారు. మసీదు ఉన్న స్థలంలో 12వ శతాబ్దానికి చెందిన ఒక మతపరమైన నిర్మాణం ఉండిందని, అది ఇస్లామిక్ మతానిది కాదని, అది హిందు గుడి అని పలు ఆధారాలు సూచిస్తున్నాయన్న నిర్ధారణకు న్యాయస్థానం వచ్చింది. అయితే, మసీదు నిర్మించడానికి ఆ గుడిని కూల్చేశారనడానికి ఎటువంటి ఆధారాలు లేవని కూడా తీర్పులో జోడించారు.

న్యాయస్థానం పేర్కొన్న పురావస్తు ఆధారం ఇదమిత్థంగా ఏమీ తేల్చలేదు. పైగా దానిపై కూడా అభిప్రాయ బేధాలు ఉన్నాయి. అదీ కాకుండా మసీదు కట్టిన చోట గుడి ఉండా లేదా అన్నది అప్రస్తుత ప్రశ్న. మసీదు ఉన్న చోట రాముని గుడి కట్టాలన్న ఉద్యమాన్ని ఎల్‌కె అద్వాణి మొదలుపెట్టినప్పుడు చరిత్రలో జరిగిందంటున్న తప్పిదాన్ని సరిదిద్దడానికి పూనుకున్నానని అన్నాడు. అయితే జరిగాయంటున్న అలాంటి చారిత్రక తప్పిదాలను సరిదిద్దడానికి 21వ శతాబ్దంలో సరైన న్యాయ, రాజ్యాంగ సూత్రాలు లేవు. అటువంటి సూత్రాలు ఉన్నప్పటికీ ఇది ఎక్కడ ఆపాలో ఎవరు నిర్ణయిస్తారు? ఈ 'దిద్దుబాటులు' ఇతర మతపర స్థలాలకు కూడా వర్తిస్తాయా? అంతే కాకుండా చరిత్రలో ఎంత వెనక్కి వెళ్లాలి? 500 సంవత్సరాల చరిత్రతోనే ఎందుకు ఆపాలి? 1000, 1500, 2000 సంవత్సరాల వెనక్కి ఎందుకు వెళ్లకూడదు?

9వ శతాబ్దం వరకు భారత దేశంలోని అనేక ప్రాంతాలు బౌద్ధ మతం కింద ఉన్నాయని నిరూపించే చారిత్రక దస్తావేజులు ఉన్నాయి. బ్రాహ్మణ హిందూ మతం ఎక్కువగా దారుణ హింసను ఉపయోగించి బౌద్ధాన్ని అణిచివేసి, నామరూపాలు లేకుండా చేసింది. హిందూ గుడులు ఉన్న చోట బౌద్ధ ఆరాధనా స్థలాలను పునరుద్ధరించాలని ఇప్పుడు అడగాలా? వేలాది సంవత్సరాలలో భారతదేశ అనేక ఆదివాసీ తెగల నుంచి హిందు ఆలయాల కోసం బలవంతంగా లాక్కున్న వాళ్ల ఆరాధనా స్థలాల సంగతి ఏమిటి? విద్వాంసులైన న్యాయమూర్తులు చరిత్రలో ఎంత వెనక్కి వెళ్లాలో మనకి సూచిస్తారా, సరిదిద్దటానికి కొన్ని చరిత్రలను ఎన్నుకుని, మిగిలినవాటిని ఎందుకు ఎన్నుకోకూడదో చెబుతారా? దానికంటే ముఖ్యంగా మన రాజ్యాంగంలో, మన చట్టాలలో ఏది ఈ ఎంపికలను సమర్థిస్తుందో స్పష్టం చేస్తారా?

# సి. రాఘవాచారికి జోహార్లు



కమ్యూనిస్టు పాత్రికేయ సంప్రదాయంలో కురువృద్ధుడు, విశాలాంధ్ర దినపత్రిక సంపాదకుడు చక్రవర్తుల రాఘవాచారి అక్టోబర్ 28న హైదరాబాద్‌లో మరణించారు. వరంగల్ జిల్లా పాలకుర్తి మండలం, శాతాపురం గ్రామంలో సాంప్రదాయిక బ్రాహ్మణ కుటుంబంలో 1939, సెప్టెంబర్ 10న పుట్టిన రాఘవాచారి కళాశాల విద్యార్థి దశలోనే వామపక్ష రాజకీయాల వైపు పయనించారు. డిగ్రీ వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలలోనూ, న్యాయశాస్త్ర పట్టా ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనూ తీసుకొని న్యాయవాద వృత్తి వైపు కాకుండా భారత కమ్యూనిస్టు పార్టీ ఆదేశాల మేరకు ఇంగ్లిష్ జర్నలిజంలోకి ప్రవేశించి లింక్, పేట్రియట్ పత్రికలకు విలేఖరిగా పనిచేశారు. ఆ తరువాత విశాలాంధ్ర దినపత్రికలో విలేఖరిగా, సబ్ ఎడిటర్‌గా చేరి సంపాదకుడిగా పదోన్నతి పొంది మూడు దశాబ్దాల పాటు విశాలాంధ్రలోనే పనిచేశారు.

సంస్కృతం, తెలుగు, ఇంగ్లిష్, ఉర్దూ భాషా సాహిత్యాలతో అపార పరిచయం కలిగిన రాఘవాచారి విశాలాంధ్ర సంపాదకీయాలు మినహా ఇతర రచనలు తక్కువగానే చేసినప్పటికీ ఉపన్యాసకుడుగా ఎనలేని కీర్తిని ఆర్జించారు. విజయవాడలో ప్రత్యేకంగానూ, ఉమ్మడి రాష్ట్రంలో అనేక చోట్ల ఆయన వందలాది ఉపన్యాసాలు చేశారు. మార్క్సిస్ట్ దృక్పథం నుంచి ఏ విషయాన్నైనా విశ్లేషించడం, వేదాల నుంచి రామాయణ, భారతాల నుంచి మొదలుపెట్టి మార్క్సిస్ట్ తాత్విక రాజకీయార్థిక సిద్ధాంతాల దాకా అనేక రచనల నుంచి అలవోకగా ఉటంకించడం, శ్రోతలను ఆకట్టుకునేలా ఉపన్యసించడం ఆయనను అనేక వేదికల మీద తప్పనిసరి ఉపన్యాసకుడిగా మార్చాయి. కొన్ని సంవత్సరాలుగా కాన్సర్‌తో బాధపడుతున్న రాఘవాచారి అక్టోబర్ 28న కన్నుమూశారు. ఆయన సహచరి, ప్రజాన్యాయవాది జ్యోత్స్నకు, కుటుంబ సభ్యులకు వీక్షణం సానుతాపాన్ని ప్రకటిస్తోంది.

తీర్పుకి 'అదనపు అంశం' జోడించిన విద్వాంసుడైన ఒక న్యాయమూర్తి మసీదు ఉన్న స్థలంలోనే రాముడు పుట్టాడన్న హిందువుల 'విశ్వాసం, నమ్మకం' అన్న అభిప్రాయంతో మసీదుని కూల్చేసిన స్థలాన్ని రాముడి గుడికట్టడానికి ఇవ్వాలన్న తోటి న్యాయమూర్తుల నిర్ణయాన్ని సమర్థించాడు. ఆస్తి వివాద పరిష్కారంలో ఒక సముదాయ విశ్వాసం, నమ్మకాన్ని ముడిపెట్టడం ఆసక్తికరంగానూ, ఆందోళనకరంగానూ ఉంది. రాముడు అయోధ్యలో పుట్టాడని హిందువులు నమ్ముతారన్నది నిజమే అయినప్పటికీ ప్రస్తుత అయోధ్య, రాముడు పుట్టిన అయోధ్య ఒకటేనా అన్నదానిపై అనేక అభిప్రాయాలు ఉన్నాయి. ప్రస్తుత అయోధ్యలో సైతం రాముడు ఇక్కడే పుట్టాడని స్థానికులు పలు ప్రదేశాలను పేర్కొంటూ ఉంటారు.

తీర్పు తొలి పేరాలో వివాదాస్పద స్థలం శ్రీ మహావిష్ణువు అవతారమైన 'రాముడి' జన్మస్థలమని హిందు సముదాయం నమ్ముతుందని పేర్కొన్నారు. ఇది ఏమాత్రం నిజం కాదు. కొంతమంది హిందువులు ఆ స్థలంలోనే రాముడు పుట్టాడని నమ్ముతారు, కొంతమంది నమ్మరు. కూల్చేసిన మసీదు స్థానంలోనే రాముడు పుట్టాడన్న 'విశ్వాసం, నమ్మకానికి' ఏ ఆధారాలతో రాముడు మరెక్కడో పుట్టాడన్న ఇతర హిందువుల 'విశ్వాసం, నమ్మకం' కంటే ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తారు?

మరొక నైతిక, న్యాయపరమైన అంశాన్ని తీర్పు పూర్తిగా పక్కన పెట్టింది. మసీదుని గుడిగా మార్చెయ్యడానికి దోహదం చేసిన మూడు నేరపూరిత చర్యల పరిణామాలను అది పట్టించుకోలేదు. 1949లో రహస్యంగా, చట్ట వ్యతిరేకంగా మసీదులో రాముని విగ్రహం ప్రవేశ పెట్టడం ద్వారా నమాజుకి అంతరాయం కలిగించటం మొదటి నేరపూరిత మైన చర్య. లాల్‌కృష్ణ అద్వాణి వంటి నాయకులు ప్రోత్సహిస్తుండగా ఉద్రేకపూరితమైన గుంపు 1992లో మసీదును కూల్చివేయడం రెండవది. యథాతథ స్థితికి భంగం కలిగించవద్దన్న కోర్టు ఆదేశాలను ధిక్కరించి మసీదు కూల్చేసిన 36 గంటలలో అదే స్థలంలో తాత్కాలిక రామ మందిరాన్ని కట్టడం మూడవ నేరపూరిత చర్య.

ఈ నేరాలలో కనీసం రెండింటిని తీర్పు గుర్తించింది, కానీ చట్టాన్ని అతిక్రమించినవాళ్లని, సుప్రీం కోర్టు ఆదేశాలను ఉల్లంఘించిన వారిని, అన్నిటికి మించి భారత రాజ్యాంగాన్ని, అన్ని మతాలు సమానం అన్న భారతదేశ స్వాతంత్ర్య పోరాట కీలక విశ్వాసాన్ని అగౌరవపరిచినవాళ్లని అది అంతిమంగా సత్కరించింది. వివాదాస్పద స్థలంలో మసీదు ఇంకా ఉండి ఉంటే ఈ తీర్పును ఊహించను కూడా ఊహించలేం. కావాలని చట్టాన్ని అవమానపరిచిన ఈ చర్యలను తీర్పు ప్రస్తావించింది, కానీ చట్టంపై, రాజ్యాంగంపై, సుప్రీం కోర్టుపై పలుమార్లు దాడిచేసిన వాళ్లకి అంతిమంగా ప్రయోజనం చేకూర్చింది. ఈ నేరాల కారణంగా 1989 నుంచి 1993 మొదలు వరకు చెలరేగిన మత కలహాలలో వందలాది అమాయక ప్రజలు చనిపోవటం కానీ, మానని ఆ గాయాలు దశాబ్దాల తరవాత దేశాన్ని రెండుగా చీల్చివేయడం కానీ కోర్టు పట్టించుకున్నట్టు లేదు. సుదీర్ఘకాలం పాటు కొనసాగిన ఈ వివాదంలో మసీదు, లేదా గుడి కట్టడానికి స్థలం చూపించడం అసలు సమస్య కాదన్న విషయాన్ని విస్మరించి మసీదు కట్టడానికి 5 ఎకరాల స్థలం కేటాయించడం సముచిత పరిహారం అని కోర్టు భావించింది. చట్ట విరుద్ధ చర్యకు పాల్పడిన వాళ్లకు ఆ నేర స్థలంలోనే గుడి కట్టడానికి అనుమతించటం ద్వారా వాళ్లకి బహుమతి ఇవ్వడమా, లేక శిక్షించడమా అన్నది అసలు సమస్య.

మన దేశం ఎటు వెళుతోందో తెలియచేసే ఈ తీర్పు అంతిమంగా ఎంతో ఆందోళన కలిగిస్తోంది. కొద్ది సంవత్సరాలుగా ఈ దిశ స్పష్టంగానే తెలుస్తూ ఉంది. అయినప్పటికీ, కమ్ముకుంటున్న ఈ తుఫాను చీకటి, విధ్వంసం నుంచి దేశమనే ఓడని అత్యున్నత న్యాయస్థానం తప్పిస్తుందన్న ఆశ ఉండింది. బలమైన గాలులను ఎదుర్కొని దేశ స్వాతంత్ర్య పోరాటంలో కలలు కన్న, రాజ్యాంగంలో వాగ్దానం చేసిన శాంతి, సమాన పౌరసత్వ మార్గానికి దేశాన్ని మళ్లిస్తుందన్న ఆశ ఉండింది. కానీ, అలా జరగలేదు. జరగవలసిన దానికి, జరిగిన దానికి ఈ క్షణాన్ని చరిత్ర చాలా కాలం గుర్తుంచుకుంటుంది.

*(అనువాదం కె. సురేష్)*

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

# రాజకీయపరమైన అయోధ్య తీర్పు

***గత పదిహేడు సంవత్సరాలుగా అయోధ్యలో రామమందిరం, బాబ్రీ మసీదు పేరుతో ప్రజల మతవిశ్వాసాలతో చెలగాటమాడిన రాజకీయ పక్షాలకు చివరికి దేశ అత్యున్నత న్యాయస్థానం కూడా వంతపాడినట్లుగానే అయోధ్య తీర్పు కనిపిస్తోందని అంటున్నారు* **చైతన్య**

**బా**బ్రీ మసీద్–రామజన్మ భూ వివాదంలో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి రంజన్ గొగోయ్ నాయకత్వంలోని బెంచ్ ఇచ్చిన తీర్పు చారిత్రాత్మకమైనది. తీర్పు కోసం ఆసక్తిగా ఎదురుచూసిన ప్రజలను ఆశ్చర్యానికి గురిచేయడంలోనూ తీర్పు విజయవంతం అయ్యింది. చారిత్రకంగా ఘర్షణ వాతావరణానికి కారణమవుతున్న అంశాలను ప్రణాళికాబద్ధంగా ఒక కొలిక్కి తీసుకువచ్చినట్లు, సామరస్యపూర్వకంగా హిందూ, ముస్లిం వర్గాలు తీర్పును స్వాగతించినట్లు మీడియా, పత్రికలు ఎత్తిపట్టి ప్రచారం చేశాయి.

హిందూ, ముస్లిం మతపెద్దలు ఇద్దరికి సమాన న్యాయం జరిగిందని నిజంగానే భావిస్తే సమస్యకు పరిష్కారం చూపడంలో సుప్రీంకోర్టు తీర్పుకు ప్రసార మాధ్యమాలలో జరిగిన సానుకూల ప్రచారం ఆహ్వానించదగినది. అర్థం చేసుకోదగినది. ప్రశంసించగలది. 67 ఎకరాల భూమిలో 5 ఎకరాల స్థలం ఇవ్వాలని కొందరు ముస్లిం మత పెద్దలు మాట్లాడడం మొదలైంది. ముస్లీం దృక్పథంలో నుండి చూసే రాజకీయ పార్టీలు ఈ పరిస్థితిని అనుకూలంగా మలుచుకొని బలపడే ప్రయత్నం చేస్తున్నాయి. బిజెపి ఎంత బలపడితే కౌంటర్ ఫోర్స్‌గా ఎంఐఎం లాంటి పార్టీలకు అంతే ప్రయోజనం ఉంటుంది. హిందూ మతపెద్దలు, బ్రాహ్మణ మతపెద్దలు ఎవరూ మాట్లాడవద్దు. సామరస్యత పాటించాలని పిలుపునివ్వడం, ఆ ఘట్టాన్ని ప్రధానమంత్రి, దేశ ప్రధాన న్యాయమూర్తి సమీక్షించడం సినిమాలాగా కొనసాగింది. ప్రతిపక్షాలు, మిత్రపక్షాలు ఏ ఒక్కటో రెండో తేడా లేకుండా తీర్పును ఆహ్వానించాయి.

కనీసం 1992 బాబ్రీ మసీదు కూల్చివేతకు నాయకత్వం వహించిన వారిపై చర్యలేమిటో కూడా ఎవరూ అడగలేదు. న్యాయం అమూర్తమైనది. ధర్మం రూపం లేనిదిగా మారిపోయింది. రామరాజ్యంలో కూడా నిండు సభలో నిషాదులు 'రాక్షసులు' నిలబడి మాట్లాడి తమ గొంతు వినిపించినట్లు పురాణాల్లో కనిపిస్తుంది. ఆధునిక రామరాజ్యంలో అస్పృశ్యుల ఆక్రోశాన్ని వ్యక్తీకరించే అవకాశం ఇవ్వకపోవడం ధర్మవిరుద్ధమని పండితులకు ఎక్కడా అనిపించినట్లు లేదు. పదవీ విరమణ చేసే ముందు ప్రధాన న్యాయమూర్తి చిరకాలం గుర్తుండే తీర్పు ఇస్తారని ఆశించిన అభాగ్యులకు షాక్ ఇచ్చాడు. ఆయన విశ్వాసాలు, ఆధారాలు, న్యాయం, చట్టం ఇలా అనేక విషయాలు స్పృశించినట్లు కనిపించింది. కానీ దేశ భవిష్యత్‌ను ఊహించలేదు.

ఒక్కోసారి నిర్జీవమైన కొన్ని విశ్వాసాలు సజీవమైన సమాజాన్ని శాసిస్తాయి. న్యాయం, ధర్మం గెలుస్తుందనే నమ్మకం సరైనదే కానీ చరిత్రలో గెలిచినదంతా న్యాయం కాదు. ధర్మం కూడా ఓడిపోయింది. ధర్మం, న్యాయం సాపేక్షికమైనవి. అవి స్థల కాలాలలో రూపాన్ని, సారాన్ని మార్చుకుంటాయని వేదాల సారం. రామజన్మభూమిగా లేదా బాబ్రీ మసీదుగా పిలువబడుతున్న స్థలంలో అన్ని సౌకర్యాలతో ఒక ప్రభుత్వ ఆసుపత్రో, కళాశాలనో, వృద్ధాశ్రమమో కట్టించాలని కోర్టు ఆదేశిస్తే ఈ 67 ఎకరాల హక్కుదారులు ఏం చేసేవారు? రాముడు పుట్టిన నేల అని అనుకుందాం. బాబర్ ఆక్రమించిండని అనుకున్నాం. ఇటువంటి వందల ఏండ్ల అక్రమాలను సక్రమం చేసే పని దేశ న్యాయస్థానాలు చేయాలంటే అసాధ్యమైనపని. సింధూ నాగరికత శిథిలాలను తవ్వితే వచ్చే పెంకాసులు, మట్టి, రాళ్లు ఒక్కో వరుస ఒక్కో సందేశం ఇస్తుంది. ఒక్కో జ్ఞాపకాన్ని చెపుతుంది. దేశ మూలవాసుల చరిత్ర ఒక్కో పేజీ బయటకు వస్తుంది. ఆక్రమించబడ్డ ఆదివాసుల, మూలవాసుల ఆరాధనాలయాలు, ఆస్తులు, హక్కులు, ప్రాంతాలు, చరిత్ర, సంస్కృతి, సంపద అన్ని తిరిగియ్యమని సర్వోన్నత న్యాయస్థానం ఆదేశిస్తే కొన్ని ఎకరాల భూమి కోసం ప్రాణాలిచ్చే మూర్ఖులు ఎవరుండరు.

అప్రకటిత మత దేశంగా వెలుగొందుతున్న దేశీయ స్థితిలో వచ్చిన సాహసవంతమైన తీర్పులలో ఇదొకటి. దీని పర్యావసానం నివురుగప్పిన నిప్పువంటిదని పాలకులకు కూడా తెలుసు. అయినా వారికి ఇబ్బంది లేదు. వారు నిప్పు రగులుకున్నా ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నారు. ఇంకా చెప్పాలంటే మతం చుట్టూ నిప్పు ఎంత వేగంగా రాజుకుంటే అంతమంచిది. ఈ దేశాన్ని తమ శ్రమను నమ్ముకున్న కష్టజీవులకు మాత్రమే ఈ స్థితి మింగుడుపడదు. వాళ్లకు 33 కోట్ల మంది దేవాది దేవతలను పూజించడానికి, అంతమందిని ప్రసన్నం చేసుకోవడానికి తగిన విశ్రాంతి సమయం దొరకని వారు. కనపడ్డ చెట్టుకో, పుట్టకో, రాయికో, రప్పకో, ఆకాశం వైపు చేతులు చాచే పరాజితులు. ఈ దేశ మూలవాసులు కోల్పోయిన తమ ఆదిమ దేవుళ్లు, పునర్ ప్రతిష్ట జరిగే తీర్పులు దేశంలో లభించవు. ఇది చాలా కష్టమైనపని.

బాబ్రీ మసీదు ఉన్నా రాజకీయమే, కూలినా రాజకీయమే. కూల్చింది కట్టాలన్నా ఓట్లు కొన్ని వస్తాయి. మసీదు కాదు మందిరం కట్టాలంటే మరిన్ని ఓట్లు వస్తాయి. ఆధునిక రాజనీతి తత్వవేత్త మాకియవెల్లి 500 సంవత్సరాల కింద ఇటలీ దేశం గురించి మాట్లాడుతూ, పాలకుడు ప్రజల పట్ల నిర్భయంగా ఉండాలన్నాడు. చాలా జిత్తులమారి ఎత్తుగడలు వేయాలన్నాడు. రాజ్య పాలకులకు ఇంకా ఎన్నో ఉదాత్తమైన సలహాలు ఇచ్చాడు. అంతకు 1500 ఏండ్ల ముందే ఇండియాలో జన్మించిన వేదభూమి పరిరక్షక తత్వవేత్తల్లో ఒక్కరైన కౌటిల్యుడు రాజు దేవున్ని నమ్మకూడదు కానీ ప్రజలను నమ్మించాలి అని ఉద్ఘాటించాడు. 2000 సంవత్సరాల తర్వాత జరగబోయే పరిణామాలను కూడా ముందే ఊహించిన కౌటిల్యుని దివ్యదృష్టిని ప్రశంసించకతప్పదు.

ప్రజాస్వామ్యంలో రామరాజ్యం నిర్మాణమైనా, రామరాజ్యంలో ప్రజాస్వామ్యం అయినా తేడా ఏముంది? అంతా సామరస్యమే, సానుకూలమే కదా!

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ప్రభుత్వ ప్రజారవాణాకు కాలం చెల్లినట్లేనా?

***ఆర్‌టిసి కార్మికులు చేసిన పోరాటం పట్ల న్యాయస్థానాలు, ప్రభుత్వాలు వ్యవహరించిన తీరును చూస్తే రాజీలేని పోరాటాలే పరిష్కార మార్గాలు అంటున్నారు బి.ఎస్.రాజు***

మానవ వికాస క్రమంలో రవాణా, ప్రయాణం అత్యంత ప్రధాన పాత్రను పోషిస్తూ వచ్చాయి. మానవ జీవనంతో ఈ రెండు వ్యవస్థలు పెనవేసుకుని అభివృద్ధి చెందాయి. బరువుల మోతకు, సరుకుల రవాణాకు, వ్యవసాయానికి, తాను మచ్చిక చేసుకున్న జంతువులను ఉపయోగించుకుంటూ వచ్చాడు మానవుడు. ఈ జంతువుల్లో చురుకైన వాటిని, వేగంగా నడవగలిగే వాటిని, పరుగెత్తే వాటిని ప్రయాణానికి సాధనాలుగా మలుచుకున్నాడు. యుద్ధ ప్రక్రియలో భాగం చేసుకున్నాడు. దున్నలు, ఎడ్లు, ఒంటెలు, గాడిదలు, గుర్రాలు, ఏనుగులు వగైరా జంతువులు మానవ వికాస క్రమంలో అద్భుతమైన పాత్ర పోషిస్తూ వచ్చాయి. వీటి శక్తి సామర్థ్యాలను మరింత మేలైన రీతిలో సాకారం చేసుకోవడానికి రకరకాల బండ్లు, వాహనాలు, రథాలు నిర్మించుకున్నాడు మానవుడు. తద్వారా రవాణా, ప్రయాణ, యుద్ధ అవసరాలను నెరవేర్చుకుంటూ మానవ జాతి ఇప్పటి ఆధునిక యంత్ర యుగంలోనికి ప్రవేశించింది.

వేగంతో కూడుకున్న ఆర్థిక, సామాజిక వ్యవస్థలు మంద్రస్థాయి ఆర్థిక, సామాజిక వ్యవస్థలను వెనక్కు నెట్టేస్తూ, రద్దుచేస్తూ రావడంతో రవాణా, ప్రయాణ వ్యవస్థల్లో జంతువుల, బండ్ల స్థానాన్ని యంత్ర వాహనాలు ఆక్రమించుకున్నాయి. ఈ మార్పులో భాగంగానే వ్యక్తిగత ప్రయాణం, సామూహిక ప్రయాణం, వేగవంతమైన సరుకుల రవాణా అనే విభజన చోటుచేసుకుంది. రాచరిక, భూస్వామ్య వ్యవస్థలు పెట్టుబడిదారీ వ్యవస్థలుగా మారే క్రమంలో ఏర్పడ్డ సామాజిక అంతరాలు, ప్రజా రాసులను నిరుపేద, పేద, మధ్యతరగతి, ఉన్నత, ధనిక, అతి ధనిక ప్రజా సమూహాలుగా విడగొట్టాయి. ఈ సమూహాల స్థోమతకు తగ్గట్టుగా ప్రజారవాణా, ప్రయాణ సాధనాలు, వ్యవస్థలు రూపు దిద్దుకున్నాయి. ఈ క్రమంలో సాధారణ ప్రజల ప్రయాణ, రవాణా అవసరాలను తీర్చే ఉద్దేశంతో ప్రభుత్వ యాజమాన్యంతో ఏర్పడ్డ వ్యవస్థలే రైలు, బస్సు సర్వీసులు.

స్వతంత్రం వచ్చి 70 ఏళ్లు దాటినా, క్రమేణా వ్యక్తిగత వాహన ప్రయాణం ఎంతగా పెరిగినా, ఇప్పటికీ దేశంలో అధిక శాతం పౌరులకు ఈ ప్రజారవాణా వ్యవస్థలే మూలాధారం. మరీ ముఖ్యంగా బస్సు ప్రయాణం గ్రామీణ భారతానికి పెద్ద దిక్కు. మారిన, మారుతున్న కాలానికి అనుగుణంగా అత్యంత నాణ్యమైన, మేలైన, పర్యావరణ హితమైన ప్రయాణ సౌకర్యాలను అందుబాటు ధరలతో ప్రజలకు అందించాల్సిన ఈ తరుణంలో ప్రభుత్వ రోడ్డు రవాణా వ్యవస్థలు తీవ్ర ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి కొనఊపిరితో కొట్టుమిట్టాడుతున్న దుస్థితి ఒకవైపు ఉంది.

ప్రజాస్వామ్యమే, ప్రజా సంక్షేమమే, పేద ప్రజల అభ్యున్నతే ధ్యేయమని ఓట్లు సంపాదించి అధికారం అందుకున్న రాజకీయ పార్టీలన్నీ ఈ ప్రజారవాణా వ్యవస్థలను ఎలా మెరుగు పర్చాలో, తీర్చిదిద్దాలో అనే ఆలోచన చేసేబదులు సర్వరోగాలకు మందు ప్రయివేటీకరణే అనే అప్రజాస్వామిక ప్రక్రియతో ప్రజారవాణా వ్యవస్థలకు మంగళంపాడే బాట ఎన్నుకున్న స్థితి మరోవైపు కనిపిస్తోంది. ఇటువంటి సంక్షుభిత స్థితి దేశం మొత్తం మీద ప్రజారవాణా సంస్థల్లో పనిచేస్తున్న లక్షలాది కార్మికులను, ఉద్యోగులను, వారి కుటుంబాలను అభద్రతకు గురిచేస్తోంది. ఏ రోజు ఏమి జరుగుతుందో, తమ సంస్థ ఉంటుందో, ఊడుతుందో, తమ ఉద్యోగాలు గాలిలో కలిసిపోతాయో ఏమోననే భయ వాతావరణం కార్మికులను ఆత్మహత్యలవైపు నెడుతోంది. గత 50 రోజులుగా కొనసాగుతున్న తెలంగాణ రోడ్డు రవాణా కార్మికుల సమ్మె ఈ నేపథ్యం నుండే ఉబికి వచ్చింది. ఈ నేపథ్యం నుండే ఈ సమ్మెను అర్థం చేసుకుంటేనే గాని దానికి సరైన పరిష్కార మార్గం దొరుకదు. అలాకాక ప్రజారవాణా వ్యవస్థను ప్రయివేటు వ్యక్తుల, సంస్థల చేతుల్లో పెట్టి ప్రభుత్వం చేతులు దులిపేసుకోవడం ప్రజాస్వామిక, ప్రజా సంక్షేమ దృక్పథం అనిపించుకోదు. ప్రభుత్వ ప్రజారవాణా సౌకర్యంపై ఆధారపడ్డ కోట్లాది సాధారణ ప్రజలకు ప్రయాణం మరింత భారమైపోతుంది. వైద్య, విద్య రంగాల ప్రైవేటీకరణతో కుటుంబ ఖర్చులు విపరీతంగా పెరిగి ఇప్పటికే సతమతమౌతున్న ప్రజలపై రవాణా రంగాన్ని కూడా ఇదేదారి పట్టించడం మరో కసాయి చర్యే !

రోడ్డు రవాణా సంస్థను (కార్పొరేషన్) ప్రభుత్వంలో విలీనం చెయ్యాలనే ఆర్‌టిసి కార్మికుల ప్రథమ డిమాండ్ ఇటువంటి కసాయి చర్యను ముందే పసిగట్టి, దాన్ని అడ్డుకుని సంస్థను కాపాడుకోవాలనే తప్ప అదేదో క్షమించరాని పెద్ద నేరమైనట్లు చిత్రించడం, ఆ డిమాండును బూచిగా చూపి, చేతికి చిక్కిందిరా పిట్ట అని దాని గొంతునులిమి చంపేయాలని చూడడం అత్యంత హేయం. అసాధ్యమైన ఈ డిమాండును మొదటి షరతుగా కార్మికులు పెట్టారు కాబట్టి దీనినే సాకుగా తీసుకుని అసలు చర్చలే ఉండవని, కార్మికులతో చర్చించాల్సిన అవసరంలేదని, వారంతట వారే సెల్ఫ్ డిస్‌మిస్ చేసుకున్నారని చెబుతూ, కాలయాపన చేస్తూ కార్మికులకు పనిచేసిన కాలానికి ఇవ్వవలసిన వేతనాలను కూడా ఇవ్వకుండా, వారి కుటుంబాలను బజారుకీడ్చి, అత్యంత క్షోభకు గురిచేసి కార్మికులను ఆత్మహత్యలకు గురిచేయడం ఇప్పటి వరకు చరిత్రలో జరిగిన అనేక హేయమైన చర్యలకన్నా అత్యంత హీనమైన చర్య. ఇటువంటి తెలంగాణ ప్రభుత్వ నియంతృత్వ ధోరణిని ప్రజలందరూ ముక్త కంఠంతో ఖండించాల్సి ఉంది. ఇటువంటి ఖండన, ప్రజా ఆందోళనకరువైంది కాబట్టే ప్రభుత్వం ఆర్‌టిసి కార్మికుల సమ్మెకు ప్రజల ఆమోదం లేదని, ప్రజలు వ్యతిరేకిస్తున్నారని, అందుచేత అది ముగిసిన ఘట్టమని, మూసేసిన పుస్తకమని తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రి మంకుపట్టుకు

కారణమౌతోందని చెప్పవచ్చు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగారి వాక్చాతుర్యతకు ముగ్ధులైన ఆర్‌టిసి కార్మికులు, వారి సమర్థకులు కోర్టు తమకేదో ఒరగబెడుతుందని పెట్టుకున్న ఆశలు చివరకు అడియాసలుగానే మిగిలిపోయాయి. దేశం మొత్తం మీద ఇపుడు అలుముకుని ఉన్న రాజకీయ ఒత్తిడుల బెదిరింపుల వాతావరణం కోర్టుల గొంతులను కట్టడి చేస్తున్నది. దీనికి తోడు తెలంగాణా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి గారు ప్రైవేటు రంగ సామర్థ్యంపై ప్రదర్శించిన అపారమైన ప్రేమ కార్మికుల నెత్తిపై సమ్మెట దెబ్బనే చెప్పాలి.

అసలే కిర్రెక్కి ఉన్న ముఖ్యమంత్రి చేతికి కోర్టు వారు మంచి అస్త్రం అందించినట్లయింది. ఈ మొత్తం వ్యవహారంలో ఆర్‌టిసి కార్మికులు తాలింపులో కరివేపాకుచందమై వారికి సంస్థపై ఏ హక్కూలేదనే స్థితికి నెట్టివేయబడ్డారు. ఇటు కోర్టు, అటు ప్రభుత్వం కూడా ఇపుడు కార్మికులను పోరాట మార్గం నుండి వేడుకోళ్ల దుస్థితికి నెట్టివేసింది.

రాజ్యవ్యవస్థ పునాదిని, స్వరూప స్వభావాలను అర్థం చేసుకోనంత కాలం, లెనిన్ అన్నట్లు; ఇక్కడే కాదు ఎక్కడైనా కార్మికులు పదేపదే బూర్జువా యాజమాన్యాల చేతిలో, బూర్జువా ప్రభుత్వాల చేతిలో ఓడిపోతూనే ఉంటారు. వారికి రెండే మార్గాలు మిగుల్తాయి. ఒకటి ఒంగి, లొంగి బతకడం, రెండు ప్రజాబలాన్ని కూడగట్టుకుని పోరాడి సాధించడం.

మరి ఇపుడు ఆర్‌టిసి కార్మికులు ఏం చేస్తారు? ఎలా తమ హక్కులను సాధిస్తారు? ఆర్‌టిసిని కాపాడడమే తమ లక్ష్యమని ప్రకటించిన విధంగా ఆ సంస్థను ఎలా కాపాడుకుంటారు? తమ మనుగడను, భవిష్యత్తును ఎలా నిలుపుకుంటారో చూడాల్సి ఉంది. పోరాడాలంటే ప్రజల మద్దతు పెద్ద ఎత్తున సమీకరించుకోవాలి. ఆ పనిలో ఆర్‌టిసి కార్మికులు వెనకబడి ఉన్నట్లు తోస్తోంది. ప్రజల కన్నా రాజకీయ పార్టీలను, కోర్టును నమ్ముకున్నట్లు చిత్రం కనిపిస్తున్నది.

ఇక ఆర్‌టిసి ఆర్థిక సంక్షోభం గురించి మాట్లాడాలంటే ఆదినుండి ఉమ్మడి రాష్ట్రంలో రోడ్డు రవాణా సంస్థ ఏర్పడ్డ నాటి నుండి అవినీతి పందికొక్కులు అంటే ఇటు సంస్థను నడిపించే ఉన్నత యాజమాన్యం, పై పోర ఉద్యోగులు, చాసిస్ నుండి మొదలుపెట్టి ప్రతి చిన్న వస్తువు, ఆఖరికి, చీపుళ్ళు, ఫినాయిలు వరకు బడా బడా కంపెనీల నుండి సాధారణ సప్లైదారు వరకు ఎవరికి అందినంత వారు దోచుకుని కుబేరులు ఎట్లయినారో నాలాంటి వాళ్లకు, ఆ సంస్థకు అనుబంధంగా చిన్నతరహా పరిశ్రమలు నడిపిన వారికి బాగా తెలుసు. ఆర్‌టిసి కార్మికులకు అందరికన్నా ఎక్కువ తెలుసు. అయినా వారు ఎప్పుడూ దీనిగురించి పట్టించుకున్న చరిత్రలేదు. దీనిపై ఏ యూనియన్ పోరాడిన చరిత్ర నాకైతే కనపడలేదు. తాత్కాలిక లబ్ధులతో సంతుష్టులై సంస్థ తగలబడి పోతున్నా కార్మికులు, వారి యూనియన్లు జీతాలపెంపుకై పోరాడారేమో కానీ, తమ సంస్థ మునిగిపోయే నావగామారి పోతోందని తెలిసీ ప్రభుత్వంలో కల్పుమనే డిమాండ్ పెట్టారు గాని వారు ఏనాడూ సంస్థ ప్రధాన రుగ్మతలపై నోరు విప్పలేదు. మనదేశంలో యూనియన్ల వ్యవహారం ఇలానే ఉంటూ వచ్చింది కాబట్టి కార్మికుల ఆలోచన విధానంలో ఎటువంటి మార్పు ఈనాటికీ చోటుచేసుకోలేదు. బస్సు ఇంజన్లలో అత్యంత ఖరీదైన క్రాంక్ షాఫ్ట్, కామ్షాఫ్ట్, పిస్టన్ వగైరా ప్రధాన విడి భాగాలు ఆర్‌టిసి ప్రధాన స్టోర్ల ముందు గేట్ల నుండి సప్లై చేయబడతాయి. అవే తిరిగి దొడ్డిదారిన గోడలు దాటి డీలర్ల గోడౌన్లకు చేరుకుంటాయి. మరల కొనుగోలుకై ఆర్డర్లు డీలర్లకు అందుతాయి. సప్లై అయినవి వాడుకున్నట్లు ఆర్‌టిసి పుస్తకాల్లో రాసుకుంటారు. డీలర్లు మరల సప్లై చేస్తారు. ఆడిట్లు జరుగుతాయి. గుట్టుగా ధనం, ఇతర లబ్ధులు చేతులు మారతాయి. ఇలా మొదట్లో విచ్చలవిడి దోపీడీ జరిగేది. ఇటువంటి డీలర్లు, అధికారులు కోట్లకు పడగలెత్తారు. ఈ దందాకు విజయవాడ పెద్ద అడ్డా.

ఈ భాగోతం కార్మికులకు, యూనియన్లకు తెలియనిదా? ఇటువంటి అవినీతి మురికి గుంటలో పడ్డ ఆర్‌టిసి ఏదోరోజు మునగకుండా ఉంటుందా? అయినా మనకెందుకు అప్పుడు చూసుకుందాం అనుకోబట్టే ఈనాడు ఆర్‌టిసికి ఈ దుస్థితి వచ్చింది. కార్మికులు, యూనియన్లు ఇది కాదనగలరా? ఇప్పటి తాజా స్థితి నాకు తెలియదుగాని ఉమ్మడి రాష్ట్ర ఆర్‌టిసితో సంబంధమున్న ఎంతో మంది వ్యాపారస్తులకు ఇది బాగా తెలుసు. ఈ డీలర్లు జరుపుకునే మందు పార్టీల్లో నవ్వులాటగా ఇవన్నీ చెప్పుకోవడం కూడా నాకు తెలుసు. డీలర్లు ఆర్‌టిసి అధికార్లను గుప్పెట్లో పెట్టుకోవడానికి అన్నిరకాల అడ్డదారులు తొక్కుతారు. ఏ అధికారికి ఏ బలహీనత ఉందో పసిగట్టి వాటిని మప్పుతారు. వాళ్లకు కావలసింది అడ్డదారి, అడ్డగోలు లాభాలు.

చాసిస్ల కొనుగోలు నుండి, బస్సు బాడీ నిర్మాణం నుండి, సకల విడి భాగాల కొనుగోళ్లు, చీపుళ్లు, ఫినాయిలు, కలరా ఉండల వరకు ఈ కమీషన్ల దందా నిరాఘాటంగా జరిగిపోతూ ఉంటుంది. చివరకు వీటన్నిటి పర్యవసానమేమిటి? మేటలు పడ్డ నష్టాలూ, అప్పులు. తెలంగాణ రాష్ట్రం విడిపోయినప్పుడు టిఎస్ ఆర్‌టిసి ఈ అప్పులు పంచుకుంది. అవినీతి పాపపంకిలం ఎవరు చేసినా ఇపుడు మోసేది, మోయబోయేది మట్టుకు కార్మికులు, ప్రజలే కదా! అందుచేత ఆర్‌టిసి వ్యవహారం కేవలం రాష్ట్ర ముఖ్యమంత్రికి, ఆర్‌టిసి కార్మికులకు మధ్య జరిగే తాడులాగుడు ఆటగా చూడడం సరికాదు. ఇది అసలు సమస్యను గాలికొదిలి, ప్రజలను మభ్యపెట్టి సుదీర్ఘ సేవ చరిత్రగల ఒక ప్రజా సంస్థను ప్రయివేటు వ్యాపారుల వేటకు చేజేతులా అప్పచెప్పడమే అవుతుంది. ఇది ఆర్‌టిసి కార్మికులకు ఎంత నష్టదాయకమో, అంతకు మించి తెలంగాణ రాష్ట్ర ప్రజలకు నష్టదాయకం అని గుర్తించి, ఆర్‌టిసి కార్మికులు, తెలంగాణ ప్రజలు ఐక్యంగా నిలబడి ప్రజారవాణా సంస్థను నిలబెట్టుకోవాలి.

ఇక్కడ రాష్ట్ర ప్రభుత్వ వైఖరి గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. అది అందరి ముందు పడగ విప్పి బుసకొడుతూ, కాటువేయ కాచుకు కూర్చున్న నాగుపాము దృశ్యమే కదా!

తెలంగాణను సాకారం చేస్తానని తెలంగాణ ప్రజలకు ఎంతో భరోసా ఇచ్చిన తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రి తెలంగాణ రోడ్డు రవాణా సంస్థను ఖూనీ చేయబోతున్నాడా? అలా ఖూనీచేసిన ప్రజా రోడ్డు రవాణా సంస్థ కళేబరాన్ని బంగారు పళ్లెంలో పెట్టి తెలంగాణా ప్రజలకు బహుమతిగా ఇవ్వదలచాడా? అంటే బహుశా అదే జరగవచ్చని జరుగుతున్న పరిణామాల ద్వారా ఊహించవచ్చు.

ఆర్‌టిసిని కాపాడుకుని, మేమే నడుపుకుంటాం! అనే నినాదంతో, పట్టుదలతో, పరిష్టమైన ప్రణాళికతో ప్రజలలో విస్తృత ప్రచారం చేబట్టడమే కార్మికుల ముందున్న ఏకైక మార్గంగా కన్పిస్తోంది. కార్మికులు, అన్ని యూనియన్లు, ఆర్‌టిసి హితులు ఐక్య పోరాటం చేయడం ద్వారానే ఇది సాధ్యపడుతుంది.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

# ఆర్‌టిసి కోసం రాజీలేని పోరాటం

*ఆర్‌టిసి కార్మికులు నియంత ముఖ్యమంత్రి అహంభావాన్ని, ఖాకీల కట్టడిని ఛేదిస్తూ ట్యాంక్‌బండ్‌పై మరో మిలియన్ మార్చ్‌ను విజయవంతం చేశారని అంటున్నారు* **రామటెంకి అశోక్**

**కా.** లెనిన్ – ప్రజాతంత్రం కోసం నిలకడగా పోరాడేది శ్రామిక వర్గం మాత్రమే. విప్లవ పోరాటంలో రైతాంగ జనసామాన్యం చేరితేనే అది ప్రజాతంత్రం కోసం విజయవంతమైన పోరాటం సాధించగల్గుతుంది అనే మాటలను గుర్తుచేస్తూ!

నవంబర్ 9న వేలాది మంది కార్మికులు, ఆర్‌టిసి జెఎసి నాయకులు, ప్రజలు శాంతియుతంగా నిర్వహించ తలపెట్టిన ట్యాంక్‌బండ్‌పై మిలియన్ మార్చ్‌ను నిర్బంధంతో అడ్డుకోవాలని టిఆర్‌ఎస్ ప్రభుత్వం చివరిదాకా విఫల ప్రయత్నాలు అనేకం చేసింది. మిలియన్ మార్చ్‌కు అనుమతి ఇవ్వకుండా ఒక్కరంటే ఒక్కర్ని కూడా ట్యాంక్‌బండ్ మీదకు రానివ్వబోమంటూ యావత్ తెలంగాణపై వేయి కళ్లతో నిఘా వేసింది. మిలియన్ మార్చ్‌కు వస్తున్న వేలాది మంది కార్మికులను, జెఎసి నాయకులను, రాజకీయ పార్టీల అగ్ర నేతలను, కార్యకర్తలను, ప్రజలను అరెస్ట్ చేసి, వాహనాలను అడ్డుకొని, లాఠీచార్జీలు జరిపి భగ్నం చేయాలని చూసింది. ఇలాంటి దుర్మార్గమైన నిర్బంధ పథకాలను రూపొందించి కార్మిక ఉద్యమ అణచివేతకు ముఖ్యమంత్రి కె. చంద్రశేఖరరావు, డిజిపి మహేందర్‌రెడ్డి దుష్టత్రయం నాయకత్వం వహించింది. అయినప్పటికీ కార్మిక స్ఫూర్తి ముందు ఇలాంటి ఫాసిస్టులు నల్లుల్లా మాడిపోక తప్పదు అనేది ఆనాడు రుజువు కాబడ్డది. ఎన్ని అడ్డంకులు కల్పించినా, ఎంతటి నిర్బంధం ప్రయోగించినా ఉవ్వెత్తున పొంగిన ఉద్యమ ఆకాంక్షల ముందు ఆంక్షలు ఆవిరయ్యాయి. ఈ నిర్బంధాలన్నింటినీ ఛేదించుకొని ఆర్‌టిసి కార్మికుల ఉద్యమ ఊరేగింపు ఆర్‌టిసి మహిళా కార్మికుల రక్తధారలతో జనసాగరమై హుసేన్‌సాగర్ ఒడ్డుకు చేరారు. కార్మికుల సమస్యలు సాధించుకు తీరుతామని ప్రతిన బూనారు. నిర్బంధాలతో, అణచివేతలతో ఏ శక్తులూ కార్మికుల గొంతును నొక్కలేరని నిరూపించారు. నవంబర్ 9న ట్యాంక్‌బండ్‌పై మరో మిలియన్ మార్చ్‌ను విజయవంతం చేశారు.

ఇప్పటి వరకు సుమారు 27 మంది దాకా ఆర్‌టిసి కార్మికులు తమ ఆత్మ బలిదానాలను – నిరవధిక సమ్మె విజయవంతం కావాలని ప్రభుత్వ, ముఖ్యంగా కెసిఆర్ మొండి వైఖరిని నిరసిస్తూ బలవన్మరణాలకు పాల్పడ్డారు. గత 40 రోజులుగా మహోధృతంగా సాగుతున్న నిరవధిక సమ్మెను మరింత అణచడానికి, బలహీనం చేయడానికే టిఆర్‌ఎస్ ప్రభుత్వం నిర్బంధకాండను అమలు చేస్తున్నది. ఆర్‌టిసి కార్మికుల, ఉద్యోగుల హక్కుల్ని కాలరాసివేస్తూ ఎస్మా ప్రయోగం చేస్తానని, అందుకు హైకోర్టును ఆశ్రయిస్తూ కార్మికుల మనోస్థైర్యాన్ని దెబ్బకొట్ట చూసింది. ఆర్‌టిసి బస్సుల డిపోలను, బస్టాండు ఆవరణలను పోలీసు క్యాంపులుగా మార్చివేసింది. కార్మికుల ప్రదర్శనలపై లాఠీచార్జీలు, రబ్బరు తూటాలను, భాష్పవాయు గోళాలు ప్రయోగించడం, రాళ్లు రువ్వడం, అక్రమ అరెస్టులకు పూనుకోవడం, బెదిరింపులు చేయడం లాంటి దుర్మార్గ చర్యలకు పాల్పడింది.

అంతే కాకుండా టిఎస్ ఆర్‌టిసి కార్మికులకు – మిగిలిన ప్రభుత్వ ఉద్యోగులకు మధ్య చిచ్చుపెట్టి, అగ్గిరాజేసి కార్మిక ఉద్యమాన్ని నీరుగార్చే కుటిల ప్రయత్నాలకు దిగజారుతున్నది. సమ్మెలో (మఫ్టీలో ఉండే పోలీసులతో) విచ్ఛిన్నకారుల్ని చొప్పించి కార్మికులపై దాడులు చేయ చూస్తున్నది. చేపిస్తున్నది. 50 రోజులుగా ఎంతో సహనంతో, శాంతియుతంగా ఆర్‌టిసి కార్మికులు నిరవధిక సమ్మెను కొనసాగిస్తున్న విషయం మింగుడుపడని ముఖ్యమంత్రి కెసిఆర్ కుట్రాజకీయానికి తెరదీస్తూ ఆర్‌టిసి నిరవధిక సమ్మెలో నిషేధిత మావోయిస్టు నక్సలైట్లు చొరబడ్డారని, హింస చెలరేగే అవకాశం ఉందని – నగర కమిషనర్‌తో ప్రకటించడం హాస్యాస్పదం.

రెండు టర్మ్‌లు తెలంగాణ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్న కెసిఆర్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం నిర్వహించిన అనేక శాంతి భద్రతల సమావేశాల్లో ముఖ్యమంత్రులు, డిజిపిల, హోం మంత్రుల సమావేశాల్లో మనరాష్ట్ర ముఖ్యమంత్రితో పాటు, హోం మంత్రులు, డిజిపి స్థాయి ఉన్నతాధికారులు పాల్గొని – తెలంగాణ రాష్ట్రంలో శాంతి భద్రతలు అదుపులో ఉన్నాయని, నక్సలైట్ల సమస్య పూర్తిగా మా రాష్ట్రంలో సమసిపోయిందని – ఒక్కరంటే ఒక్కరు కూడా మావోయిస్టులు లేరని నివేదికలు ఇచ్చిన సందర్భం ఉన్నది. ఇప్పుడు హఠాత్తుగా రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నడిబొడ్డున ట్యాంక్‌బండ్‌పై మిలియన్ మార్చ్ నిర్వహించే క్రమంలో నగర కమిషనర్ మావోయిస్టులున్నారని మాట్లాడడం విడ్డూరంగా ఉన్నది.

మావోయిస్ట్ ఎజెండానే మా ఎజెండా! అని కల్లబొల్లి మాటలు చెప్పిన తెరాస, అధికారంలోకి వచ్చిన నాటి నుండే తెలంగాణలో నిర్బంధాన్ని ప్రయోగిస్తూ వస్తున్నది. ప్రజాస్వామిక హక్కులను కూడా కెసిఆర్ ప్రభుత్వం కాలరాస్తున్నది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించుకోవాలనేది సుదీర్ఘకాలంగా కొనసాగిన ఒక ప్రజాస్వామిక ఆకాంక్ష. ఆ ఆకాంక్షను నెరవేర్చుకునేందుకు ఎన్నో పోరాటాలు జరిగాయి. ఎందరో ప్రాణాలు అర్పించారు. ఆ పోరాటాల, త్యాగాల ఫలితంగానే తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా సిద్ధించింది. ఫలితంగా తెరాస అధికారం చేపట్టింది. ఏ పోరాటాల మూలంగా తెరాస అధికారంలోకి వచ్చిందో ఆ పోరాటకారులను నేడు నిర్దాక్షిణ్యంగా చంపేస్తున్నది, అణచివేస్తున్నది.

ఆనాడు ప్రత్యేక తెలంగాణ కాదు, ప్రజాస్వామిక తెలంగాణ కావాలంటే కొంతమంది తెలంగాణవాదులు, మేధావులు తప్పుపట్టారు. ముందైతే తెలంగాణ రానివ్వండి అన్నారు. ఇట్లాంటి తెలంగాణనేనా ప్రజలు కోరుకున్నది? తెలంగాణ వస్తే తమ బిడ్డల బలిదానాలు ఆగుతాయని తెలంగాణ తల్లులు ఆశించారు. కానీ, ఇప్పటికీ వాళ్ల కడుపుకోతలు ఆగడం లేదెందుకు? ఆనాడు ఆంధ్రా సర్కార్ తెలంగాణ గాన కోకిల బెల్లి లలితను 17 ముక్కలుగా చేసి దారుణంగా హత్యచేస్తే,

ఈనాడు తెరాస మొదటి టర్మ్‌లో తెలంగాణ ముద్దుబిడ్డ శృతిని యాసిడ్ పోసి, బాయ్‌నెట్లతో పొడిచి, పేగులు బయటకు లాగి అత్యాచారం చేసి చంపేసింది. ఇది మరువక ముందే రెండవ టర్మ్‌లో భద్రాద్రి కొత్తగూడెం జిల్లా టేకులపల్లి పరిసర ప్రాంతాల్లో 9 మంది తెలంగాణ బిడ్డలను అతి కిరాతకంగా చంపి – భూటకపు ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లారు. మొన్నటికి మొన్న ఆదివాసి ప్రజలకు తలలో నాలుకగా ఉన్న, పోడు భూములకు రక్షణగా నిలిచిన సిపిఐ (ఎం–ఎల్) న్యూ డెమోక్రసీ నాయకుడు లింగన్నను పట్టుకొని చిత్రహింసలకు గురిచేసి గుండాల అడవుల్లో కాల్చి చంపారు.

ఇక్కడ సర్కార్ ఆంధ్రదా? తెలంగాణదా? అన్నది కాదు సమస్య. ఆ సర్కార్ ప్రజలకు ప్రాతినిధ్యం వహించేదా? లేకా పిడికెడు మంది దోపిడీ దారులకు ప్రాతినిధ్యం వహించేదా? అన్నదే అసలు సమస్య. ఆ సర్కార్‌ను నడిపేది తెరాసనా? మరో పార్టీనా అన్నది కూడా సమస్య కాదు. సర్కార్ దోపడీదారులకు ప్రాతినిధ్యం వహించినంతకాలం ఏ పార్టీ అధికారంలో ఉన్నా పాలనా నిరంకుశంగానే ఉంటుంది. అది పార్టీల స్వభావం కాదు – రాజ్య స్వభావంగా గుర్తెరగాలి.

టిఆర్ఎస్ ప్రభుత్వ ముఖ్యమంత్రి కెసిఆర్ నిర్బంధ చర్యలు, పరిమితంగా ఉన్న కొందరు తెలంగాణ వాదుల, మేధావుల భ్రమలను ఆర్‌టిసి కార్మికుల సమ్మె పటా పంచలు చేసిందిగా భావించవచ్చు. రాజకీయ పార్టీలు, వామపక్ష, కమ్యూనిస్టు పార్టీలు, ప్రజా సంఘాలన్ని ఐక్య ఉద్యమంగా రూపుదిద్దుకోవడం, అందులో అసంఖ్యాక ప్రజలు పాల్గొనడం, తెలంగాణ సమాజం చైతన్యాన్ని ప్రదర్శిస్తూ ఆర్‌టిసి కార్మికులకు మొక్కవోని ధైర్యాన్నిస్తున్నాయి. ఈ ఐక్యత మరింత బలపడి రాజ్య నిర్బంధానికి కళ్లెం వేయాలని, రాష్ట్రంలో ప్రజాస్వామ్య వాతావరణానికి ఊపిరి పోయాలని 4 కోట్ల మంది తెలంగాణ ప్రజలు ఆకాంక్షిస్తున్నారు. ప్రజాశక్తి ముందు ఎంతటి నిరంకుశ రాజ్యమైనా నిలబడదన్న సత్యాన్ని ఆర్‌టిసి – కార్మికుల సమ్మె కెసిఆర్‌కు కనువిప్పు కల్గించాలి.

ఆర్‌టిసి కార్మికుల నిరవధిక సమ్మె పోరాట ప్రభావం నేడు దేశ వ్యాప్తంగా మంచి ప్రభావాన్ని వేస్తున్నది. వారి పోరాటం భవిష్యత్ ఉద్యమాలకు బలమైన ప్రేరణను అందిస్తుంది. ప్రస్తుతానికి ఆర్‌టిసి కార్మికులకు మద్దతుగా నిలబడడం రాష్ట్ర ప్రజల ముందున్న ఒక ముఖ్య కర్తవ్యం. అలాగే ఆర్‌టిసి కార్మికుల సమ్మెకు సంఘీభావంగా ఉన్న వివిధ జెఎసిలు, కార్మికుల్లో వ్యక్తమైన బలమైన పోరాట సమైక్యతకు అనుగుణంగా, మరింత విశ్వాసంతో ముందుకు సాగుతూ ఆయా సందర్భాలలో తమలో వ్యక్తమవుతున్న ఊగిసలాటను పక్కకు పెట్టి కార్మికుల న్యాయమైన ఆందోళనకు సరియైన నాయకత్వాన్ని అందివ్వాలి. మరింత పట్టుదలగా, ఉధృతంగా పోరాటాన్ని కొనసాగించాలి. టిఎస్ ఆర్‌టిసి కార్మికుల డిమాండ్లకు పరిష్కారం లభించాలంటే కష్టతరమైన పోరాటాలకు సిద్ధపడడం ఒక్కటే ఏకైక మార్గంగా చాటి చెప్పాలి.

చరిత్ర ఎన్నో త్యాగాలు, సాహసోపేతమైన ఆచరణలతో మాత్రమే ముందుకు సాగుతుంది. విజయం – అపజయం ఇలా ఎన్నో అపజయాల తర్వాతనే అంతిమ విజయం లభిస్తుంది. చరిత్రలో మనం ఇలాంటి ఎన్నో ఉదాహరణలు చూసి ఉన్నాం. ఈ సందర్భంగా..! స్కాట్లాండ్ జాతీయ వీరుడు రాబర్ట్ బ్రూస్ బ్రిటిష్ రాజ్యం నుండే విముక్తి కోసం చేసిన పోరాటాన్ని గుర్తుచేసుకుంటూ – ఆ పోరాటం స్ఫూర్తిగా నేటి ఆర్‌టిసి కార్మికులు చేస్తున్న నిరవధిక సమ్మె భవిష్యత్ పోరాటాలకు టార్చ్ బేరర్‌గా మార్గం చూపుతుందని ఆశిద్దాం!

ప్రజల కనీస హక్కులను కూడా కాలరాసివేస్తున్న తెరాస ప్రభుత్వం సులభంగా ఆర్‌టిసి కార్మికుల సమస్యను పరిష్కరించే ప్రక్రియ ప్రారంభిస్తుందని ఆశించడం ఇసుక నుంచి తైలం తీయడం లాంటిదే. గత చరిత్ర చూసినా తెలంగాణ ప్రజలు తమ కనీస హక్కుల సాధనకు ఎంతరక్తం దారపోయవలసి వచ్చిందో తెలిసిందే. దీర్ఘకాలిక, సమైక్య, ఆందోళనకు సిద్ధం కావడం, పోరాటమే ఏకైక మార్గంగా ముందుకు సాగడం ద్వారానే రాష్ట్ర తెరాస ప్రభుత్వం, ముఖ్యమంత్రి చంద్రశేఖరరావు మెడలు వంచి ఆర్‌టిసి – కార్మికుల డిమాండ్లు పరిష్కరించబడతాయి తప్ప – ఉదాసీన వైఖరి అవలంబించడం లేదా కోర్టులను నమ్ముకుంటే సమస్య ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అన్న చందంగా మారడమో లేక నిర్వీర్యమై పోవడమో జరుగుతుంది.

ఆర్‌టిసి కార్మికులు చేపట్టిన నిరవధిక సమ్మె అనూహ్యంగా రాష్ట్ర హైకోర్టు మెట్లెక్కింది. ప్రధాన న్యాయమూర్తులు పిటిషరన్ తరుపు న్యాయవాదుల వాదనలు విని తెరాస ప్రభుత్వాన్ని వివరణ కోరితే, టిఆర్ఎస్ ప్రభుత్వం నుండి గానీ, ముఖ్యమంత్రి కెసిఆర్ వైపు నుండి గానీ కించిత్తు స్పందన రాలేదంటే – రాజ్యాంగం పట్ల, కార్మికుల సమస్య పట్ల తెరాస ప్రభుత్వానికి ఉన్న చిత్తశుద్ధేమిటో కార్మికులు, రాజ్యాంగ కాపలాదారులు సునిశితంగా పరిశీలించాలి.

అనేక దఫాలుగా తెరాస ప్రభుత్వాన్ని వివరణ కోరిన హైకోర్టు – విసిగి వేసారిపోయి ఎలాగైనా కార్మికుల సమస్య, ప్రజా అవసరాలను బాధ్యతగా భావించిన న్యాయస్థానం మధ్యవర్తిత్వం వహిస్తూ... ముగ్గురు సుప్రీంకోర్టు విశ్రాంత న్యాయమూర్తులతో ఉన్నత స్థాయి మధ్యవర్తిత్వ కమిటీని నియమించి, కార్మికుల సమస్యను పరిష్కరించే ప్రయత్నానికి పూనుకుంటే – ఆ న్యాయస్థానం మాటలను బెఖాతరు చేసిన తెరాస ప్రభుత్వం, ముఖ్యమంత్రి కెసిఆర్ జడ్జీల కమిటీని వేయలేం, ఆర్‌టిసి సమ్మెను లేబర్ కోర్టు విచారణకు పంపించండనే ఉచిత సలహాను హైకోర్టుకు సూచించారు. సమస్య పరిష్కారానికి స్పష్టమైన ప్రకటన చేయకపోగా, ఆ వైపు చర్యలు ప్రారంభించకుండా ఇంకా సాగదీయడం సమస్యను అటకెక్కించడం తప్ప మరోటి కాదనేది స్పష్టమవుతున్నది.

దేశంలో ప్రజా ఉద్యమాలకు, నిరసనలకు కారణమైన అనేక సమస్యలపై వేసిన కమిటీలు, కమిషన్‌లు, జరిపిన విచారణలు ఎంత బూటకంగా, ప్రహసనంగా మారాయో ప్రజలందరికీ తెలుసు. బాబ్రీ మసీదు విధ్వంసంపై విచారణ పేరిట దశాబ్దాలుగా సమస్యను సాగదీసి మొన్నటికి మొన్న సమర్పించిన తాజా నివేదిక, సాధించిన ఘనకార్యం ఏపాటిదో ఇందుకు చక్కటి ఉదాహరణ. తీర్పు న్యాయబద్ధంగా ఉండి ఉంటే ప్రభుత్వానికి ఇంత భయం దేనికి? ఈ తీర్పు హిందూ ఫాసిస్టు తీర్పు అనడానికి ఈ అణచివేతే నిదర్శనం. దేశంలోని అత్యున్నత న్యాయస్థానాన్ని ఫాసిస్టు శక్తులు దురాక్రమించడానికి ఇంతకంటే ఏం కావాలి? మరో ఉదాహరణ చూస్తే కశ్మీర్ తరతరాల ఒక స్వతంత్ర దేశాన్ని భారత పాలకులు, మతోన్మాద బిజెపి 370 ఆర్టికల్‌ను రద్దుచేసి దురాక్రమించుకొని సమస్యను పరిష్కరించినట్లు దేశ, విదేశాల్లో అంతర్జాతీయ వేదికల్లో నిస్సిగ్గుగా విపరీత ప్రచారం చేసుకుంటున్నారు. బోఫోర్స్ కుంభకోణం, షేర్ల కుంభకోణం, ఎరువుల, స్టాంపుల కుంభకోణాలు, 1984 సిక్కుల ఊచకోతపై, గుజరాత్ అల్లర్లపై, రాఫెల్ యుద్ధ విమానాల కుంభకోణాలపై వేసిన విచారణ కమిటీలు సాధించిందేమిటో దేశ ప్రజలకు తెలియంది కాదు.

మొత్తం ఆర్‌టిసిలోని 48 వేల మంది కార్మికులతో పాటు, రాష్ట్ర ప్రజల్లోని మెజారిటీ ప్రజలు ఆర్‌టిసి కార్మికుల న్యాయమైన డిమాండ్ల

# ఏ విలువలకీ ప్రస్థానం?

***పత్రికాస్వేచ్ఛ మీద ఆంక్షలు విధిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని పాత్రికేయ ఉద్యమ నాయకులే సమర్థించడాన్ని ప్రశ్నిస్తున్నారు*** **గోవిందరాజు చక్రధర్**

"పోతాన్ జోసెఫ్ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు సంపాదకుడుగా ఉండేవాడు. అది కాంగ్రెస్ విధానాన్ని అనుసరించే పత్రిక. తీరా ఎక్కువ జీతమిస్తామని చెప్పి ముస్లిం లీగ్ పత్రికవాళ్లు ఆయనను సంపాదకుడిగా తీసుకెళ్లారు. పత్రికా రచన అనేది న్యాయవాద వృత్తిలాంటిదే అనే పోతాన్ జోసెఫ్ తనను తాను సమర్థించుకున్నాడు.

...టైమ్స్ ఆఫ్ ఇండియాలో న్యూస్ ఎడిటర్‌గా పనిచేస్తున్న కోటంరాజు రామారావు ఆ రోజుల్లో చాలా ఎక్కువ జీతభత్యాలే పుచ్చుకునేవారు. కానీ, సత్యాగ్రహోద్యమ కాలం సమీపించేటప్పటికీ అంతమంచి ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి తనకు దేశం పట్ల ఏదో బాధ్యత ఉందని నమ్మి చాలా తక్కువ జీతం ఇచ్చే పత్రికలో చేరాడు. ఆపైన అరెస్టయ్యాడు. ఏది ఏమైనా పోతాన్ జోసెఫ్‌లా ఆత్మగౌరవాన్ని అమ్ముకునేవాళ్లు, కోటంరాజు రామారావులా ఆత్మగౌరవాన్ని కాపాడుకునేవాళ్లు అప్పుడూ ఉన్నారు, ఇప్పుడూ ఉన్నారు."

ప్రసిద్ధ పత్రికా రచయిత జి. కృష్ణ గతంలో ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పిన మాటలివి.

'ఒకవేళ దావూద్ ఇబ్రహీం పత్రిక నడుపుతున్నడు అనుకుందాం. ఆ పత్రికలో పనిచేస్తుంటే దావూద్ చెప్పినట్లే నడుచుకోవాలా?' అనే ప్రశ్న తలెత్తుతుంది.

దావూద్ ఇబ్రహీం ఎవరు? అతగాడు మీడియాలోకి ఎందుకు వచ్చాడు. మీడియా ద్వారా ఏమి సాధించాలనుకున్నాడు? అతడి మీడియాలో పనిచేయటం ద్వారా వ్యక్తిగతంగా ఏయే విలువలను కోల్పోవాల్సి వస్తుంది? అలా కోల్పోవడానికి నేను సిద్ధమేనా? లేక నమ్మిన సిద్ధాంతం కోసం కష్టాలను భరిస్తూ దావూద్ పత్రికలకు దూరంగా ఉంటానా? అనేది ఎవరికి వారు వ్యక్తిగతంగా నిర్ణయించుకోవాల్సిన విషయాలు.

పత్రిక స్వేచ్ఛను కట్టడి చేస్తూ ఆంధ్రప్రదేశ్‌లో జగన్ మోహన్ రెడ్డి ప్రభుత్వం తెచ్చిన జిఓ పై ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ కొన్ని పత్రికల్లోనూ, సామాజిక మాధ్యమాల్లోనూ పెద్ద చర్చే నడుస్తోంది.

ఈ జిఓను సమర్థిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సలహాదారులుగా ఉన్న కె రామచంద్రమూర్తి, దేవులపల్లి అమర్ చేసిన ప్రకటనలపై జర్నలిస్టుల నుంచి వ్యతిరేకత, నిరసనలు వ్యక్తమవుతున్నాయి.

డబ్బులకు కక్కుర్తిపడి ప్రభుత్వ కొమ్ముకాస్తున్నారని, జర్నలిస్టుగా ఇప్పటివరకు పాటిస్తూ వచ్చిన విలువలను, అనుసరిస్తూ వచ్చిన పద్ధతులను వదిలిపెట్టి ఇలా నిర్లజ్జగా జిఓను సమర్థించడం ఎంతవరకు సబబు? అని నిలదీస్తున్నారు.

పత్రికా స్వేచ్ఛకు విఘాతం కలిగినప్పుడు గతంలో కె రామచంద్ర మూర్తి రాసిన సంపాదకీయాలను గుర్తుచేస్తున్నారు. అలాగే, దేవులపల్లి అమర్, చంద్రబాబు హయాంలో సాక్షిలో రాసిన కాలమ్స్‌లో వ్యక్తం చేసిన అభిప్రాయాలను కూడా ప్రత్యేకంగా పేర్కొంటున్నారు. ఆ కాలమ్స్ ను సేకరించి మరీ సోషల్‌మీడియాలో పోస్టు చేస్తున్నారు.

దేవులపల్లి అమర్ మొదటినుంచి జర్నలిస్టుల ఉద్యమాల్లో చురుకుగా ఉంటూ ఎదిగివచ్చినవారు. ఇటు రాష్ట్రంలోనే కాక జాతీయ స్థాయిలో కూడా జర్నలిస్టు సంఘాలలో, ప్రెస్‌కౌన్సిల్ వంటి సంస్థల్లో కీలక పదవులను నిర్వహించినవారు. కాలేజీ చదువు ముగించుకుని తొట్టతొలిగా ఈనాడులో అమర్ చేరారు. అలా చేరిన కొత్తలోనే 1977లో ఈనాడులో సాగిన సమ్మెలో ఉత్సాహంగా పాల్గొని తన పోరాట పటిమను సానబెట్టుకున్నారు.

వైఎస్ రాజశేఖర రెడ్డి హయాంలో ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమి పదవిని చేపట్టి మూడు దఫాలు ఆ పదవిలో కొనసాగి రికార్డు సృష్టించారు. అకాడమి చైర్మన్‌గా ఉంటూనే సాక్షి టివిలో కన్సల్టెంట్ హోదాలో వ్యాఖ్యాతగా కూడా కొనసాగి ప్రభువుల ఆస్థానంలో తన స్థానాన్ని మరింత పదిలపరుచుకున్నారు.

ఎపిలో జగన్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే అమర్‌ను జాతీయ మీడియా, అంతర్రాష్ట్ర వ్యవహారాల సలహాదారుగా నియమించింది. నెలకు సుమారు నాలుగు లక్షల రూపాయల జీతభత్యాలతో అమర్ ఈ పదవిని చేపట్టారు. తెలంగాణకు చెందిన అమర్‌ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో

---

పరిష్కారం కోసం ఏక కంఠంతో ఉద్యమిస్తున్నారు. తెరాస ప్రభుత్వం, సిఎం కెసిఆర్ కేంద్ర ప్రభుత్వంతో ములాఖత్ అయి – కోర్టులను శాసిస్తున్నాడు, పక్కదారి పట్టిస్తున్నాడు. కార్మికులను మోసం చేసే కుట్రలకు, కుయుక్తులకు దిగడమే కాకుండా లేబర్ కోర్టులు కమిటీల పేరుతో ఆర్‌టిసి కార్మికులను అవమానిస్తున్నారు.

కమిటీలతో సమస్యలు పరిష్కారం కావు. కార్మిక, కర్షక, విద్యార్థి, మేధావుల రాజీలేని పోరాటాలే కార్మిక హక్కుల సాధనకు ఏకైక పరిష్కారం. ఇది చరిత్ర నిరూపించిన సత్యం. ఇప్పటికే పోరాడుతున్న జెఎసిలతో ప్రజలంతా సంఘటితమై పోరాటాలతోనే ఆర్‌టిసి కార్మికుల డిమాండ్లు సాధించుకోవాలి. కెసిఆర్ రెండు నాల్కల వైఖరిని ఎండగడుతూ తగిన బుద్ధి చెప్పాలి. ఫ్యూడల్ సంస్థానానికి రాజు లాగా, ఆర్‌టిసి కార్మికులు తన ఏలుబడిలోని బానిసలుగా భావిస్తున్న నియంత కేసిఆర్‌ను గద్దె దించాలి!

*(రచయిత ఐఎఫ్‌టియు రాష్ట్ర సహాయ కార్యదర్శి)* వీ

సలహాదారుగా నియమించడమేమిటని మొదట్లో విమర్శలు వచ్చినా ప్రభుత్వం వాటిని పట్టించుకోలేదు.

మరోపక్క జాతీయ మీడియా సలహాదారుగా నియమితులైనా, వైఎస్ఆర్ కాంగ్రెస్ ప్రభుత్వ ప్రతిష్టను జాతీయ మీడియా వేదికగా పెంచడంలో అమర్ చేసింది ఏమీలేదని కూడా ఆ పార్టీ వర్గాలే పెదవి విరుస్తున్నాయి. గతంలో సాక్షి ఎడిటోరియల్ డైరెక్టర్‌గా ఉన్న సజ్జల రామకృష్ణా రెడ్డి పార్టీ వ్యవహారాలకు పూర్తి సమయం కేటాయించాల్సి రావడంతో ఆ పదవిలో కె. రామచంద్ర మూర్తిని నియమించారు. చాలా కాలం ఎడిటర్‌గా పనిచేసిన అనుభవం, జర్నలిస్టుల్లో, జనరల్ పబ్లిక్‌లో మూర్తికి సానుకూల ఇమేజ్ ఆయనను ఎంచుకోవడానికి దోహదపడింది. మార్కెట్లో ఈ కీలక పదవిలో నియమించడానికి అనువైన మరొక వ్యక్తి లేకపోవడం కూడా బహుశా ఆయన ఎంపికకు దారితీసి ఉండవచ్చు. ఉదయం రోజుల నుంచి సజ్జల రామకృష్ణా రెడ్డితో ఉన్న పరిచయం కూడా ఈ ఎంపికలో ప్రభావం చూపి ఉండవచ్చు.

అమర్ విషయంలో వచ్చిన విమర్శనే రామచంద్ర మూర్తి కూడా ఎదుర్కోవలసి వచ్చింది. ఖమ్మం జిల్లాకు చెందిన ఆయనను ఎపి ప్రభుత్వం సలహాదారుగా నియమించడమేమిటన్న ప్రశ్నలు తలెత్తాయి. హెచ్ఎంటివిలో ఉన్నప్పుడు దశ-దిశ కార్యక్రమం పేరిట తెలంగాణ ప్రాంత ప్రయోజనాలకు మాత్రమే పాటుపడిన మూర్తిని సలహాదారుగా నియమిస్తే ఎపి ప్రయోజనాలు కాపాడగలరా? అనే చర్చ కూడా సోషల్ మీడియాలో లేవనెత్తారు.

మొదట్లో సజ్జల రామకృష్ణా రెడ్డిని, సాక్షిలో పనిచేసే జివిడి కృష్ణ మోహన్‌ను కూడా సలహాదారులుగా నియమించారు.

**సలహాదారుల సంస్కృతి**

సలహాదారుల పోస్టులనేవి పునరావాస కేంద్రాలుగా ఉన్నాయి. కెసిఆర్ అధికారంలోకి వచ్చాక సలహాదారుల నియామకాలకు తెరలేపారు. తెలంగాణ ఉద్యమ సమయంలో వెన్నుదన్నుగా నిలిచిన మేధావుల సేవలను గుర్తించి వారికి ఆర్థిక ప్రయోజనం చేకూర్చడం అనేది ఈ పోస్టులు కట్టబెట్టడంలోని ఆంతర్యం.

సలహాదారుల జీతభత్యాలపై చాలా ప్రజాధనాన్ని వృథా చేస్తున్నారు. అంత ప్రజాధనం వెచ్చించి నియమించుకున్న సలహాదారులు ఆ మేరకు విలువైన సలహాలు ఇస్తున్నారా? ఒక వేళ ఇస్తే వాళ్లకు పాలకులు ఆ సలహాలలోని ఔచిత్యాన్ని గుర్తించి పాటిస్తున్నారా? అంటే లేదనే సమాధానం వస్తుంది.

'సలహాలు ఇవ్వకుండా నోరునొక్కేందుకు వారికి సలహాదారుల పోస్టులు కట్టబెట్టార'ని వ్యంగ్యంగా ప్రజలు చెప్పుకునేవరకు పరిస్థితి వచ్చింది.

పనీపాటా లేకుండా వారిని కూర్చొబెట్టి జీతాలు ఇవ్వడంలోని సహేతుకత ఏమిటో పాలకులకే తెలియాలి, లేదా వారిచ్చిన 'అమూల్య' సలహాల చిట్టా ఏమైనా ఉంటే దాని వలన ప్రజలకు ఒనగూరిన ప్రయోజనమేమిటో చెప్పాలి.

నవ్యాంధ్రప్రదేశ్‌కు సిఎంగా పగ్గాలు చేపట్టిన చంద్రబాబు ఇంత ఉధృత స్థాయిలో సలహాదారుల నియామకానికి దూరంగానే ఉన్నారు. కాకుంటే మీడియా కన్సల్టెంట్ల పేరిట కొందరు జర్నలిస్టులకు ఉపాధి కల్పించారు. తన ప్రభుత్వం గురించి పత్రికల్లో అనుకూల వ్యాసాలు రాయడం వీరి బాధ్యత. చంద్రబాబు తర్వాత 2019 ఎన్నికల్లో అధికార పగ్గాలు చేపట్టిన జగన్, కెసిఆర్ బాటలోనే నడుస్తూ సలహాదారులకు పట్టంకట్టారు.

ఇంతకాలం తమను నమ్ముకుని ఉన్నవారికి, తమ పార్టీ ప్రయోజనాల కోసం పాటుపడినవారికి ప్రతిఫలంగా సమర్పించిన నజరానాలుగా ఈ పోస్టులను పరిగణించాలి.

ఒపీనియన్ లీడర్‌గా ఉన్న 'మేధావి' వర్గాలను పదవుల ఎరతో ప్రసన్నం చేసుకోవడం ద్వారా సాధించే ప్రయోజనాలు లేకపోలేదు.

వారికి ఆ పదవులు ఇవ్వకుంటే వ్యతిరేకంగానో, తటస్థంగానో మాట్లాడే అవకాశం ఉంటుంది. పదవిని ఎరగా వేస్తే వారు ప్రభుత్వ విధానాలపై సానుకూలంగా స్పందిస్తూ ప్రభుత్వానికి అండగా ఉంటారు. అనుకూలం ప్రచారానికి వీరు అస్త్రాలు అవుతారు.

ఈ పరిణామాలను, పరిస్థితులను మరింత బాగా అర్థం చేసుకోవడానికి తెలుగు రాష్ట్రాల్లోని మీడియా రాజకీయాల గురించి రాజకీయాల గురించి కూడా మాట్లాడుకోవాలి.

**ప్రాబల్య స్థానంలోకి రాజకీయరంగం**

మిగిలిన అన్ని సామాజిక రంగాలను వెనక్కి నెట్టేసి రాజకీయరంగం ఆధిపత్యస్థానంలోకి వచ్చింది. ఒకప్పుడు వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు సమాజంలో తమకంటూ ప్రత్యేక గుర్తింపును, మన్ననను పొందేవారు. ఇప్పుడా పరిస్థితి మారింది. రాజకీయ అధికారంలోకి వస్తే అన్ని సాధించవచ్చనే భావన బలపడింది. అందుకే యాక్టర్లు, డాక్టర్ల నుంచి దాదాగిరీ వెలుగబెట్టే వీధి రౌడీల దాకా ప్రతిఒక్కరూ రాజకీయాల్లో చేరి ప్రజాప్రతినిధులుగా కూడా ఎన్నికవుతూ ముఖ్యమైన పదవులను అధిష్టిస్తున్నారు.

గెలుపు గుర్రానికే విలువ ఎక్కువ. అందుకే అధికారంలోకి ఏ పార్టీ వస్తే ఆ పార్టీలోకి భారీగా వలసలు సాగుతున్నాయి. పార్టీలు సిద్ధాంతాలు, విలువలతో నిమిత్తం లేకుండా ఫిరాయింపుల పర్వం జోరుగా సాగుతోంది. నిన్నటిదాకా తిట్టిపోసిన పార్టీలోనే నేడు నిస్సిగ్గుగా చేరి, పదవుల కోసం మొదటి రోజు నుంచే వెంపర్లాడుతున్నారు.

'నువ్వు ఆ పార్టీలో ఉన్నందుకే ఓటేసి గెలిపించాం. ఇప్పుడు ఇలా చేయడం మమ్మల్ని వంచించడం కాదా? అని ప్రజలు కూడా ఎవరూ నేతలను నిలదీయడం లేదు. పార్టీ ఫిరాయించి ప్రజల తీర్పుకోసం ఉప ఎన్నికల్లో నిలిచినవారిని కూడా హారతులుపట్టి గెలిపిస్తున్నారు.

రాజకీయ అధికారమే సమస్తం కావడంతో ఎన్నికల్లో ఓటరును ప్రలోభపెట్టడానికి చేసే ఖర్చు చుక్కలనంటుతోంది. సర్పంచ్ స్థాయి ఎన్నికకే కోట్లు గుమ్మరిస్తున్నారంటే రాజకీయ పదవులు ఎంతటి ఘరానా దందానో ఎవరైనా ఊహించుకోవచ్చు. రేపు పదవుల్లోకి వచ్చినవారు ఏ మేరకు 'ప్రజా సేవ' చేస్తారో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. దీనికితోడు – రాత్రికి రాత్రి కోట్లకు కోట్లు పడగలెత్తిన వారిని సైతం సమాజం వేలెత్తిచూపడం లేదు. ఇదేమిటని నిలదీయకపోగా రోల్‌మోడల్‌గా భుజానికెత్తుకుంటోంది. ఏ విలువ దిశగా మనం సాగుతున్నామో తలచుకుంటేనే గుబులు పుడుతుంది.

**ఉచితాల పేరిట అనుచిత వరాలజల్లు**

అభ్యర్థులకు దన్నుగా ప్రతి రాజకీయ పార్టీ ఎన్నికల్లో పోటాపోటీగా ఓటర్లపై ఉచితాల పేరిట అనుచిత వరాలజల్లు కురిపిస్తోంది. వ్యవసాయం గిట్టుబాటు ధర కల్పించి, లాభసాటిగా తీర్చిదిద్దుతామని ఏ ప్రభుత్వమూ చెప్పడం లేదు. వ్యవసాయానికి పెట్టుబడి సాయం అందిస్తామంటోంది. – ఇలా బయటి నుంచి సాయం పేరిట 'రక్తం' ఎక్కిస్తూ ఎంతకాలమని బతికించగలరు. తమ కాళ్ల మీద తాము నిలబడేలా అన్నదాతకు గిట్టుబాటు ధరలు, మార్కెటింగ్ సౌకర్యాలు, నిల్వ సామర్థ్యాలు ఎందుకు కల్పించరు?

పేద వర్గాలకు రు. 5కే భోజనం అందిస్తూ పక్కనే మద్యాన్ని ఏరులై పారిస్తున్నారు. ప్రజల ఆరోగ్యాన్ని హరిస్తూ వారి జేబులకు చిల్లు పెడుతున్న మద్యం మహమ్మారి, ఇవాళ ప్రభుత్వాల మనుగడకు ప్రధాన ఆదాయ వనరు కావడం విషాదం. ఇదేం ప్రజా సంక్షేమ విధానామో అంతుచిక్కదు. ఈ వరాల జల్లు వెనుక మతలబును, అవి దీర్ఘకాలంలో కొనితెచ్చే చేటును ప్రజలు కూడా సావధానంగా అర్థం చేసుకోలేక పోతున్నారు. ఈ పార్టీలకే ఓట్లేస్తూ అధికార పల్లకిలో ఊరేగిస్తున్నారు.

**పార్టీల గుప్పిట్లో మీడియా**

దేశంలో ఎక్కడా స్వతంత్ర విధానాన్ని అనుసరించే మీడియా లేదు. అధికారమే సర్వస్వం అనుకునే రాజకీయ పార్టీలు, మీడియాను కూడా పూర్తిగా తమ చెప్పుచేతల్లోకి తెచ్చుకుంటున్నాయి. నిన్నటిదాకా కొన్ని పత్రికల యాజమాన్యాలు తమ అనుకూల పార్టీలకు కొమ్ముకాసేవి. గతంలో తెలుగుదేశం పార్టీకి బాహాటంగా ఈనాడు ప్రచారం సాగించింది. ఎన్‌టిఆర్ అధికారంలోకి రావడానికి ఈనాడు పాత్ర కూడా కీలకమే. ఇది ఆ తదనంతరకాలంలో ఇతర రాజకీయ పార్టీల కళ్లు తెరిపించింది. ప్రచారసాదనాలను గుప్పిట్లో పెట్టుకోవడం కూడా రాజకీయాధికారానికి తప్పనిసరి అవసరమనే అభిప్రాయానికి అన్ని పార్టీలూ వచ్చాయి. ఇతరులపై ఆధారపడే కంటే తమకంటే సొంతంగా పత్రికలను, టివి చానెళ్లను నిర్వహించుకోవడం మంచిదని పార్టీలు నిర్ణయించాయి. దీంతో కూడా సంతృప్తి చెందని అధికారపార్టీలు, తమ బినామీలచేత మార్కెట్లో ప్రాచుర్యంలో ఉన్న టివి చానెళ్లను, పత్రికలను కూడా కొనుగోలు చేయిస్తూ మూడు పత్రికలు ఆరు చానెళ్లతో విరాజిల్ల చూస్తున్నాయి. ప్రజాభిప్రాయాన్ని తమ విధానాలకు అనుకూలంగా మలచ యత్నిస్తున్నాయి.

**సోషల్ మీడియాపై కన్ను**

ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావానికి తోడు సమాంతరంగా ఎదిగిన సోషల్ మీడియాపైన పార్టీల కన్నుపడింది. సానుకూల, ప్రతికూల అభిప్రాయ కల్పనలో సోషల్ మీడియా పాత్ర, ప్రభావం కూడా చాలా ఉందని, గెలుపోటములను నిర్ణయించే క్రమంలో సోషల్ మీడియా కూడా కీలక భూమిక పోషిస్తుందని పార్టీలు గుర్తించాయి. 2019లో ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికల్లో తెలుగుదేశం, వైఎస్‌ఆర్‌సిపిలు సోషల్ మీడియా వేదికగా కూడా కత్తులు దూసుకున్నాయి. ఉచితానుచితాలు మరిచి పరస్పరం దుమ్మెత్తిపోసుకోవడం, కులపరమైన భావోద్వేగాలను సైతం రెచ్చగొట్టడం వంటివి సాగాయి. జగన్‌మోహన్ రెడ్డి భారీ మెజార్టీ స్థానాలతో అధికారంలోకి రాగానే సోషల్ మీడియాలో తమ పార్టీకి అనుకూలంగా ప్రచారం చేసిపెట్టినవారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు కూడా చెప్పారు.

**తాయిలాల సాలెగూడులో జర్నలిస్టులు**

మీడియా ప్రాధాన్యాన్ని గుర్తించిన పార్టీలు మీడియాలో పనిచేస్తున్న జర్నలిస్టులను కూడా ప్రసన్నం చేసుకోవడానికి నానారకాలుగా తాయిలాల గాలం విసురుతున్నాయి. ఇళ్ల స్థలాలు, హెల్త్‌కార్డులు, అక్రెడిటేషన్లు, బస్‌పాస్‌లు, చిన్న పత్రికలకు అడ్వర్టయిజ్‌మెంట్ల కోటా– ఇలా పలురకాల ఎరలతో జర్నలిస్టులను తమ వైపు తిప్పుకోవడానికి రెండు తెలుగు రాష్ట్రాల్లో పథకం ప్రకారం పెద్దఎత్తున కృషి చేస్తున్నాయి.

**యూనియన్లు ఉన్నా లేనట్లే**

ఒకప్పుడు జర్నలిస్టు సంఘాలు వారి హక్కుల సాధన కోసం యాజమాన్యాలతో పోరాడేవి. ప్రతి పత్రిక ఆఫీసులోనూ యూనియన్లు చురుకుగా పనిచేసేవి. ఉద్యోగులకు ఏదైనా సమస్య ఎదురైతే అండగా నిలిచేవి. మానసిక స్థైర్యాన్ని ఇచ్చేవి. అలాగే, పత్రికా స్వేచ్ఛకు ఏమాత్రం ప్రభుత్వాలు విఘాతం కలగించాలని చూసినా పలురకాల నిరసన కార్యక్రమాలతో గట్టిగా ప్రతిఘటించేవి.

ఇప్పుడు ఏ జర్నలిస్టు సంఘమూ జర్నలిస్టుల హక్కుల కోసం పోరాడలేకపోతోంది. వెయిజ్ బోర్డుల మాట అలా ఉంచండి. అరకొర జీతాలనైనా నెలనెలా సక్రమంగా యాజమాన్యాలు చెల్లించడం లేదు. కొందరు యజమానులు తమ ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తూ, ఒంటెత్తు పోకడలు పోకడలు పోతున్నా యూనియన్లూ అడ్డుకోలేకపోతున్నాయి.

జర్నలిస్టులకు శిక్షణ, పరిశోధనలతో వృత్తి నైపుణ్యాలను మెరుగుపరిచే లక్ష్యంతో ఏర్పాటైన ప్రెస్ అకాడమిలు స్థాపన లక్ష్యాలకు దూరం జరిగాయి. సంక్షేమం పేరిట తాయిలాలు ఎరవేసే అనుసంధాన కేంద్రాలుగా ప్రెస్ అకాడమిలు మారాయి. జర్నలిస్టుల హెల్త్‌కార్డులు, ఆచరణలో కార్పొరేట్ ఆసుపత్రుల్లో చెల్లుబాటు కావడం లేదు. ప్రభుత్వ బకాయిలు పేరుకుపోవడంతో ఈ కార్డులపై వైద్యం చేయడానికి ఏ ఆసుపత్రి ముందుకు రావడం లేదు. ఈ విషయం తెలిసినా ఆ కార్డులు పొందడానికి క్యూ కట్టడం, జర్నలిస్టుల నిస్సహాయస్థితికి, వైద్యం చేయించుకోలేని దైన్య ఆర్థిక స్థితికి సంకేతం. అక్రెడిటేషన్ కార్డు ఉంటే ఎప్పటికైనా ఇంటి స్థలం సంపాదించలేక పోతామా? అనే ఆశల పల్లకిలో చాలా మంది ఊరేగుతున్నారు.

**అన్నిదారులు జర్నలిజంలోకి**

ఈ 'ఎర'లు చాలా మందిని జర్నలిజం వృత్తిలోకి ఆకర్షిస్తున్నాయి. ఓ చిన్నా చితకా పత్రిక పెట్టుకుంటే ప్రభుత్వ అడ్వర్టయిజ్‌మెంట్లతో నిలదొక్కుకోవచ్చు. లేదా ఏదో ఒక పత్రికలో జీతం ఇవ్వకున్నా చేరిపోతే ప్రభుత్వ సౌకర్యాలు, ఇళ్ల స్థలాలు పొందవచ్చన్న ఆరాటంతో అనేక మంది ఈ వృత్తుల్లోకి వస్తున్నారు. జర్నలిజం వృత్తిని ఆసరాగా చేసుకుని రాజకీయంగా కూడా ఎదగవచ్చని మరికొందరు అనుకుంటున్నారు. పట్టుమని పదివాక్యాలు కూడా రాయలేని కొందరు జర్నలిజం ముసుగులో

## డా. హేమా పరిమి



**శి**శు వైద్య నిపుణులుగా, అమెరికాలో కొద్దికాలం పనిచేసి తెలుగు సీమ మీద, తెలుగు సీమలో శిశువైద్యం, శిశు బోధనల మీద ఆసక్తితో మూడు దశాబ్దాల కింద విజయవాడకు తిరిగి వచ్చి అపారమైన కృషి చేసిన డా. హేమా పరిమి నవంబర్ 24 రాత్రి విజయవాడలో కన్నుమూశారు.

గుంటూరు మెడికల్ కాలేజీలో విద్యాభ్యాసం చేసి అమెరికా వెళ్లిన డా. హేమా పరిమి 1980ల చివర విజయవాడకు తిరిగి వచ్చి 'జాబిల్లి' పేరుతో పిల్లల ఆసుపత్రి తెరిచారు. సహచరుడు, ఇంజనీరింగ్ పట్టభద్రుడు డా. పరిమితో కలిసి ఆదర్శవంతమైన ప్రాథమిక పాఠశాల నిర్మించాలనే లక్ష్యంతో విజయవాడ శివార్లలోని పోరంకిలో 'వికాస విద్యా వనం' ఏర్పాటు చేశారు. ఇటు శిశు వైద్య, విద్యాబోధన రంగాల్లో ప్రత్యామ్నాయాల కోసం అన్వేషిస్తూనే విజయవాడలో అన్ని ప్రజాస్వామిక ఉద్యమాలతో సన్నిహితంగా పనిచేశారు.

సాహిత్య, కళా రంగాల మీద అభిరుచితో ఎందరో సాహిత్యకారులను, కళాకారులను తన విద్యా, వైద్య కృషిలో భాగం చేశారు. గొప్ప స్నేహశీలిగా విప్లవ ప్రజాస్వామిక ఉద్యమాల కార్యకర్తలు ఎందరికో అండదండలు అందించారు.

గత కొద్దికాలంగా కాన్సర్ వ్యాధితో బాధపడుతూ కూడా తన వేదనను తనలోనే అణచిపెట్టుకుంటూ అనేక సాహిత్య, సామాజిక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు.

కాలక్షేపం చేస్తున్నారు.

నిజానికి జర్నలిజాన్ని నమ్ముకుని దాన్నే బతుకుదెరువుగా చేసుకున్నవారే ఎక్కువ మంది ఉన్నారు. ఇది కాదనలేని సత్యం. అయితే ఇటీవలి కాలంలో జర్నలిజాన్ని అమ్ముకుని అందలాలకు ఎగబాకాలనుకునే వారి సంఖ్య పెరుగుతూ రావడం దురదృష్టకర పరిణామం. జర్నలిస్టులుగా ఈ రంగంలో ప్రవేశించి పార్టీల ప్రాపకంతో వాటిల్లో చేరి మంత్రి పదవులనూ చేపట్టిన వారిని మనం చూస్తూనే ఉన్నాం. ఒకప్పుడు ఒక్కో జిల్లాలో ఇరవయ్యో ముప్పయ్యో అక్రెడిటేషన్లు మంజూరు చేసేవారు. ఇప్పుడా సంఖ్య వేలలోకి చేరింది.

మీడియాను గుప్పిట్లోకి తెచ్చుకోవడం, ఆ మీడియాలో పనిచేసే జర్నలిస్టులను పలురకాల ప్రలోభాలతో సానుకూలంగా మలచుకోవడం అనే ద్విముఖ వ్యూహంతో పాలకపక్షాలు ముందుకు సాగుతున్నాయి.

'జర్నలిజంలో విలువలు దిగజారిపోయాయి. జర్నలిస్టుల ముసుగులో బ్లాక్‌మెయిల్ చేస్తున్నారు' వంటి మాటలను తరచూ వినాల్సివస్తోంది. ఈ పరిస్థితులు ఇలాగే కొనసాగితే బాధితులు జర్నలిస్టులపై దాడులకు తెగబడే పరిస్థితులు వచ్చినా ఆశ్చర్యపడనక్కర్లేదు.

పడవ ఎక్కేవరకు ఓడమల్లన్న, పడవ దిగగానే బోడిమల్లన్న సామెత చందంగా అధికారంలోకి రాకముందు సమస్త అడ్డదారులు తొక్కిన పార్టీలు అధికారంలోకి రాగానే తమకు వ్యతిరేకంగా వార్తలు రావడాన్ని సహించలేకపోతున్నాయి. సమస్త మీడియా తమకు 'జీ హుజూర్' అంటూ మెకరిల్లాలని, కాదంటే కక్షసాధిస్తామంటూ జిఒల కత్తులతో బెదిరించ చూస్తున్నాయి.

**ఏ రోటి పాట ఆ రోటి దగ్గర**

ఇప్పుడున్న మెజారిటీ మీడియాకు ప్రజల గోడుపట్టడం లేదు. తమ ప్రభుత్వ ప్రయోజనమే ప్రజా ప్రయోజనమన్నది ఆయా మీడియాలోని జర్నలిస్టుల విశ్వాసం. మనుగడ కోసం పోరాటంలో సాధారణ జర్నలిస్టులు మీడియా పాలసీ చట్రంలో ఇష్టమున్నా లేకున్నా ఒదిగి బతుకు లీడుస్తున్నారు.

అయితే జర్నలిజంలో దశాబ్దాల అనుభవం గడించి నిన్నటిదాకా ఏటికి ఎదురీదిన మేధావి వర్గాలు సైతం పదవుల ఎరకు చిక్కి రాజీ పడడమే విచారించాల్సిన విషయం.

ప్రభుత్వాల కరుణాకటాక్షపాత్రులైన వీరంతా నిన్నటిదాకా వ్యక్తిగతంగా ఏదో ఒక సిద్ధాంతానికి అంకితమైన వారే. విలువల కోసం పాటుపడిన వారే. కుటుంబ బాధ్యతలు నెరవేర్చినవారే. వారి పిల్లలు మంచి ఉద్యోగాల్లో స్థిరపడినవారే. డబ్బు కోసం వెంపర్లాడే స్థితి లేకుండా సంతృప్తిగా శేషజీవితాన్ని వెళ్లదీయగల స్తోమత ఉన్నవారే. తమ అనుభవాలను భావితరాల కోసం గ్రంథస్థం చేసి చిరస్మరణీయులకాదగిన వారే. అలాంటివారు సైతం ఇలా రాజీపడటం వారి వ్యక్తిగత ప్రయోజనాలకు ఉపకరించవచ్చునేమో? కానీ వారి వ్యక్తిత్వాలకు శోభనివ్వదు. సమాజ హితానికి ఉపకరించదు.

ప్రసిద్ధ సంపాదకులు సి. రాఘవాచారి తాను నమ్మిన విలువలకే జీవితాంతం అంకితమయ్యారు. ప్రభుత్వ పదవుల మాట అటుంచండి, ఈనాడు వంటి పెద్ద సంస్థలో ఉద్యోగాన్ని సైతం వద్దనుకున్నాడు. ఇంతటి కారుచీకటిలో కూడా కాంతిరేఖలా రాఘవాచారి వంటి నిష్కామకర్మ యోగులు ప్రకాశిస్తూనే ఉన్నారు.

**ముగింపు ముచ్చట**

ఐసిస్ ఉగ్రవాద ముఠా నాయకుడు బాగ్దాదీని హతమార్చటానికి అమెరికా చేపట్టిన ఆపరేషన్‌లో ఒక కుక్క కూడా ముఖ్యపాత్ర పోషించినట్టు వార్తలు వచ్చాయి. అమెరికన్ హీరో అంటూ ఈ కుక్కపై ఆ దేశాధ్యక్షుడు ట్రంప్ ప్రశంసలజల్లు కురిపించారు. ఆ కుక్క అమెరికా సేనల చేతిలో శిక్షణ పొందింది కనుక బాగ్దాదీని తరిమికొట్టింది. అదే కుక్క బాగ్దాదీ పెంపుడు కుక్క అయి ఉంటే ఖాయంగా అమెరికా సైన్యాన్ని తరిమికొట్టి ఉండేది. ట్రంప్‌గారి పెంపుడు కుక్కల్లా మన మేధావులు కూడా ప్రభు భక్తిని, విశ్వాసాన్ని ప్రదర్శిస్తున్నారు. అమెరికన్ ఆపరేషన్‌లోని నీతిసూత్రం చెప్తున్న నిష్ఠూర సత్యం కూడా ఇదే.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# దళిత క్రిస్టియన్లపై మతోన్మాదుల దాడులు

***తెలంగాణలో దళిత క్రిస్టియన్లపై, చర్చిలపై హిందూ మతోన్మాదులు చేస్తున్న దాడులను ప్రభుత్వం, పోలీసులు అడ్డుకోవడం లేదనీ, వారిని కాపాడాల్సిన బాధ్యత ప్రజాస్వామికవాదులపై ఉందనీ అంటున్నారు ఎస్. జీవన్‌కుమార్***

హ్యూమన్ రైట్స్ వాచ్ అనే అంతర్జాతీయ మానవ హక్కుల సంస్థ, భారతదేశంలో బిజెపి అధికారంలోకి వచ్చిన నాటి నుండి క్రైస్తవ అల్ప సంఖ్యాక వర్గాలపై భౌతిక దాడులు, వాళ్ల ప్రార్థనా మందిరాలను దౌర్జన్యంగా కూల్చివేయడం లాంటి సంఘటనలు పెరిగిపోతున్నాయని తన నివేదికలో పేర్కొంటూ, బిజెపి రాజకీయ పార్టీకి అనుబంధంగా ఉన్న ఆర్ఎస్ఎస్, భజరంగ్‌దళ్, హిందూ వాహిని, ఎబివిపి లాంటి సంస్థలు ఈ అకృత్యాలకు పాల్పడుతున్నాయని, దేశంలో జరిగిన చాలా సంఘటనలు సోదాహరణంగా వివరించింది. నేషనల్ కమిషన్ ఆన్ మైనారిటీస్ అనే కేంద్ర ప్రభుత్వ సంస్థ కూడా తన నివేదికలో క్రిస్టియన్ మత సంస్థలపై, మత ప్రచారకులపై సంఘ్‌పరివార్ సంస్థలు జరిపిన దాడులను గణాంకాలతో వివరించింది. 2013లో 72 సంఘటనలు జరుగగా, 2014లో 105గా నమోదై, 2015లో 177కు చేరి, 2016లో ఆ సంఘటనల సంఖ్య 300కు చేరిందని పేర్కొంది. ఇవన్నీ వెలుగులోకి వచ్చినవి మాత్రమే. పత్రికల్లో వార్తలకు రాకుండా, పోలీసు స్టేషన్లలో కేసులుగా నమోదు కానివి చాలా ఉన్నాయి. గ్రామాలలో జరిగిన, జరుగుతున్న సంఘటనలు కనీసం పత్రికల్లో వార్తలుగా కూడా రావడం లేదు.

బిజెపి శ్రేణులతో సహా ప్రధాన మంత్రి ప్రతిరోజు 'హిందుత్వ' మంత్రాన్ని బోధిస్తున్నారు. మన ముఖ్యమంత్రి ఒక సందర్భంలో ఆ మంత్రానికి చికాకు వ్యక్తపరుస్తూ, 'తెలంగాణలో హిందూయిజం, గిందూయిజం జాన్తానై, తెలంగాణ తహజీబ్ వేరే' అంటే మనమందరం సంతోషించాం. అన్ని మతాల వాళ్లకు, వాళ్ల పండుగలకు నిధులు అందజేసే సౌకర్యాలు కల్పిస్తుంటే, తెలంగాణ ప్రభుత్వం చాలా లౌకికంగా వ్యవహరిస్తుందని అనుకున్నాం. కాని ముఖ్యమంత్రి స్వాములను పూజిస్తూ, యజ్ఞ యాగాదులు నిర్వహిస్తూ, హిందుత్వ భావనకు తోడ్పడుతున్నాడన్న విషయం వెంటనే మనం గ్రహించలేదు. ఈ విషయాన్ని మనం నిర్దిష్టంగా చెప్పుకునే అవసరం ఉంది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డాక ఆరు నెలల తర్వాత ముఖ్యమంత్రి యాదగిరి లక్ష్మీనరసింహ స్వామి దేవాలయం పేరు యాదాద్రిగా మార్చి, దీన్ని తిరుపతి అంత స్థాయిలో అభివృద్ధి చేస్తామని ప్రకటన చేశాడు. నిధుల కేటాయింపు జరిగి దాదాపు 40 కిలోమీటర్ల పరిధిలోని యాదాద్రి జిల్లా ప్రాంతం పవిత్రమైందిగా ప్రకటించాడు. ఈ ప్రకటన వెలువడిన కొద్ది రోజుల తర్వాత గ్రామాల్లో యువకులు తలకు కాషాయ రిబ్బన్లు కట్టుకొని, మోటర్ సైకిళ్లపై గ్రామాల్లో తిరుగుతూ 'జై శ్రీరామ్' అని నినాదిలిస్తూ, గ్రామాల్లో క్రైస్తవ ప్రార్థనలు చేయించే మత బోధకులైన పాస్టర్లను, క్రైస్తవ ప్రార్థనలు ఆపాలని, లేకుంటే గ్రామాలు వదిలిపెట్టి వెళ్లిపోవాలని హెచ్చరికలు చేశారు. ఈ నేపథ్యంలో యాదాద్రి జిల్లాలో చాలా గ్రామాల్లో, తెలంగాణ జిల్లాల్లో, హైదరాబాద్ నగరంలో కూడా పాస్టర్లపై దాడులు, చర్చీల విధ్వంసం జరిగింది. ఈ సంఘటనకు సంబంధించిన వార్తలు పత్రికల్లో కూడా రాలేదు. కాని తెలంగాణలో చాలా జిల్లాల్లో, గ్రామాల్లో హిందూ మతోన్మాద శక్తులు దళిత క్రిస్టియన్లపై దాడులు చేస్తూ బీభత్సం సృష్టిస్తున్నాయని ఒక క్రిస్టియన్ సంస్థ ద్వారా తెలిసింది. ఈ మధ్యలో దాడులు జరిగిన యాదాద్రి జిల్లాలోని కొన్ని గ్రామాలు సందర్శించి, బాధితులను కలిసి వివరాలు, విషయాలు సేకరించడం జరిగింది. ఈ సమాచార సేకరణ కోసం మానవ హక్కుల వేదిక, ముస్లిం ఆలోచనాపరుల సంస్థ, బహుజన ప్రతిఘటన వేదిక సభ్యులతో కూడిన బృందంగా ఏర్పడి అక్టోబర్ మొదటి వారంలో విషయ సేకరణ చేయడం జరిగింది.

యాదాద్రి జిల్లా, తుర్కపల్లి మండలంలోని వాసాలమర్రి గ్రామం బయట చిన్న ఇంట్లో కిరాయికి ఉంటూ క్రైస్తవ ప్రార్థనలు నిర్వహిస్తున్న బరిగె పాస్టర్‌పై దాడి జరిగింది. అక్టోబర్ 3న పాస్టర్ తన భార్య, కూతుర్ల పుట్టిన దినం కార్యక్రమం నిర్వహించడానికి బంధువులను, స్నేహితులను ఆహ్వానించాడు. కార్యక్రమం మొదలయ్యే ముందు వాసాలమర్రి గ్రామంలోంచి దాదాపు 20 మంది యువకులు జెండాలతో, సైకిల్ మోటర్లపై వచ్చి 'జై శ్రీరామ్' అని అరుచుకుంటూ, ప్రార్థన బ్యానర్ చింపి, పాస్టర్‌ను కొట్టి, అందరిని నెట్టివేసి నానా బీభత్సం సృష్టించారు. ఎవరో ఫోన్ చేస్తే పోలీసులు వచ్చి వెళ్లారు కానీ, హిందుత్వ సంస్థల మూకలను నివారించలేకపోయారు. అక్కడ ప్రార్థనలు చేయకూడదని, చేస్తే చంపేస్తామని బెదిరించారు. రెండు రోజుల తర్వాత తుర్కపల్లి పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేస్తే గ్రామానికి చెందిన ఆరుగురు యువకుల్ని అరెస్టు చేసి, బెయిల్ ఇచ్చి పంపారు. ఆ యువకులే రోజూవచ్చి బెదిరిస్తూ, సంజ్ఞలు చేస్తున్నారని పాస్టర్ భార్య తెలిపింది. పాస్టర్ కుటుంబం భయం భయంగా రోజులు గడుపుతున్నారు.

ఇదే మండలంలోని వీరారెడ్డిపల్లి గ్రామంలో 70 సంవత్సరాల వృద్ధుడైన గొల్ల రాములు భార్య కొంతకాలం క్రితం జబ్బుతో మరణించింది. అన్ని ఆసుపత్రుల్లో చూపెట్టాడు, లాభం లేకపోయింది. తీవ్ర మానసిక వేదనకు గురైనాడు. ఆకస్మాత్తుగా 14 సంవత్సరాల కూతురు అస్వస్థకు గురైంది. హైదరాబాద్‌లోని ప్రైవేట్ ఆసుపత్రుల చుట్టు తిరిగి చాలా డబ్బు ఖర్చు పెట్టాడు. కూతురు ఆరోగ్యం కుదుట పడాలని పూజలు, పునస్కారాలు చేయించాడు. లాభం లేకపోయింది. ఏసుక్రీస్తు ప్రార్థనలు చేయిస్తే కూతురు బాగుపడుతుందని ఎవరో సలహా ఇస్తే, పక్కనున్న జగదల్‌పూర్‌కు వెళ్లి పాస్టర్ భాస్కర్‌ను పిలుచుకొచ్చాడు. ప్రతి ఆదివారం పాస్టర్ భాస్కర్ వచ్చి రాములు ఇంట్లో ప్రార్థన చేసేవాడు. తమ ఊరికి పాస్టర్ వస్తున్నాడని విన్న క్రైస్తవ కుటుంబాలు రాములు ఇంటికి రావడం మొదలయింది. ఆయన చిన్న ఇంట్లో స్థలం సరిపోకపోవడంతో మేకలు కట్టేసే గుడిసెలో కూర్చోమన్నాడు. ఇట్లా ఏసుక్రీస్తు ప్రార్థనలు జరుగుతుండేవి. ఈ విషయం తెలుసుకున్న గ్రామస్తులు పెద్ద ఎత్తున రాములు ఇంటికి వచ్చి, పాస్టర్‌ను రాములు ఇంటికి వస్తే చంపేస్తామని బెదిరించారు. పంచాయితీ పెట్టి గొల్ల

రాములుతో 'జై శ్రీరామ్' అనిపించి వెళ్లిపోయారు. తన కూతురుకు నయమయ్యే వరకు పాస్టర్‌ను అనుమతించమని, తాను క్రైస్తవం పుచ్చుకోలేదని బతిమిలాడినా గ్రామస్తులు వినలేదు. పోలీసులు వచ్చి చూసి వెళ్లారు. కేసు బుక్ చేయలేదు. పాస్టర్ భయంతో పారిపోయాడు. మూడు నెలలుగా ఊరికి రావడం లేదని, ఎక్కడో బంధువుల ఇంట్లో ఉంటున్నాడని జగదల్‌పూర్ గ్రామస్తులు తెలిపారు.

బొమ్మల రామారంలో గత 12 సంవత్సరాలుగా జన్నుగారి దేవదనం కుటుంబం నివసిస్తుంది. ఆయన క్రైస్తవ పాస్టర్. ఆరు సంవత్సరాలు కిరాయి ఇండ్లలో ఉన్నారు. ఆయన కిరాయికున్న చివరి ఇంటావిడ తమకు మల్లన్న దేవుడున్నాడని, మల్లన్న దేవుడున్న ఇంట్లో ఏసుక్రీస్తు పూజలు చేయరాదని ఇల్లు ఖాళీ చేయించింది. పాస్టర్ దేవదనం ఊరు అవతల కొంత భూమి కొనుక్కొని చిన్న ఇళ్లు, ఒక ప్రార్థనా మందిరం గది నిర్మించుకొని జీవిస్తున్నాడు. ప్రార్థనకు ఎక్కువ సంఖ్యలో భక్తులు వస్తుండడంతో ప్రార్థనా మందిరం గది పక్క కొంచెం పెద్ద నిర్మాణానికి పంచాయతీ సమితి అనుమతి తీసుకొని, ఇనుప రేకుల కప్పుతో ప్రార్థనా మందిరాన్ని నిర్మించడానికి పూనుకొన్నారు. నిర్మాణం సగంలో ఉండగానే గ్రామంలోని యువకులు 'జై శ్రీరామ్' అని అరుచుకుంటూ వచ్చి పనులు ఆపేశారు. పంచాయతీ వాళ్లిచ్చిన పర్మిషన్ కాగితం లాక్కెళ్లారు. పోలీసులకు ఫిర్యాదు చేస్తే వచ్చి చూసి వెళ్లారు. కాని ఏమీ చర్యలు చేపట్టలేదు. అధికారులందరికి, ఎస్‌సి, ఎస్‌టి కమిషన్‌కు వినతిపత్రం సమర్పించాడు. ఇంకా అధికారుల చుట్టూ తిరుగుతూనే ఉన్నాడు. యువకులు అప్పుడప్పుడు వచ్చి చర్చి నిర్మిస్తే కూల్చేసి పాస్టర్‌ను చంపేస్తామని సంవత్సరంగా బెదిరిస్తున్నారు. బెదిరించే గుంపులో సర్పంచ్‌తో సహా టిఆర్‌ఎస్ కార్యకర్తలు కూడా ఉన్నారు.

గత సంవత్సరం కామారెడ్డి జిల్లా, తడ్వాయి గ్రామంలో జీసస్ చర్చ్ సంస్థకు చెందిన పాస్టర్ స్టీఫెన్‌పాల్ అదే గ్రామంలో 500 గజాల భూమి కొనుక్కొని అందులో చర్చి నిర్మించుకోవడానికి అనుమతి కోసం కావలసిన కాగితాలు తీసుకొని ఎండిఒ ఆఫీసుకు వెళ్లాడు. అది గమనించిన విశ్వహిందూ పరిషత్, ఆర్‌ఎస్‌ఎస్ కార్యకర్తలు ఆ పాస్టర్‌ను బెదిరించి ఆఫీసు నుండి బయటకు తీసుకెళ్లి, ఒక రూంలో వేసి విపరీతంగా చిత్రహింసలు పెట్టారు. ఆ భూమిని ఆ పాస్టర్ దేవాలయం కట్టుకోవడానికి అమ్ముతున్నట్లు డాక్యుమెంట్లు రాయించి దౌర్జన్యంగా రిజిస్ట్రేషన్ చేయించారు. తొమ్మిది లక్షల విలువైన ఆ భూమికి మూడు లక్షలు పాస్టర్ చేతుల్లో పెట్టి నీకు ముగ్గురు కూతుళ్లు ఉన్నారు, నోరు మూసుకొని ఊరిలో ఉండు, ప్రార్థనలు, చర్చి అంటే మీ కుటుంబాన్నంతా నాశనం చేస్తాం అని హెచ్చరించారు. విషయం పోలీసుల దాకా వెళ్లింది. వాళ్లు గొడవలొద్దు అని రాజీ కుదిర్చారు. కేసు నమోదు చేసి విచారణ చేపట్టలేదు. పాస్టర్ చేతి నుంచి పోయిన భూమిని తిరిగి ఆయనకు ఇప్పించ్చలేదు. అదే గ్రామంలో ఇంకో పాస్టర్ ప్రార్థనలు చేస్తుంటే ఆయనపై దాడి చేసి బెదిరించారు. గత సంవత్సరం పాస్టర్ సంజీవ్ వికారాబాద్‌లో హత్యకు గురయ్యాడు. గత సంవత్సరం డిసెంబర్‌లో సంఘ్‌పరివార్ మూకలు సూర్యాపేటలో పాస్టర్ నామ మోజెస్‌పై కత్తితో దాడిచేసి, ఆయన భార్య సువార్తమ్మ తలపై ఇనుప రాడ్లతో కొట్టి గాయపర్చారు.

2017 డిసెంబర్ నుండి 2019 అక్టోబర్ వరకు తెలంగాణ జిల్లాలలో 37 సంఘటనలు జరిగినట్లు ఒక క్రైస్తవ సంస్థ మాకు సమాచారం అందించింది. అందులో 15 చర్చీలను విధ్వంసం చేశారు. ఒక చర్చిని పూర్తిగా దహనం చేశారు. 18 మంది పాస్టర్లపై భౌతికంగా దాడిచేసి బెదిరించి, గాయపర్చారు. రెండు సంఘటనల్లో క్రైస్తవ ప్రచార వ్యానులను తగలబెట్టారు. రెండు సంఘటనల్లో బలవంతంగా మతమార్పిడి చేస్తున్నారని పోలీసులతో కేసులు పెట్టించారు.

చాలా ఆశ్చర్యకరం, విచారకరమైన విషయం ఏమంటే పైన పేర్కొన్న 37 సంఘటనల్లో కొన్నిటి విషయంలో మాత్రమే పోలీసులు కేసులు నమోదు చేసి ఎఫ్‌ఐఆర్ ఇచ్చారు. చాలా సంఘటనల విషయంలో బాధితులు భయంతో పోలీసులకు ఫిర్యాదు చేయలేదు. గ్రామ పెద్దలు జోక్యం చేసుకొని పోలీసులకు ఫిర్యాదు వద్దు రాజీ కుదుర్చుకోవాలని వత్తిడి చేశారు. నమోదు చేసిన కేసుల్లో అసలు చార్జిషీట్ పెట్టి ట్రయల్ ప్రక్రియ వరకు పోలీసులు తీసుకెళ్లలేదు. గ్రామంలో దళితులపై దాడి జరిగిన సంఘటనలో ఎంఆర్ఓ గ్రామాన్ని సందర్శించి నివేదికను తయారు చేస్తాడు. కలెక్టర్ నివేదికతో సహా ఆర్‌డిఒను గ్రామానికి పంపి పెద్ద మనుషులను, గ్రామస్తులను కూర్చోబెట్టి ప్రశాంత వాతావరణం కోసం ప్రయత్నాలు సాగించమని ఆదేశాలు జారీ చేయాలి. ఆ గ్రామాన్ని సామాజికంగా 'సున్నితమైన' లక్షణాలు గల గ్రామంగా జిల్లా కలెక్టర్ ప్రకటించి, చేపట్టే చర్యలు కొన్ని ఉంటాయి. సరిగ్గా మతపరమైన ఘర్షణలు, దాడులు, ఉద్రిక్తతల విషయంలో కూడా జిల్లా కలెక్టర్లు పైన వివరించిన విధంగా స్పందించవలసి ఉంటుంది అని ఎస్.ఆర్. శంకరన్ గారు నాకు ఒక సందర్భంలో చెప్పారు. మేం చూసిన మండలాల్లో వామపక్ష రాజకీయ పార్టీల, కాంగ్రెస్ పార్టీల, అధికార పార్టీల కార్యాలయాలు కనపడ్డాయి. కాని ఏ ఒక్క సంఘటనలో కూడా ఈ పార్టీలు గాని, వాళ్ల ప్రజా సంఘాలు గాని జోక్యం చేసుకుని బాధితులకు సానుభూతి, సంఘీభావం తెలిపినట్లుగా లేదు. అంటే పోలీసు యంత్రాంగం, రెవెన్యూ యంత్రాంగం, రాజకీయ వ్యవస్థలు, పౌర సమాజంకు ఈ క్రైస్తవ మత ప్రచారకుల, పౌరుల పట్ల పట్టింపు లేదు. నగరంలో ఉండే పెద్ద క్రైస్తవ సంస్థలు, కాంగ్రిగేషన్, రకరకాల దయాసిస్‌లు ఇటువంటి దాడులకు లోనుకారు. దాడికి గురవుతున్న వారంతా గ్రామాలలో ఉండే చిన్న మత ప్రచారకులు, దళిత క్రిస్టియన్లు. వీళ్లకు పెద్ద పెద్ద చర్చీలకు అందుబాటులో ఉండే విదేశీ, స్వదేశీ నిధులు అందుబాటులో ఉండవు. క్రీస్తు పట్ల విశ్వాసంతో, భక్తితో భక్తులు ఇచ్చే చిన్నపాటి చందాలతో అతి మామూలు జీవితం గడుపుతూ గ్రామాలలో ఉంటారు. హిందుత్వ ఆకతాయి ముఠాలకు వీళ్లు సాఫ్ట్ టార్గెట్. తెలంగాణలో గతంలో నక్సలైట్లపై తీవ్ర నిర్బంధం అమలులో ఉన్న సమయంలో వరంగల్ గ్రామాల్లో ఉండే పాస్టర్లు పోలీసుల ఆగ్రహానికి, వాళ్ల చేతుల్లో చిత్రహింసలకు గురైన ఉదంతాలు కూడా ఉన్నాయి.

భారత రాజ్యాంగం నాలుగవ చాప్టర్‌లో ఆర్టికల్ 25 నుండి 28 వరకు పౌరుల మత స్వేచ్ఛ, మత విశ్వాసాల ప్రచారం, మత మైనారిటీల వాళ్ల అభివృద్ధి కోసం విద్యా సంస్థలను ఏర్పరుచుకునే హక్కుల గురించి వివరంగా పేర్కొంది. అంటే దేశంలో ఏ పౌరుడైనా మత విశ్వాసాలు కలిగి ఉండడం, వాటిని ప్రకటించడం, ప్రచారం చేయడం ఒక హక్కు. గ్రామాల్లో ఉండే పేద క్రిస్టియన్లకు ఈ హక్కులను అనుభవించే పరిస్థితి క్రమక్రమంగా కనుమరుగవుతున్నది. వీళ్లు హిందూ దేవాలయాల లాగా వాళ్ల ప్రార్థనా మందిరాలను రోడ్ల పక్కన, ప్రభుత్వ భూముల్లో, కాలనీ మధ్యలో నిర్మించుకోవడం లేదు. వాళ్లు డబ్బులతో కొన్న స్థలాల్లోనో, వాళ్ల ఇండ్లలో ఒకమూల ఖాళీ స్థలంలోనో నిర్మించుకుంటున్నారు.

దళిత క్రిస్టియన్లకు హిందూ మతోన్మాద సంస్థల నుండి రక్షణ కల్పించి, వాళ్ల హక్కులను అనుభవించే పరిస్థితి కల్పించమని పౌర, ప్రజాస్వామిక సంస్థలుగా, పౌర సమాజంగా ప్రభుత్వంపై వత్తిడి పెట్టే బాధ్యత మనందరిపై ఉన్నది. అటు వైపుగా కృషి చేద్దాం. జరిగిన అన్ని సంఘటనలపై విచారణ జరిపించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేద్దాం.

*(రచయిత అధ్యక్షులు మానవ హక్కుల వేదిక)* వీ

# ప్రజలకు జీవిత ఖైదీల బహిరంగ లేఖ

***సత్ప్రవర్తన కలిగిన జీవిత ఖైదీలను విడుదల చేసే సమయంలో అర్హులైన వారిని కాకుండా రాజకీయ అండదండలున్న వారికి మాత్రమే అవకాశం ఇస్తున్నారనీ, ఈ విషయంలో పౌర, ప్రజాస్వామిక హక్కుల కార్యకర్తలు చొరవచూపాలనీ అంటున్నారు జీవిత ఖైదీలు***

గౌరవనీయులైన పౌర, ప్రజాస్వామిక, మానవ హక్కుల ఉద్యమకారులకు, కమ్యూనిస్టు పార్టీలకు, ప్రజా సంఘాలకు, రచయితలకు, మేధావులకు, మీడియా ప్రతినిధులకు జైళ్లలో అసంఖ్యాకమైన సమస్యల వలయంలో కట్టు బానిసల్లా బతుకీడుస్తున్న జీవిత ఖైదీలు నమస్కరించి చేస్తున్న విన్నపం.

2019 అక్టోబర్ 2 గాంధీగారి 150వ జన్మదినం. మిగిలినవారి సంగతేమో గాని, జైళ్లోని ఖైదీలకు అక్టోబర్ 2నే పెద్ద పండుగలా ఆర్భాటంగా జరుపుతారు. ఎందుకంటే గాంధీగారి జన్మదినం అక్టోబర్ 2 నాడే 'ఖైదీల సంక్షేమ దినం'గా ప్రభుత్వం అధికారికంగా నిర్వహిస్తున్నది. కాని ఖైదీల సంక్షేమాన్ని మాత్రం మరిచిపోతున్నది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో జైలుజీవితం గడిపిన స్వీయ అనుభవంతో 'నేరాన్ని ద్వేషించు – నేరస్తున్ని కాదు' అని గాంధీగారు సూత్రీకరించి '5 సంవత్సరాలు శిక్షాకాలం పూర్తి చేసిన జీవిత ఖైదీలలో సత్ప్రవర్తన తీసుకురావడం సాధ్యమేననీ, అంతకు మించి జైలు జీవితం గడపడం వల్ల అనేక ప్రతికూల పరిస్థితులకు దారితీస్తుందని' అన్న మాటలు అక్షరసత్యం. అందుకు మా జీవితాలే సాక్ష్యం. మన పాలక నేతల అస్తవ్యస్త విధానాల వల్ల కొన్ని సెక్షన్ల జీవిత ఖైదీలు 14 సంవత్సరాల నుండి 25 సంవత్సరాల శిక్షాకాలం చేసినా, సత్ప్రవర్తన కలిగి ఉన్నా విడుదలకు నోచుకోవడం లేదు. తీవ్రమైన కారు బాంబు కేసులో శిక్షపడ్డ, జైల్లో ఉండి చక్రం తిప్పి పరిటాల రవితో సహా అనేక హత్యలు, దందాలు చేసి కోట్లు కూడబెట్టుకున్న భూస్వామ్య ముఠా నాయకుడు మద్దెల చెరువు సూర్యనారాయణరెడ్డి లాంటి హంతకులకు 11 సంవత్సరాలకే క్షమాభిక్ష పెట్టి విడుదల చేసిన విషయం మనందరికీ తెలుసు. జైలు నుండి రిలీజైన తర్వాత కూడా ఎలాంటి నేర జీవితం గడిపాడో కూడా తెలిసిందే. కాని పేదరికం వల్ల దొంగతనం కోసం చేసిన ప్రయత్నం వికటించి చిలకలూరిపేట బస్ దహనానికి పాల్పడిన చలపతి, విజయవర్ధన్‌రావులు దాదాపు 25 సంవత్సరాలుగా జీవిత శిక్ష అనుభవిస్తున్నా ఇప్పటికీ వారి విడుదల ప్రశ్నార్థకంగానే ఉండడం బాధాకరం. ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

మన పాలకులే నియమించిన జస్టిస్ ముల్లా కమిషన్, జస్టిస్ పాండురంగారావుల కమిషన్లు జైళ్ల పరిస్థితులను, ఖైదీల ప్రవర్తనను అధ్యయనం చేసి ఇచ్చిన నివేదికలను కూడా మన పాలకులు పట్టించుకోకపోవడంతో జైళ్లలో ప్రజాస్వామిక సంస్కరణలు దాదాపు జరగనే లేదు.

మేమూ పౌరులమే అంటుంది ప్రభుత్వం. కాని మాకు ఓటు హక్కు నేటికీ నిరాకరించబడుతూనే ఉంది. కాబట్టి ఎన్నికల సమయంలో కూడా మా సమస్యలు చర్చకు రావడం లేదు. ఎత్తయిన జైలు గోడల మధ్య మరిన్ని సమస్యల వలయాల్లో జీవిస్తున్న మా సమస్యలు సగటు పౌర సమాజానికి, ప్రధాన స్రవంతి మీడియాకు కనీస పట్టింపు లేదు. ఇలాంటి నిరాశాపూరిత పరిస్థితుల్లో మా సమస్యలను సామాజిక చైతన్యంతో, మానవతావాద దృక్పథంతో అర్థం చేసుకోగల వారిపైనే మా ఆశ. జైలు జీవితం గడిపిన అనుభవాలు కూడా మీలోని కొందరికైనా ఉండడం వల్ల మా సమస్యలను అర్థం చేసుకోగల అవగాహన, ఆసక్తి ఉంటుందని మాలోని చాలా మంది అభిప్రాయం. గాంధీగారి 150వ జన్మదినాన్ని పురస్కరించుకొని అనేక విషయాలపై చర్చ ప్రారంభమైంది. కాని ఆ రోజు 'ఖైదీల సంక్షేమ దినం' కూడా నన్న విషయం గాని, ఈ సందర్భంగా ఖైదీల సమస్యలు కూడా చర్చించబడాలని, ఖైదీల సంక్షేమం ఎంత మరుగున పడిపోయిందో చాలా మందికి తెలియదు. ఏదైనా చొరవ తీసుకొని చర్చిస్తే తప్ప మా సమస్యలు వెలుగులోకి వచ్చే అవకాశమే లేదు. ముఖ్యంగా 2018, 2019 సంవత్సరాల్లో ఎన్నడూ లేని విధంగా అధికార టిడిపి ప్రభుత్వం తెరపైకి తెచ్చిన అన్యాయమైన పక్షపాతంతో కూడిన క్షమాభిక్ష ప్రక్రియ వల్ల ఎంతటి దారుణ పరిస్థితులు అనుభవించామో వర్ణించడం కష్టమే. ఇంతటి తీవ్రమైన సమస్య మీ దృష్టికి వచ్చిందో లేదో తెలియదు కానీ, ఎవ్వరి నుండి కనీస ఖండనగానీ, కనీస చర్చ గానీ జరగకపోవడం మమ్మల్ని మరింత నిరుత్సాహపరిచింది. సామాజిక శ్రేయస్సు కోసం పనిచేసే మీలాంటి వారు కూడా మమ్మల్ని మరిచిపోతున్నారేమోనన్న విషయం మమ్మల్ని మరింతగా కృంగదీస్తున్నది. తక్షణం మేము ఎదుర్కొంటున్న తీవ్రమైన సమస్యను మీ దృష్టికి తెస్తున్నాం. 150వ గాంధీ జయంతి నాడైనా ఖైదీల సంక్షేమ దృష్టితో కూడా చర్చ జరిగేలా మా సమస్యల తీవ్రతను నేటి పాలక ప్రభుత్వం దృష్టికి తెచ్చేలా, మెరుగైన పరిష్కారం లభించేలా చూడగలరని కోరుకుంటున్నాం.

❖❖❖❖

**విషయం :** అన్యాయమైన, పక్షపాతంలో కూడిన తమ ఇష్టానుసారం జీవిత ఖైదీలను విడుదల చేసే విధానాన్ని సరిచేయుట గురించి.

**పెద్దలారా!**

స్వాతంత్ర్యం సిద్ధించిన నాటి నుండి 2017 దాకా దాదాపు 15 సార్లకు పైగా క్షమాభిక్షపై జీవిత ఖైదీల విడుదలలు జరిగాయి. కాని ఎన్నడూ లేని విధంగా అన్యాయపు, పక్షపాతంతో కూడిన క్షమాభిక్షపై జీవిత ఖైదీల విడుదల ప్రక్రియను తెరపైకి తెచ్చింది ఆనాటి అధికార టిడిపి ప్రభుత్వం. మన రాష్ట్రంలోనే కాదు మరే ఇతర రాష్ట్రాలలో కూడా ఇలాంటి విడుదల విధానం అనుసరించలేదు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2018 జనవరి 26న రిపబ్లిక్ డే సందర్భంగా

# కశ్మీర్ వాస్తవ స్థితిపై నివేదిక

*ఆర్టికల్ 370 రద్దు తరువాత కశ్మీర్‌లోని వివిధ ప్రాంతాల్లో పర్యటించి అక్కడి స్థానిక ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను, నిరసనలను, స్వేచ్ఛా ఆకాంక్షలను వివరిస్తున్నారు* **నిత్యా రామకృష్ణన్, నందిని సుందర్**

**మేం** అక్టోబర్ 5 నుండి అక్టోబర్ 9 ,2019 మధ్యకాలంలో కశ్మీర్ లోయను సందర్శించాం. మూడు వేర్వేరు ప్రాంతాలకు చెందిన వివిధ ప్రజా శ్రేణులకు ప్రాతినిధ్యం వహించే అనేక మంది వ్యక్తులతో మాట్లాడాం.

**శ్రీనగర్**

మేము శ్రీనగర్‌లో జర్నలిస్ట్ సెంటర్, కోర్టులు, మార్కెట్లు మరియు ఇతర కొన్ని పరిసర ప్రాంతాలను సందర్శించి సుమారు 38 మందిని కలిసాము. వారిలో టాక్సీడ్రైవర్లు-2, ఆటోడ్రైవర్లు-3, హౌజ్ బోట్ యజమానులు-2, లాయర్లు-2, స్కూల్, కాలేజీ టీచర్లు-2, దుకాణ గుమాస్తాలు-5, వీధి వ్యాపారులు-2, హోటల్ యజమాని -1, వెయిటర్‌లు -2, జర్నలిస్టులు-6, ప్రభుత్వ అధికారి-1, (పోలీస్ సంరక్షణలో ఉన్న) మైనర్లు-10 మంది ఉన్నారు.

**షోపియన్ / పుల్వామా**

మేము 4 గ్రామాలను, షోపియన్ పండ్ల మండీని సందర్శించాం. పుల్వామాలోని పరిగాం గ్రామంలో - 4 (హింసా బాధితులతో సహా), 11 వ తరగతి విద్యార్థి-1 , కరీమాబాద్ గ్రామం - 4 (ముగ్గురు ఖైదీల కుటుంబ సభ్యులైన స్త్రీ లతో సహా), ఎస్‌ఎస్, ఎస్‌బి గ్రామాలలో అరెస్ట్ అయిన బాలల కుటుంబాలు, పండిట్ కుటుంబంలో వృద్ధ దంపతులు2, సిఆర్‌పిఎఫ్ జవాన్-1 , ఆపిల్ పళ్ల పెంపకందార్లు-2 మొత్తం సుమారు 25 మందిని కలిసాం.

**సోపోర్/కుప్వారా**

మేం సోపోర్ పండ్ల మండీతో పాటు దగ్గర్లోని 2 గ్రామాలకు వెళ్లాం. సోపోర్ పండ్ల మండీ అధికారులు -5 , ఫ్రింగ్రూ గ్రామస్థులు -5 ,6 , భాండీ గ్రామంలో సర్పంచ్, పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ కింద అరెస్ట్ అయిన జిల్లా ప్రెసిడెంట్ కొడుకు, పోలీస్ కస్టడీ లో మరణించిన ఒక యువకుని తల్లి, అంకుల్‌లు -6 మొత్తం సుమారు 15 మందితో మాట్లాడాం.

**స్థూలాభిప్రాయాలు**

మేము 5 రోజుల్లో దాదాపు 75 మందితో మాట్లాడాం. వారిలో ఏ ఒక్కరూ ఆర్టికల్ 370 ని రద్దు చేసి కశ్మీర్‌ను కేంద్ర పాలిత ప్రాంతంగా చేయడాన్ని హర్షించడం లేదు. ప్రతి ఒక్కరూ ఆజాదీ కోరుకుంటున్నారు. (వాళ్ల దృష్టిలో ఆజాదీ అంటే ఇండియాతో గాని, పాకిస్తాన్ తో గాని

---

సత్ప్రవర్తన గల జీవిత ఖైదీల విడుదల కోసం జిఒ ఎంఎస్ నెం:8లో కఠినమైన మార్గదర్శకాలను రూపొందించి ఆయా జైళ్లకు పంపింది. సంబంధిత మార్గదర్శకాల ప్రకారం అన్ని అర్హతలున్న 149 మంది జీవిత ఖైదీలను విడుదల చేయుటకు సిఫారసు చేస్తూ ప్రభుత్వం నియమించిన స్టాండింగ్ కమిటీకి జైళ్ల శాఖ పంపింది. స్టాండింగ్ కమిటీవారు కేవలం 49 మందిని మాత్రమే విడుదల చేయుటకు తుది ఆదేశాలు జారీ చేశారు.

విడుదలైన వారిలో అధికంగా అధికార టిడిపి వారే ఉండడంతో జైళ్లలోని జీవిత ఖైదీలలో తీవ్ర నిరాశ, నిస్పృహలు ఆవరించాయి. విడుదలకు అన్ని అర్హతలుండీ విడుదల కాలేకపోయిన బాధిత జీవిత ఖైదీలలో కొంతమంది న్యాయం కోసం హైకోర్టును ఆశ్రయించారు. విచారణ అనంతరం పిటిషనర్ ఖైదీల న్యాయమైన వాదనను పరిగణన లోకి తీసుకొని విడుదల విన్నపాన్ని పరిశీలించాలని చెప్పింది. కాని సదరు ఖైదీల విడుదల గురించి జైళ్ల శాఖ పట్టించుకోలేదు.

మళ్లీ 2019 జనవరి 26న ప్రభుత్వం సత్ ప్రవర్తన గల జీవిత ఖైదీల విడుదల కోసం జిఒ ఎంఎస్ నెం:6లో మార్గదర్శకాలను ఆయా జైళ్లకు పంపింది. కోర్టు తీర్పువల్లనే ఈ జిఒ వచ్చిందని గత సంవత్సరం విడుదల కాలేక ఆగిపోయిన వారితో సహా అర్హులైన జీవిత ఖైదీలంతా ఈసారి విడుదల అవుతారని ఆశించారు. అలా తాజా మార్గదర్శకాల ప్రకారం సత్ ప్రవర్తన గల 160 మంది జీవిత ఖైదీల విడుదల జాబితాను జైళ్ల శాఖ స్టాండింగ్ కమిటీకి పంపింది. ఈసారి మరింత అన్యాయంగా ఇందులోని కేవలం 33 మందిని మాత్రమే విడుదల చేస్తూ తుది ఆదేశాలు జారీ అయ్యాయి. మిగిలిన 127 మంది జీవిత ఖైదీలను ఏ కారణంగా విడుదలకు అనర్హులుగా తేల్చారో ఎవ్వరూ చెప్పకపోవడం మరింత బాధించింది. ఈసారి కూడా విడుదలైన వారిలో అధికార తెలుగుదేశం ప్రభుత్వం వారే ఎక్కువగా ఉన్నారని ఆరోపణలు చెలరేగాయి. గత సంవత్సరం హైకోర్టు మెట్లెక్కిన వారిలో కూడా కొంతమంది విడుదల ఆగిపోవడంతో బాధిత జీవిత ఖైదీలు తీవ్ర ఆవేదన చెందారు. అసలు విడుదలకు ఎలాంటి ప్రమాణాలు కలిగి ఉండాలో అర్థం కాని అయోమయం జీవిత ఖైదీల్లో ఏర్పడింది. తిరిగి మళ్లీ అప్పో సప్పో చేసి కొంతమంది హైకోర్టును ఆశ్రయించక తప్పలేదు.

విచారణ అనంతరం హైకోర్టు మరికొంత స్పష్టతనిస్తూ 'ప్రభుత్వం రూపొందించిన మార్గదర్శకాలకనుగుణంగా అర్హులైన జీవిత ఖైదీల విడుదల జాబితాలోని కొంత మందికి స్పెషల్ రెమిషన్ ఇచ్చి విడుదల చేయడానికి గాని, మిగిలిన వారి విడుదలను నిలిపివేయడానికి ఎలాంటి సహేతుక కారణాలు చూపలేకపోయిందని చెప్పింది. వీ

కలవకుండా స్వతంత్రంగా ఉండే ఆజాదీ నుండి పాకిస్తాన్‌తో కలిసిపోయే ఆజాదీ వరకు ఏదైనా కావచ్చు). ముఖ్యంగా సమాచార నిషేధం, భారీ మిలిటరీ మోహరింపు, తీవ్ర నిర్బంధం, ప్రాథమిక హక్కుల తిరస్కరణల మధ్య ఆర్టికల్ 370 రద్దు ద్వారా కశ్మీర్‌ను భారతదేశంతో పూర్తిగా విలీనం చేశామనే దాన్ని ఎవరూ ఆమోదించడం లేదు.

మేమొక పండిట్‌ని కలిసాం. ఆయనకు ఆజాదీ పట్ల స్పష్టమైన అభిప్రాయమేమీ లేదు. కానీ ఆయనంటాడు 'మా పిల్లలు ఢిల్లీలో ఉంటారు. కనుక వాళ్లకు దూరంగా నేనుండలేను'. అలాగని ఇక్కడి ప్రజలు ఇండియాలో అంతర్భాగంగా ఉండడానికి ఎప్పుడూ ఆమోదించరని అన్నాడు. ప్రస్తుతం పాకిస్తాన్‌కు భారతదేశాన్ని అడ్డుకునే శక్తి లేదు కాబట్టి భారత ప్రభుత్వం ఈ పరిస్థితి నుంచి గట్టెక్కవచ్చుననంటూనే ఆర్టికల్ 370 రద్దు పట్ల తన అసంతృప్తిని వ్యక్తం చేశాడు. ఎవరికి ఆజాదీ వద్దని ఉంటుందనంటూ హంద్ వారా లోని నేషనల్ కాన్ఫరెన్స్ కు సంబందించిన ఒక గ్రూప్ మద్దతు దారులు ఒకవేళ ఆర్టికల్ 370 ని పునరుద్ధరిస్తే మళ్లీ సాధారణ పరిస్థితులు నెలకొనవచ్చునని భావించారు.

కశ్మీర్‌లో మైనార్టీలుగా ఉన్న గుజ్జార్లకు సంబంధించిన ఒక సర్పంచ్ 'జంతువులు కూడా ఆజాదీ కావాలనుకుంటాయి' అన్నాడు. శ్రీనగర్ లోని దుకాణ గుమస్తా ఒకాయన ఇన్నేళ్లుగా భారత ప్రభుత్వం ఆర్టికల్ 370ని బలహీనపరుస్తూ రావడం వల్ల ప్రస్తుతం ఈ రద్దు ప్రభావం ఆచరణలో తీవ్రంగా ఏముండనప్పటికీ, అయినా అది మా అస్తిత్వానికి చిహ్నం కదా అనన్నాడు.

ఇలా వ్యక్తుల నిర్దిష్టాభిప్రాయాలు ఎలా ఉన్నప్పటికీ, ప్రతి ఒక్కరూ తమ అస్తిత్వాన్ని కోల్పోయామని, వాళ్లతో ఎటువంటి సంప్రదింపులు లేకుండానే, వాళ్ల భవిష్యత్తుపై తీవ్ర ప్రభావం వేసే భారత ప్రభుత్వపు ఈ హఠాత్ నిర్ణయం వల్ల చాలా అవమానపడ్డామని ప్రతి ఒక్కరూ భావించారు.

ఆర్థికపరంగా, విద్యాపరంగా తీవ్ర నష్టాలెదుర్కుంటున్నప్పటికీ రాష్ట్ర వ్యాప్తంగా కశ్మీర్ ప్రజలంతా సంపూర్ణ హర్తాళ్ (బంద్) పాటిస్తున్నారు. ప్రధాన పార్టీల నుంచి మొదలుకొని వేర్పాటువాద పార్టీల నాయకులందరినీ జైళ్లల్లో బంధించి ఉంచడం వల్ల ప్రజలు తమకు తామే అహింసాయుత శాసనోల్లంఘనోద్యమం ద్వారా స్వచ్ఛంద ప్రతిఘటనకు పూనుకుంటున్నారు. అయితే ఇవన్నీ భారత ప్రభుత్వం చెబుతున్నట్టుగా ఏ మిలిటెంట్ల ఆదేశాలతో మాత్రం జరగడం లేదు. మొత్తంగానే ప్రజలే స్వచ్ఛంద మౌన సత్యాగ్రహాన్ని పాటిస్తున్నారు.

ముఖ్యంగా బుర్ హాన్ వని మరణం తర్వాత కశ్మీర్ ప్రజలు ప్రస్తుత పరిస్థితులను 2016 నాటి పరిస్థితులతో పోల్చుకుంటున్నారు. వారి దృష్టిలో ప్రస్తుతం ప్రధానమైన తేడాలేమిటంటే – (1) ఎటువంటి నాయకత్వం లేకుండా ప్రజలు తమంతట తామే ముందుకు వచ్చి ప్రతిఘటనకు పూనుకుంటున్నారు. (2) మొదట్లో ఉన్నట్టుగా దక్షిణ కశ్మీర్ లోనే కాకుండా ఇప్పుడు లోయ అంతటా ప్రతిఘటనా కార్యకలాపాలు జరుగుచున్నాయి. (3) మొదట్లో భారత ప్రభుత్వంతో ఉన్నవాళ్లందరూ ఇప్పుడు వేరు పడిపోయారు.

కశ్మీర్‌లో చాలా తక్కువ సంఖ్యలో ప్రజలు హతమవుతున్నప్పటికీ, అక్కడ ఎటువంటి ప్రతిఘటన గాని, ప్రాణనష్టంగాని లేదని భారత ప్రభుత్వం పేర్కొనడం పూర్తిగా అవాస్తవం. అలాగే ప్రజలు కొత్త కొత్త వ్యూహాలను రూపొందించుకునేంతవరకు భారత ప్రభుత్వం పేర్కొంటున్న ఈ పరిస్థితి తాత్కాలికమే గాని, ప్రజలపై ప్రభావం వేయగల మొత్తం నాయకత్వాన్ని జైల్లో బంధించడం, సమాచార ప్రసార వ్యవస్థలను సంపూర్ణంగా నిరోధించడం లేదా నిషేధించడం లాంటివి మాత్రం అపూర్వమే, గతంలో ఎన్నడూ జరగనట్టివే !

కశ్మీర్ ప్రజలు భారత ప్రభుత్వాన్ని ఎంతైతే ద్వేషిస్తున్నారో, అంతే స్థాయిలో భారత ప్రజల పట్ల మర్యాద పూర్వకంగా, దయామయంగా ఉన్నారు. జాతీయ టెలివిజన్ మీడియా నైతే ప్రభుత్వంతో మిలాఖతై అంతా సజావుగానే ఉందన్న అబద్ధాన్ని నిత్యం ప్రసారం చేస్తున్నది. అంతే గాకుండా ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలు ఆర్టికల్ 370 రద్దు వల్ల ఒనగూరే ప్రయోజనాలను ప్రతిరోజూ ఏకరువు పెడుతూ ఉండడం వారికి చాలా అవమానకరంగా ఉందని చెప్పారు. గత రెండున్నర నెలల కాలంలో ఆర్టికల్ 370 రద్దుపై ఏ కశ్మీర్ పత్రికలోనూ ఒక్క సంపాదకీయ వ్యాసమైనా రాలేదు. అక్కడ ఫోన్లు, ఇంటర్నెట్లు లేక ప్రజలందరూ తాము ఏ రాతియుగంలోకో నెట్టి వేయబడ్డట్టుగా ఫీలవుతున్నారు.

అక్కడ హైకోర్టు అయితే నడవడమే లేదు. ప్రైవేట్ లాయర్లు లేనే లేరు. అక్కడి కొందరి లాయర్ల ద్వారా మాకు తెలిసిందేమిటంటే – దాదాపు 300 హెబియస్ కార్పస్ పిటిషన్లు దాఖలైతే కోర్టులు మాత్రం ప్రభుత్వానికి ఎక్కువ సమయాన్నిచ్చి పిటిషన్లే నిష్ఫలం అయ్యేటట్లు చేశాయి.

కశ్మీర్‌లో ఏ గ్రామానికి వెళ్లినా పక్కా ఇళ్లు, టాయిలెట్లు, గ్యాస్ సిలిండర్లు ఉన్నాయి. అక్కడి అభివృద్ధి దేశంలోని చాలా ప్రాంతాల అభివృద్ధి కన్నా మెరుగ్గానే కనిపించింది. కనుక స్వచ్ఛ భారత్ అభియాన్, ఉజ్వల యోజన, గృహ పథకాల్లాంటి వాటి అవశ్యకత అక్కడ లేదనిపించింది.

భారత ప్రభుత్వంతో ఏకీభవించే ఫరూక్ అబ్దుల్లా తో సహా ప్రధాన స్రవంతి రాజకీయ నాయకులనందరిని జైల్లో వేశారు. హిందువుల పవిత్రమైన అమర్నాథ్ యాత్రను సైతం రద్దు చేసి ప్రభుత్వం యాత్రికులను మధ్య దారిలోనే అడ్డగించి వెనుకకు పంపించి వేసింది. సరైన అంతర్జాతీయ ఒత్తిడి లేకపోతే రాబోయే కాలంలో మోడీ ప్రభుత్వపు ఈ హఠాత్ చర్య పాలస్తీనా ఆక్రమణ లాంటి స్థితికి దారి తీసి కశ్మీరీలకు మాత్రమే కాకుండా మొత్తంగా భారత రాజకీయార్థిక వ్యవస్థకే భారీ నష్టాలను కలిగిస్తుంది.

**ఆర్థిక నష్టాలు:** భారీ స్థాయి మిలిటరీ మోహరింపువల్ల ప్రజలు అభద్రతతో జీవిస్తున్నారు. కర్ఫ్యూ విధించిన సంపూర్ణ హర్తాళ్ వల్ల ప్రజలు చాలా ఆర్థిక నష్టాలనెదుర్కుంటున్నారు. కొన్ని చోట్ల అధికారికంగా ఎటువంటి ఆంక్షలు లేవని చెబుతున్నప్పటికీ, ప్రభుత్వం మళ్లీ విధించిన ఆంక్షలు ఎక్కడ కొనసాగుతున్నాయనే దాని పట్ల అనిశ్చితి ఉంది. ఉదాహరణకు 20 పోలీస్ స్టేషన్ల పరిధిలో ప్రభుత్వం ఆంక్షలు తొలగించినట్లు చెబుతున్నా ఏయే నిర్దిష్ట స్టేషన్లో తెలియకపోవడం వల్ల ప్రజల్లో సందిగ్ధత ఉన్నది. ఆర్టికల్ 370 రద్దు నేపథ్యంలో ఒక ట్యాక్సీ డ్రైవర్ తన నెలవారీ ఆదాయం రు. 8000ల నుండి రు. 5000ల వరకు అంటే రు.3000లకు పడిపోయిందని అన్నాడు. 16 రూమ్‌ల హోటల్ నడిపిస్తున్న ఒకాయనైతే ప్రస్తుతం టూరిస్టులు లేనందువల్ల ఆటో నడుపుకుంటున్నానన్నాడు. మరో ఆటోడ్రైవర్ అడపా దడపా రాళ్ల దాడుల భయం కారణంగా రాత్రిపూట తన ఆటోను అత్తామామల ఇంట్లో పెట్టి డౌన్ టౌన్‌కు నడుచుకుంటూ ఇంటికి వస్తున్నట్టు చెప్పాడు. సౌరా ప్రాంతంలో ఒక కూరగాయల వ్యాపారి తన దుకాణాన్ని రోజంతా తెరిచి ఉంచినందుకు రాత్రి దాన్ని కాలబెట్టారు. ఒక పాల వ్యాపారిని తన దుకాణాన్ని పొద్దటి పూట తెరిచి ఉంచినందుకు బెదిరించారని, మరో ఆపిల్ యజమాని ఆపిల్ పండ్లనమ్మినందుకు రాత్రికిరాత్రే అతని 6 ఆపిల్ చెట్లను నరికేశారని చెప్పారు. కానీ ముందే అడ్వాన్స్ ఒప్పందం చేసుకున్న చోట్ల మాత్రం సాయంత్రం వేళల్లో ప్రభుత్వ రక్షణలో ఆపిల్ పళ్లు రవాణా అవుతున్నాయి.

అలాగే అక్టోబర్ 9వ తేదీన రెండు రెస్టారెంట్లు రోజంతా తెరిచి ఉండడం చూశాము. మరో ఆపిల్ యజమాని ఆజాదీ కోసం అవసరమైతే ఆపిల్ పళ్లను అమ్మకుండా సంవత్సరానికి వచ్చే 9–10 లక్షల రూపాయల ఆదాయాన్ని సైతం కోల్పోవడానికి సిద్ధమని అన్నాడు.

కేవలం టూరిస్ట్ వ్యాపారం మీదనే ఆధార పడిన హౌజ్ బోట్ యజమానులు, కూలీలు మొదలైనవారంతా హర్తాళ్ వల్ల చాలా నష్టపోయామన్నారు. ఒక పడవ యజమాని తనకు 7 లక్షల రూపాయల నష్టం వచ్చిందన్నాడు. వార్తా ప్రసార మాధ్యమాల నిషేధం వల్ల గుజరాత్ నుంచి తెప్పించి చేసే సుగంధ ద్రవ్యాల వ్యాపారం ఆగిపోయిందని మరో వ్యాపారి చెప్పాడు.

అక్కడక్కడా పెళ్లిళ్ల లాంటి శుభకార్యాలు జరుగుతున్నప్పటికీ ఆహ్వానితుల సంఖ్య అతి తక్కువగా ఉండడం వల్ల ఆహార పదార్థాలను వండి సరఫరా చేసే క్యాటరింగ్ వ్యాపారం తగ్గుముఖం పట్టిందని ఆ వ్యాపారులు చెప్పారు. ప్రతి సంవత్సరం అనాథల సామూహిక వివాహాలు జరిపించే ఒక ప్రభుత్వేతర సంస్థ 'ఆష్' కు సంబందించిన యజమాని గతంలో వలె బిర్యాని కాకుండా ఈ సంవత్సరం కహ్వ (కశ్మీరీ చాయ్) ను మాత్రమే వడ్డించామని చెప్పాడు.

శ్రీనగర్లో, తదితర పరిసర గ్రామాలలో చాలా మంది తమ మధ్య సమిష్టి సహకార తత్వం ఉండడం వల్ల ఈ హర్తాళ్ ను, దిగ్బంధనాన్ని తట్టుకుంటున్నామన్నారు. పైగా ఇటువంటి ఘర్షణాత్మక పరిస్థితుల్లో తమ మధ్య సహకార సమిష్టి తత్వం బలపడుతోందని చెప్పారు. ఆంచార్ (Aanchar) లాంటి ప్రాంతాలలో తమ చుట్టూ బారికేడ్లు పెట్టి దిగ్బంధించడం వలన బైటికి వెళ్లలేక, ఇదివరకే దాచి ఉంచుకున్న బియ్యాన్ని వాడుకుంటూ బతుకుతున్నామని చాలామంది వ్యవసాయదారు లు చెప్పారు.

**ఆపిల్ వ్యాపారం:** షోపియన్, సోపోరే ప్రాంతాలలో మేం ఆపిల్ పండ్ల మండీలను దర్శించాం. ఎటువంటి ట్రక్కుల ఆనవాళ్లు లేకుండా అవి పూర్తిగా మూసివేయబడి ఉన్నాయి. షోపియన్‌లో ఒక ఆపిల్ యజమానైతే హర్తాళ్ వల్ల ఆజాదీ కనుక సాధించబడుతుందంటే లక్షల రూపాయల నష్టాన్నైనా భరిస్తానన్నాడు.

సోపోరే ఆపిల్ మండీలో ఉద్యానవనశాఖ కార్యాలయం తెరిచిఉంది. సాధారణంగా రోజుకు 300 ట్రక్కుల ఆపిల్ పండ్లు బైటికి పంపిస్తుండగా, గత సెప్టెంబర్ 15న మార్కెట్ మధ్యవర్తిత్వపథకం ప్రకటించిన తర్వాత 3 ట్రక్కులు మాత్రమే బైటికి పంపించామని జాతీయ వ్యవసాయ సహకార సమాఖ్య (ఎన్ఎఎఫ్ఇడి) అధికారులు చెప్పారు.

గత సంవత్సరం మండీ టర్నోవర్ ఒకవేయి కోట్ల రూపాయలుండింది. బారాముల్లా జిల్లాలో 9400 మంది రైతులలో 586 మాత్రమే జాతీయ వ్యవసాయ సహకార సమాఖ్యతో నమోదు చేసుకొని తమ ఆపిల్ పండ్ల వ్యాపారం చేసుకుంటున్నారు. ఆ 586 మందిలో 46 మంది రైతులు ఈ మండీలో తామే స్వయంగా ఆపిల్ పండ్లనమ్ముకుంటున్నారు.

అయితే సెప్టెంబర్ 15కు ముందు ఆజాద్ పూర్ మండీ వ్యాపారులతో ఇదివరకే ముందస్తు ఒప్పందాలు చేసుకున్నవాళ్లు సమాఖ్యతో సంబంధం లేకుండా నేరుగా ఆపిల్‌పండ్లను బైటికి పంపి వ్యాపారం చేసుకుంటున్నారు. ఇలా సోపోరే మండీ లోపల సంపూర్ణ హర్తాళ్ అమలు జరుగుతుండగా, మండీ బైట అక్కడక్కడా అనధికారికంగా ఆపిల్ పండ్ల వ్యాపారం జరుగుతోంది. ఒకవైపు ఆపిల్ సాగు దారులకు మార్కెట్ మధ్య వర్తిత్వ పథకం లాభసాటిదని చెబుతూనే, మరోవైపు గ్రేడ్ల వారీగా పండ్లను ఏరి వేసి వేర్వేరు రేట్లు నిర్ణయించడం వలన ప్రస్తుతం ఆపిల్ సాగుదార్లు చాలా నష్టపోతున్నారు.

హంద్ వారాలో ఇదివరకే ఒప్పందాలు చేసుకున్న ఆపిల్ సాగుదారులైతే మెరుగ్గానే వ్యాపారం చేసుకుంటున్నారు. కానీ ముందస్తు ఒప్పందాలు చేసుకోనని వారు కమ్యూనికేషన్ల నిరోధం వలన ఏ రేట్ల చొప్పున అమ్మాలో తెలియక చాల నష్టాలపాలౌతున్నారు.

**మతపర ఆంక్షలు:** పోలీసులు వివిధ గ్రామాలు తిరుగుతూ ఈద్గాలవద్ద ప్రజలు గుమిగూడవద్దని, లౌడ్ స్పీకర్లనుపయోగించి ఈద్గాలలో నమాజ్ చేయవద్దని ఆదేశించినందువల్ల ఈ సంవత్సరం ఈద్గాలలో నమాజ్ జరగనే లేదు.

**విద్యాపరమైన నష్టాలు:** సాంకేతికంగా స్కూళ్ల బంద్ ప్రకటించి నప్పటికీ, పిల్లలెవరూ స్కూళ్లకు వెళ్లడంలేదు. ఉపాధ్యాయులు ఒకరోజులో 2 గంటలకొకసారి హాజరు మార్క్ చేస్తున్నారు. కొన్ని కొన్ని సార్లు వారానికి 2,3 సార్లే హాజరు వేస్తున్నారు. శ్రీనగర్‌లోని సౌరాలో ఒక 6 ఏళ్ల బాలిక పోలీసులు కాల్పులు జరుపుతారేమోనని భయంగా ఉందని చెప్పింది. ఆగష్టు 5 నుండి భారీ స్థాయిలో మిలిటరీ వాళ్లు స్కూల్ ను ఆక్రమించి మోహరించడం వలన తల్లిదండ్రులు తమ పిల్లలెవర్నీ స్కూల్ కు పంపడం లేదని చెప్పారు.

గ్రామీణ ప్రాంతాల్లో కూడా సాయుధ బలగాలు మోహరించి ఉండడం వల్ల ప్రజలు భయపడి తమ పిల్లలను స్కూళ్లకు పంపడం లేదు. పుల్వామాలో పరిగాం గ్రామానికి చెందిన 11వ తరగతి చదువుతున్న ఒక బాలిక శ్రీనగర్‌లోని ఒక కళాశాలలో మెడికల్ ఎంట్రన్స్ పరీక్ష కోసం కోచింగ్ తీసుకుంటోంది. ఇప్పుడు జరుగుతున్న హర్తాళ్ వల్ల ఆమె ఇంటికి తిరిగి వచ్చింది. వచ్చే నవంబర్‌లో చివరి వారంలో జరగబోయే ఎంట్రన్స్ పరీక్ష ఎలా రాస్తానోనని ఆందోళన వెలిబుచ్చింది.

శ్రీనగర్లోని ఒక మిడిల్ స్కూల్ టీచర్ తమ వద్ద చిరునామాలున్న విద్యార్థులకు అసైన్‌మెంట్లు పంపించామని, మిగితా వాళ్లకు ఎలా పంపించాలో తెలియడం లేదని వాపోయాడు. ఒక కళాశాల అధ్యాపకురాలు 'మేమంతా క్రమం తప్పకుండా కళాశాలకు వెళ్లుతున్నాం కానీ విద్యార్థులెవరూ హాజరు కావడం లేదు' అని చెప్పింది. అక్టోబర్ 9న కళాశాలలు అధికారికంగా తెరిచినప్పటికీ, ప్రజారవాణా సదుపాయాలు లేనందువల్ల విద్యార్థులెవరూ రావడం లేదని తెలిపింది.

**మైనర్ పిల్లల అరెస్ట్:** ఆగస్ట్ 5కు ముందు ఒక సంవత్సర కాలం పాటు పుల్వామా, శ్రీనగర్లలో సైన్యం గ్రామాల్లో జనగణన చేసింది. ఆగష్టు 5 తర్వాత 5,6 సం.ల వయసున్న మైనర్ పిల్లలను పట్టుకొని పోలీస్ స్టేషన్లలో నిర్బంధించి వారి తల్లిదండ్రులనుంచి, దగ్గరి బంధువుల నుంచి పూచీకత్తు తీసుకొని వదిలివేస్తున్నారు. కొందరు పిల్లలనైతే ఉదయం, సాయంత్రం రెండు సార్లు పోలీస్ స్టేషన్ కొచ్చి రిపోర్ట్ చేయమని తాఖీదులిస్తున్నారు. ఎందుకంటే – మసీదుల్లో లౌడ్ స్పీకర్లనుపయోగించి ప్రతిఘటనా గానాలను నిర్వహిస్తున్నారని, లేదా రాళ్లు రువ్వుతున్నారనే ఆరోపణలపై పిల్లలను నిర్బంధిస్తున్నారు. అందుకనే పిల్లలు తమ ఇళ్లల్లో రాత్రివేళ నిద్రించడానికి భయపడుతూ ఎక్కడో తమ దూరపు బంధువుల ఇళ్లల్లో నిద్రిస్తున్నారు.

**ఎస్ఎస్ గ్రామం, షోపియన్ జిల్లా:** సుమారు 20 ఏళ్ల వయసున్న పిల్లలను పట్టుకొని 15–20 రోజుల పాటు పోలీస్ స్టేషన్లలో నిర్బంధిస్తున్నారు. ఆగస్ట్ 10న 7వ తరగతి చదువుతున్న 12 సంవత్సరాల బాలున్ని పట్టుకొని నిర్బంధించి సెప్టెంబర్ 25 న వదిలివేసి బాల న్యాయా సదనంలో ఉంచారు. ఆ బాలునిపై రాళ్లు రువ్వడం, ఇళ్లు, వాహనాలను ధ్వంసం చేయడం లాంటి 6 కేసులను మోపారు. అయితే అతని తల్లిదండ్రులను కలిసి మరిన్ని ఎక్కువ వివరాలు మేము తెలుసుకోలేక పోయాం.

అదే గ్రామం నుండి ఆగస్ 10-20 తేదీల మధ్య కాలంలో సుమారు ఉదయం 2 గం.లకు 4 గురు ఇతర పిల్లలను పట్టుకొచ్చి నిర్బంధించి సెప్టెంబర్ 20-25 తేదీల మధ్య ఒక్కొక్కరినీ విడుదల చేశారు. ఒక్కరి మీద తప్ప మిగిలిన ఎవరి మీదా నేరమారోపించలేదు.

పోలీస్‌స్టేషన్‌లో ఉంచుకున్న కాలంలో కూడా పిల్లల ఆహార ఖర్చుల నిమిత్తం రోజుకొక్కంటికి రు.100ల చొప్పున వారి కుటుంబాల నుంచి జరిమానా వసూలు చేశారు. నిర్బంధ కాలంలో వారి తల్లిదండ్రులను, కుటుంబీకులను రోజుకు కేవలం 10-15 ని.ల పాటు పిల్లలను కలవనిచ్చేవారు. జైళ్లన్నీ పిల్లలతో కిక్కిరిసిపోయి నేలమీద కూడా పడుకోవడానికి చోటు లేని పరిస్థితి నెలకొన్నది.

మేం వెళ్లినపుడు కూడా మమ్మలను పిల్లలతో కలవనియ్యలేదు. పిల్లలు ఆపిల్ పండ్లు ఏరడానికి వెళ్లారని పోలీసులు చెప్పారు. అప్పుడు మేము వారి కుటుంబీకులను, గ్రామ పెద్దలను కలిసి పిల్లల వివరాలు సేకరించాము.

**ఎస్‌బి గ్రామం, షోపియన్ జిల్లా:** ఈ గ్రామంలో 9 సం.లున్న 4వ తరగతి విద్యార్థిని, 12 సంవత్సరాలున్న 3వ, 5వ తరగతుల విద్యార్థులను, 14 సంవత్సరాలున్న 7వ తరగతి విద్యార్థినిని మే 2019 లో పట్టుకొని నిర్బంధించి ఆ తర్వాత వదిలివేశారు.

సుమారు సాయంత్రం 3 గం.లకు ఇద్దరు పోలీసులు మామూలు పౌర దుస్తుల్లో స్కూటర్ పై వచ్చి ఒకరిని తీసుకెళ్లారు. అలాగే మిగిలిన వాళ్లిండ్లకు వెళ్లి స్టేషన్‌కు రమ్మని ఆదేశించారు. వారిని రాత్రి వరకు అక్కడే ఉంచుకొని వదిలివేసి, మళ్లీ మర్నాటి ఉదయమే స్టేషన్ కు రమ్మన్నారు. ఒకరిద్దరిని స్టేషన్లో ఉన్నంతసేపు కాళ్లకిందనుంచి చేతులు పోనిచ్చి చెవులు పట్టుకొని వంగబెట్టే / కూర్చుండబెట్టే శిక్షను అమలు చేసారు. ఒక బాలున్ని ఐదు రోజులు స్టేషన్‌లోనే ఉంచుకుని బాగా కొట్టారు. వదిలి వేసిన తర్వాత గ్రామం లోనే ఉండవద్దని, బంధువులింట్లో ఉండాలని ఆదేశించారు. ఒకరిద్దరి పిల్లల ఐపాడ్ లు, మసీద్ లౌడ్ స్పీకర్లను జప్తు చేసుకొని 'తరానా' (ప్రతి ఘటనా గానం) చేశారనే ఆరోపణపై వారిని అరెస్ట్ చేసారు.

**శ్రీనగర్:** ఆగస్టు 17వ తేదీన మ.3 గం.లకు 7వ తరగతి చదువుతున్న 12 సం.ల బాలున్ని, మరో బాలున్ని పట్టుకొని తీసుకువెళ్లి పోలీస్ స్టేషన్లో బంధించారు. అర్ధరాత్రివేళ వారిని వదిలివేశారు. ఆ తరువాత వారి తండ్రిని, తాతలను స్టేషన్లో రిపోర్ట్ చేయమని చెప్పి చాలారోజుల పాటు వారిని ఉదయం నుండి సాయంత్రం దాకా స్టేషన్‌లోనే ఉంచుకున్నారు.

**వేధింపు కేసులు**

**పరిగాం గ్రామం, పుల్వామా:** పరిగాం గ్రామం దగ్గర్లోనే ఆర్మీ క్యాంపు పెట్టారు. సుమారు 2 నెలల పాటు అక్కడి ఉన్నత పాఠశాలను మూసివేశారు. ఆగష్టు 5 కు ముందు సైన్యం గ్రామస్తులను ఏమనలేదు కానీ ఆగష్టు 5 తర్వాత అక్కడక్కడా యువకులను పట్టుకొని వెళ్లి చిత్రహింసలు పెట్టారు. యువతలో భయోత్పాతాన్ని సృష్టించారు. ఆగష్టు 6న రాత్రివేళ సైన్యం గ్రామంలో ప్రవేశించి 20-30 సం.ల వయసున్న 9-11 మంది యువకులను 8 ఇండ్లల్లో నుండి తీసుకువెళ్లి నిర్బంధించారు.

ఇదే పరిగాం గ్రామంలో మేం 23,25 సంవత్సరాలున్న షబీర్ అహ్మద్ సోఫీ, ముజఫర్ అహ్మద్ సోఫీ అనే ఇద్దరు సోదరులను, వారి తండ్రి సనావుల్లా సోఫీని కలిసాం. ఆ కుటుంబం ప్రధాన రహదారి పై ఒక బేకరీ దుకాణాన్ని నడుపుతోంది. ఆగష్టు 6న రాత్రి వేళ సైనికులు వెళ్లి అబ్దుల్ ఘనీ అనే చౌకీదార్ ఇంటి తలుపులను బాదారు. అతని సాయంతో దగ్గర్లో కిరాణా దుకాణాన్ని నడుపుతున్న ఖయూమ్ అహ్మద్ వనీ అనే వ్యక్తిని పట్టుకొని, మళ్లీ అతని సాయంతో బేకరీ యజమాని సనావుల్లా సోఫీ ఇంటికి వెళ్లి అతనిద్దరి కుమారులను షబీర్ అహ్మద్ సోఫీ, ముజఫర్ అహ్మద్ సోఫీలను పట్టుకెళ్లారు.

ఇలా 9-11 మంది యువకులను మసీదు బైట ఒక స్థలానికి తీసుకువెళ్లి అర్ధరాత్రి 12.30 నుంచి 3 గం.ల దాకా కర్రలతో, వైర్లతో బాగా కొట్టారు. సొమ్మసిల్లి పడిపోతే కరెంటు షాకిచ్చి లేపారు. తెల్లవారు జామున వారిని కాళ్లతో పాటు చేతులను కూడా నేలమీద ఆన్చించి జంతువుల్లాగా నడిపించి వాళ్లిళ్ల దగ్గర వదిలి వేశారు. పనికి వెళ్లడం కాదు గదా వాళ్లు 2 నెలల దాకా కదలలేని స్థితిలో పడి ఉండి చిత్రవధకు గురయ్యారు. వారి కుటుంబీకులు జోక్యం చేసుకొని అడ్డుకోబోతే పిల్లలను ఇంకా బాగా కొడతామని బెదిరించి వారిని వెళ్లగొట్టారు. మర్నాటి ఉదయం ఆ యువకులను బార్ జుల్లాలోని ప్రభుత్వాసుపత్రికి తీసుకువెళ్లి ఎముకల, కీళ్ల సర్జరీలు చేయించారు. యువకుల కుటుంబీకులు పుల్వామా పోలీస్ స్టేషన్‌లో ప్రాథమిక సమాచార నివేదిక దాఖలు చేయబోతే చుట్టూ ఇనుపముళ్ల తీగలతో కంచె వేసి పోలీస్ స్టేషన్‌నే మూసివేశారు.

సనావుల్లా బేకరీ దుకాణాన్నైతే రెండునెలల పాటు పోలీసులు మూసివేయించారు. ఈద్ కోసం తయారు చేసిన స్వీట్లు, ఇతర పదార్థాలను అమ్ముకోలేకపోవడం వలన అతడు 2 లక్షల రూపాయలు నష్టపోయాడు. అంతకు ముందు నెలలో అతని ఆదాయం 25000 - 30000 రూపాయల మధ్య ఉండేది. ఇప్పుడు అతని ఆదాయం దాదాపు ఏమీ లేని స్థితికి వచ్చింది.

**అరెస్టులు / ముందస్తు నిర్బంధం:** ఆగష్టు 5 తర్వాత అరెస్టులు, ముందస్తు నిర్బంధాలు ఎక్కువయ్యాయి. పాత ఎఫ్ఐఆర్‌లు దాఖలై ఉన్న వాళ్లను మళ్లీ పట్టుకొచ్చి పోలీస్ స్టేషన్లలో పెడుతున్నారు. కొందర్ని విడుదల చేసి, మరికొందరి మీద పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ కింద కేసులు పెట్టి ఆగ్రాలో గాని, శ్రీనగర్లో గాని కేంద్ర కారాగారంలో ఉంచారు. పత్రికలకు సమాచారం ఇవ్వడం గాని, ప్రతిఘటించడం గాని ఏమీ చేయవద్దని, ఒకవేళ చేస్తే ప్రజా భద్రతా చట్టం (పిఎస్ఎ) కింద కేసులు బనాయిస్తామని బెదిరించారు.

**పరిగాం గ్రామం, పుల్వామా:** ఆగస్ట్ 5 తర్వాత (కచ్చితంగా ఏ తేదీనో తెలియదు) ఐదుగురు పురుషులను అరెస్ట్ చేసి పుల్వామా పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్లారు. తమ బంధువుల్ని తీసుకువెళ్లి నిరసన తెలిపినందుకు సైనికులు మరో ఇద్దరు బాలికల్ని బాగా కొట్టారు. అందులో ఒకరు నర్సింగ్ విద్యార్థిని. (వాళ్ల కుటుంబీకులతో మేము మాట్లాడలేక పోయాం).

**కరీమాబాద్, షోపియన్ జిల్లా:** ఇక్కడ స్మశానంలో 11 మంది అమర వీరుల సమాధులుండి ఈ గ్రామం మిలిటెంట్ గ్రామంగా పేరుగాంచింది. సైన్యం ఇక్కడి స్మశానంలోని సమాధుల్ని 2 సార్లు కూల్చివేసి ధ్వంసం చేసారు. కానీ ప్రజలు మళ్లీ వాటిని నిర్మించుకొని, వాటిపై కాగితపు పూలు పెట్టారు. ముందస్తు నిర్బంధ చర్యల్లో భాగంగా వ్యక్తిగతంగా ఎటువంటి మిలిటన్సీతో సంబంధమేమీ లేకున్నా ఈ గ్రామం లోని యువకులను పట్టుకొని ఆగ్రా సెంట్రల్ జైలుకు పంపించారు.

**అరెస్ట్ అయిన వాళ్లల్లో కొందరు**

**1) మామూన్ అహ్మద్ పండిట్:** ఇతడు డిగ్రీ రెండవ సంవత్సరం చదువుతున్న 17 సంవత్సరాల పుల్వామా విద్యార్థి. ఇతన్ని ఆగష్టు 7వ తేదీన ప్రజా భద్రతా చట్టం కింద అరెస్ట్ చేసి ఆగ్రా కేంద్ర కారాగారంలో బంధించారు. ఇతని ఏకైక నేరమేమిటంటే - ఇతడు 2016 లో హతమైన ప్రఖ్యాత మిలిటెంట్ నసీర్ అహ్మద్ పండిట్ కు కనిష్ట సోదరుడు కావడమే. మేము ఇతని తల్లిని కలిస్తే - సైనికులు ఆగస్ట్ 7న తెల్లవారుజామున 2

గం.లకు ఇంటికొచ్చి మామూన్ ను తీసుకెళ్లారని, ఆగష్టు 15 వరకు ముందస్తు నిర్బంధంలో ఉంచుకుంటామని చెప్పారని తెలిపింది. ఆగష్టు 16న కూడా ఇతన్ని విడిచిపెట్టకపోయేసరికి పుల్వామా పోలీస్ స్టేషన్ కు వెళ్లి అడిగితే ఇతన్ని అరెస్ట్ చేశామని పోలీసులు చెప్పినట్టు తెలిపింది.

**2) మునిరుల్ ఇస్లాం:** 20 సం.లున్న ఇతడు బషీర్ అహ్మద్ పండిట్ కుమారుడు. ఇతన్ని సుహేల్ అనే మరో పేరుతోకూడా పిలుస్తారు. మేము ఇతని సోదరిని కలిస్తే ఆమె ఇలా చెప్పింది. సైనికులు తెల్లవారుజామున గం.2:45 ని.లకు గేట్ దూకి ఇంట్లోకి దూసుకవచ్చి మెడ, వెంట్రుకలు పట్టుకొని మునిరుల్ ను ఈడ్చుకుంటూ తీసుకెళ్లారు. తల్లిని , సోదరిని ఇంట్లోకి నెట్టివేశారు. సిమెంట్ నేలపై రెండు సార్లు కాల్పులు జరిపి బెదిరించి, మళ్లీ ఆ గుండ్లను తీసుకెళ్లారు. నేలపై రంధ్రాలు మాకింకా కనబడుతూనే ఉన్నాయి. ఇతన్ని గత జూలైలో కూడా తీసుకెళ్లి వెంట్రుకలు కత్తిరించి బాగా కొట్టారు. మళ్లీ ఇతణ్ణిప్పుడు తీసుకువెళ్లి ఆగష్టు 15 తర్వాత విడిచి పెడతామని అన్నారు. కానీ ఆగస్ట్ 14ననే ఇతన్ని ఆసుపత్రికి తీసుకెళ్లారని తెలిసి పుల్వామా పోలీస్ స్టేషన్ కు వెళ్లి అడుగగా ఇతన్ని వెంటనే శ్రీనగర్లోని జైలుకు, ఆ తర్వాత ఆగ్రా సెంట్రల్ జైలుకు తరలించారు.

**3) బిలాల్ అహ్మద్ దార్ (ఇద్దరు పిల్లల తండ్రి):** ఇతని కుటుంబీకులెవరూ కలవనందువల్ల మాకు ఎటువంటి వివరాలు తెలియలేదు.

పై ముగ్గురిపై రాళ్లు విసరడం, కార్లు ధ్వంసం చేయడం, మిలిటెంట్లకు సాయం చేయడం అనే నేరాలను మోపారని తెలిపారు. వారి కుటుంబీకులెవరూ ఆగ్రాకు వెళ్లడం గాని, లాయర్లను పెట్టుకోవడం గాని జరగలేదు. నేరాలకు సంబంధించిన పత్రాలేమీ మేము చూడలేదు.

ప్రాంగ్రూ గ్రామం, హంద్ వారా: ఈ గ్రామంలో ముగ్గురు పురుషులు అరెస్టై ఇంకా జైల్లోనే ఉన్నారు. 1) మహమ్మద్ షఫీమీర్, 2) అస్గర్ మఖ్బూల్ భట్, 3) నదీమ్ మహమ్మద్ షేక్.

వీళ్ల కుటుంబ సభ్యులను కలిస్తే వాళ్లిలా చెప్పారు. సెప్టెంబర్ 3న పోలీసులు వీళ్లిళ్లకు వెళ్లి 2018 లోనే ఎఫ్ఐఆర్ నమోదైందని, దానికి సంబంధించి వారిని ఖల్మాబాద్ పోలీస్ స్టేషన్ కు రమ్మన్నారు. మహమ్మద్ షఫీమీర్ తన తండ్రితో కలిసి స్టేషన్ కెళ్తే రాళ్లు రువ్వడం, మనన్ వనీ అంతిమ యాత్రలో పాల్గొనడం లాంటి కేసులున్నందున షఫీమీర్ ను రిమాండ్లో ఉంచుతున్నామన్నారు.

పై ముగ్గురే కాక జహూర్ అహ్మద్ అనే 25 సంవత్సరాల యువకుని కోసం వెతికి, అతడు ఇంట్లో లేనందున అతడి కనిష్ఠ సోదరుడు డేనిష్ (17 సంవత్సరాలు) ను పట్టుకొని 3 రోజులు పోలీస్ స్టేషన్లో ఉంచి, అన్న జహూర్ వచ్చిన తర్వాత విడిచిపెట్టారు. నినాదాలిచ్చాడనే నేరంపై జహూర్ అహ్మద్‌ను 18 రోజులపాటు స్టేషన్లో ఉంచుకొని విడిచిపెట్టారు.

18 సంవత్సరాలున్న 12వ తరగతి చదువుచున్న ఒక ప్రభుత్వ ఉన్నత పాఠశాల విద్యార్థిని అక్టోబర్ 2న అరెస్ట్ చేసి అక్టోబర్ 8న వదిలివేశారు. మేము అతని కుటుంబ సభ్యులను కలిస్తే వాళ్లిలా చెప్పారు.

17 కార్లలో పోలీసులు ఈ ప్రాంతానికి వచ్చి గేట్లు దూకి తలుపులు దబాలున తెరిచారు. పెప్పర్ గ్యాస్, భాష్పవాయువులను వదులుతూ అక్కడున్న స్త్రీలందరినీ రైఫిల్ కర్ర మొద్దులతో కొట్టారు. అతని తండ్రి ఛాతీని గట్టిగా పట్టి గోడకు తోసేసి, చేతిని విరిచేసారు. ఐడిని తేవడానికి మెట్లెక్కి పోతున్న 12వ తరగతి విద్యార్థిని లాక్కెళ్లి కార్లో తీసుకెళ్లారు.

**కమ్యూనిటీ బాండ్ పద్ధతి:** ఎక్కడైనా ఒక వ్యక్తిని అరెస్ట్ చేస్తే అక్కడి కమ్యూనిటీ పెద్దమనుషులు పూచీకత్తు ఇవ్వాలి. ఈ అరెస్ట్ అయిన విద్యార్థి విషయంలో అక్కడి 20 మంది పెద్దమనుషులను రోజూ స్టేషన్‌కు పిలిపించి వాళ్ల ఐడిలను తీసుకుని, కొన్ని గంటల పాటు లేదా రోజంతా ఉంచుకొని, చివరికి పొమ్మని ఆ విద్యార్థిని విడిచిపెట్టారు.

**సౌరా:** సౌరా లోని దుకాణదారుడు ఇనాయత్ అహ్మద్‌ను అల్ జజీరా ఛానల్ తో మాట్లాడినందుకు, నిరసన ప్రదర్శనలో పాల్గొన్నందుకు ఆగష్టు 29న అరెస్ట్ చేశారు. 15,16 రోజులు స్టేషన్లో ఉంచుకొని ప్రజా భద్రతా చట్టం కింద కేసు పెట్టి శ్రీనగర్ కేంద్ర కారాగారంలో బంధించారు. ఛార్జ్ షీట్ ప్రకారం ఆగష్టు 7న రాళ్లు రువ్విన సంఘటనలో మొదటి ఎఫ్ఐఆర్ దాఖలు కాగా, ఊరేగింపులో పాల్గొని పాకిస్థాన్ అనుకూల నినాదాలిచ్చినందుకు ఆగష్టు 30న రెండవ ఎఫ్ఐఆర్ దాఖలు చేసారు.

### కస్టడీ మరణం

**సెప్టెంబర్ 3, 2019:** రియాజ్ అహ్మద్ థిక్రి (సుమారు 20 సం.లు) మరణం, నంద పౌర భాండీవార్డ్, భాండీ గ్రామం. భాండీ గుజ్జార్లు నివసించే గ్రామం. చాలామంది గుజ్జార్లపై పలు అటవీ కేసులు నమోదై ఉన్నాయి. గ్రామస్థుల కథనం ప్రకారం అటవీ అధికారులు రు.10 వేల నుండి రు.20 వేల వరకు లంచాలు తీసుకుంటారు. కోర్టుకు హాజరయ్యే ప్రతిసారి లాయర్లకు ఒక్కొక్కరికీ రు. 500లు ఇవ్వాలి. ఒకసారి కేసు కు హాజరైతే ప్రయాణ ఖర్చులతో సహా మొత్తం రు. 1000లు ఖర్చవుతాయి. ఒకరైతే తాను 2005 నుండి అటవీ కేసుల విషయమై కోర్టుకు హాజరవుతూనే ఉన్నానని చెప్పాడు. 2010 నుండి అటవీ శాఖాధికారులు గుజ్జార్లుండే రూట్లను ఇనుప ముళ్ల తీగలతో మూసివేశారు.

లద్దాఖ్‌లో కూలి పనికి వెళ్లి తిరిగివచ్చిన రియాజ్ అహ్మద్ పై మోపిన కలప అక్రమ రవాణా కేసులో ఒక ఎఫ్ఐఆర్ ధాఖలైందని, సెప్టెంబర్ 2న పోలీస్‌లు వచ్చి అతన్ని స్టేషన్‌కు రమ్మన్నారు. మర్నాడే సెప్టెంబర్ 3న పోలీస్‌లు అతని మామ జమాల్ దీన్ శాభంగీ ఇంటికి వచ్చి స్టేషన్‌కు తీసుకువెళ్లారు. అక్కడికి వెళ్లగానే అతని మేనల్లుడు రియాజ్ అహ్మద్ తన లోదుస్తువైన డ్రాయర్ తాడుతో ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పారు.

అయితే జమాల్ దీన్ తదితరులు రియాజ్ ముక్కు పగిలి ఉండడం, భుజం నుండి తుంటి వరకు కుడి పక్క శరీరమంతా బాగా చితక కొట్టబడి కమిలిపోయి ఉంది. హంద్ వారా ఆసుపత్రిలో పోస్ట్‌మార్టం నిర్వహించారు. కానీ ఎటువంటి కాపీని వారికి ఇవ్వలేదు. రియాజ్ తల్లి గుడ్డిది. అతని మరో ఇద్దరు కనిష్ఠ సోదరులు కూలి పని చేసుకొని పొట్ట పోసుకునేవారే. రియాజే ఆ కుటుంబంలో ప్రధాన సంపాదనాపరుడు.

పోలీస్ కస్టడీలో రియాజ్ మరణించిన తర్వాత హెరాల్ నుండి ఖల్మాబాద్‌లోని వార్‌పురా వరకు ఊరేగింపు తీస్తే పోలీస్‌లు బాష్పవాయువు ప్రయోగించి చెదరగొట్టారు. పైగా శవాన్ని స్వాధీనం చేసుకొని తన ఇంటికి సమీపంలోనే బలవంతంగా ఆ శవాన్ని పూడ్చి పెట్టేశారు. నిరసన తెలిపితే మేనమామ జమాల్ దీన్ ముఖాన్ని చితక్కొట్టేశారు.

### ముగింపు

ఒకవేళ ముందేగనుక సుప్రీం కోర్టు జోక్యం చేసుకొని (ఇప్పటికైనా ఆ పని చేయవచ్చు) ఆర్టికల్ 370ని పునరుద్ధరించి, జమ్మూ కశ్మీర్‌ను పూర్వపు రాష్ట్రంగా తిరిగి మార్చినట్లైతే, ప్రజాగ్రహం కొంతైనా తగ్గి ఉండేది. ఏదేమైనా కశ్మీర్‌లో, బైటా అందరికి ఉన్నట్టుగానే మాకు కూడా కశ్మీర్ భవిష్యత్తు ఎలా ఉండబోతోందన్న విషయంలో చాలా సందిగ్ధం ఉన్నది.

*(తెలుగు అనువాదం: మెట్టు రవీందర్)*

*(రచయితలు న్యాయవాది, సామాజిక శాస్త్రవేత్త)* వీ

# సత్యాన్ని చెప్పని అతిథుల ప్రహసన పర్యటన!

***కశ్మీర్ ప్రజలను, స్థానిక రాజకీయ నాయకులను సైనిక నిర్బంధంలో ఉంచి, ప్రభుత్వ విధానాలను సమర్థించే విదేశీ బృందాన్ని అక్కడికి పంపి సత్యాన్ని సమాధి చేయడానికి పాలకులు చూస్తున్నారని అంటున్నారు* సతీష్ బైరెడ్డి**

**మా** ఇంట్లో అంతా బాగుంది చూడండి. ఇంట్లో వాళ్లు ఆ మాటను ఒప్పుకోవడం లేదు. మీరైనా ప్రపంచానికి చెప్పండి అని ఇంటి వాళ్లను బంధించి బయటి వాళ్లను పేరంటానికి పిలుచుకొని మరీ కితాబును ఇప్పించుకున్నది మోడీ సర్కార్ కశ్మీర్ విషయంలో. కేంద్రం గత ఆగస్టు 5న 7 దశాబ్దాలుగా కశ్మీర్ భూభాగం అనుభవిస్తున్న ప్రత్యేక ప్రతిపత్తిని రద్దు పరిచింది. ఆనాటి చారిత్రక అవసరాల రీత్యా కల్పించబడిన 370 ఆర్టికల్‌ను తొలగించి జమ్మూ కశ్మీర్ రాష్ట్ర ప్రతిపత్తిని కూడా తీసివేసి రెండు కేంద్ర పాలిత ప్రాంతాలుగా విభజించింది. ఈ చర్యకు ముందుగానే అప్పటికే లక్షలాదిగా మోహరించబడిన సైన్యానికి తోడు సిఆర్‌పిఎఫ్ బలగాలను కూడా పెద్ద ఎత్తున కశ్మీర్ లోయకు తరలించి ప్రపంచంలోనే అత్యంత సైనికీకరణ జరిగిన భూభాగంలో ఒకటిగా మార్చివేసింది.

బిజెపి తన జాతీయవాద అజెండాలో భాగంగా దశాబ్దాలుగా 370 ఆర్టికల్ రద్దు అంశాన్ని పదేపదే లేవనెత్తుతూనే ఉంది. లోక్ సభలో బిజెపి ప్రభుత్వం తనకున్న సంఖ్యా బలంతో దేశంలో ఏదైనా చేయగలమన్న ధీమాతో ఉన్నది. కశ్మీర్ల స్వతంత్ర కాంక్ష ఏమోగానీ వారికున్న రాజ్యాంగ ప్రతిపత్తిని సైతం రద్దు చేసి భారత్‌లో సంపూర్ణంగా విలీనం చేసి 'పటేల్' ప్రాజెక్టును పూర్తి చేశామని దేశవ్యాప్త రాజకీయ ప్రయోజనం పొందే పనిలో నిమగ్నమైంది.

భారతదేశమంతా కశ్మీర్ మాది అని అనిపించగలమేమో గాని కశ్మీర్ అంతా మేం భారతదేశంలో అంతర్భాగమని అనిపించగలరా? రద్దు నేపథ్యంలో కశ్మీర్ లోయంతా జైలుగా మార్చబడింది. రహదారులన్నీ నిర్మానుష్యమై, పౌరుల కదలికలు నిషేధించబడి కేవలం సైనిక కవాతులకే పరిమితం అయింది. సమాచార వ్యవస్థలు అన్నింటిని స్తంభింపజేశారు. విద్యాలయాలు, వ్యాపార సంస్థలు ఒకటేమిటి సమస్తం స్తంభించి పోయింది. బయటి ప్రపంచంతో సంబంధాలు తెగిపోయినవి. దేశంలో అనేక ప్రాంతాల్లో కశ్మీర్లపైన ప్రధానంగా కశ్మీర్ విద్యార్థులపైన దాడులు జరిగినవి. అత్యవసర వ్యవస్థలు కూడా అందుబాటులో లేకుండా నానా అగచాట్లు పడాల్సి వచ్చింది. కశ్మీర్ సగటు జీవి విలవిలలాడి పోయాడు. అసంఘటిత రంగంలో పనిచేసే అసంఖ్యాక కశ్మీర్ లోకం కష్టాల కడలికి నెట్టబడ్డది. వేలాది మందిని అరెస్టు చేసి జైళ్లకు తరలించారు. కశ్మీర్‌లో ఉన్న వివిధ రాజకీయ పార్టీల నేతలందరినీ గృహ నిర్బంధంలో ఉంచారు. అక్కడంతా నిర్బంధ, నిర్మానుష్య చీకటి అలుముకుంది.

కశ్మీర్‌లో ఏం జరుగుతుందో బయటి ప్రపంచానికి తెలియదు. బయట ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో కశ్మీర్లకు తెలియదు. పోలీసు, సైనిక అధికారులు ఏ సమాచారం అందిస్తే అది మాత్రమే బయటకు వచ్చింది. దేశీయ, విదేశీ మీడియా సంస్థలను కశ్మీర్‌లోకి ప్రవేశించకుండా నిషేధం విధించారు. ఇంటర్నెట్, సామాజిక మాధ్యమాల మీద సంపూర్ణ నిషేధం విధించారు. బయటి రాష్ట్రాల్లో ఉన్న కశ్మీరీలకు స్వరాష్ట్రంలోకి వెళ్లే వీలు లేకపోగా రాష్ట్రంలోనే ఉన్న కశ్మీర్లు ఇల్లు దాటి బయటకు రాలేని అసంఖ్యాక ముళ్ల కంచెలతో బంధించబడ్డారు. నెలల తరబడి బడులను బందుపెట్టారు. వైద్య సదుపాయాలు లేమితో అత్యవసర చికిత్స అందించే పరిస్థితి లేక అనేకమంది అర్థాంతరంగా తనువు చాలించారు. కుటుంబ సభ్యులను కూడా కలవనివ్వని నిర్బంధం. సుప్రీంకోర్టు తలుపు తడితే గాని తల్లిని పిల్లలు, పిల్లలు తల్లిని చూడనివ్వని దైన్యస్థితికి నెట్టి వేయబడ్డారు.

370 ఆర్టికల్ కల్పించిన స్వతంత్ర ప్రతిపత్తి వల్లనే కశ్మీర్ అభివృద్ధికి నోచుకోలేదని, కల్లోలానికి గురైనదని కేంద్ర పెద్దలు పదే పదే ప్రచారం చేస్తున్నారు. కశ్మీర్ ప్రత్యేక స్థితిని రద్దుపరచడమే కాదు పాక్ ఆక్రమిత కశ్మీర్‌ను కూడా కలుపుకోవడమే మిగిలి ఉందని 'శత్రు'దేశం పాకిస్తాన్ 'టెర్రరిస్టు' ఆటలు ఇక సాగవు అని దేశమంత 'దేశభక్తి'ని పారించారు. కశ్మీర్ గురించి స్వతంత్రంగా అభిప్రాయాలను వెల్లడించినా ప్రభుత్వ నిర్ణయంతో విభేదించినా దేశద్రోహమయ్యే పరిస్థితిని కల్పించారు. మరోవైపు అంతర్జాతీయంగా అనేక దేశాలు కశ్మీర్‌లో నెలకొని ఉన్న గంభీర పరిస్థితులపైన ఆందోళన వ్యక్తం చేయడం, అంతకుముందే ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల కమిటీ కశ్మీర్‌లో హక్కుల హననం జరుగుతున్నదని కూడా ప్రకటించి ఉన్నది. పాకిస్తాన్ అంతర్జాతీయ వేదికల మీద భారత్ చర్యను ఎండగట్టే ప్రయత్నాలను తీవ్రంగా చేసింది.

కశ్మీర్ ప్రజల అభిప్రాయాలు, ఆయా రాజకీయ, పౌర వ్యవస్థల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోకుండానే కేంద్రం తీసుకున్న ఈ నిర్ణయం లోయను కుదిపేసింది. సహజంగానే వారి ఉనికిని అస్థిర పరిచే ప్రతి చిన్న సంఘటనకు ప్రతిఘటించే అలవాటున్న కశ్మీర్లకు కనీసం బయటకు వచ్చే అవకాశమే లేకుండా ప్రతి ఇల్లు ఒక జైలులా మార్చివేసి, రహదారులు అన్నిటినీ దిగ్బంధనం చేసి సైన్యమే రాజ్యమేలడంతో అక్కడి స్థితిగతులు ఏమిటో బయటి ప్రపంచానికి తెలిసే అవకాశమే లేకుండాపోయింది. కశ్మీర్ల రాజకీయ నాయకత్వాన్ని అష్ట దిగ్బంధనం చేసి కాలు బయట పెట్టకుండా కట్టి పడేశారు. పోనీ దేశంలో ఉన్న ఇతర రాజకీయ పక్షాలు, ప్రజాసంఘాలు చివరికి పత్రికలకు కూడా కొద్దిపాటి అవకాశాన్ని ఇవ్వలేదు. అక్కడ ఏమి జరుగుతుందో చెప్పే వాళ్లు లేరు. సైన్యం ఇచ్చే సమాచారం చూసుకొని అంతా బాగుందని అనుకునే విశ్వసనీయతను సైన్యం కలిగిలేదు.

కశ్మీర్‌కు వెళ్లాలనుకున్న రాజకీయ నాయకులను, వివిధ రంగాల్లో పనిచేసే వారిని విమానాశ్రయంలోనే అడ్డుకున్నారు. కశ్మీర్‌ను భారత్‌లో సంపూర్ణంగా అంతర్భాగం చేశాం అంటూనే ఆ భూభాగంలోకి అడుగు

పెట్టడం నిషేధించబడింది. ఈ కాలంలోనే ఇంటా బయట ఒత్తిడి పెరగడంతో కశ్మీర్‌లో అంతా బాగుందనే దృశ్యాన్ని బయటి ప్రపంచానికి చూపించాలనుకున్నది ప్రభుత్వం. సరిగ్గా ఈ ప్రయత్నంలో భాగంగానే యూరోపియన్ పార్లమెంట్ సభ్యులైన వివిధ దేశాలకు చెందిన వారిని అతిథి మర్యాదలతో తీసుకువచ్చి అంతా బాగుందని వారితోనే చెప్పించే ఒక నగుబాటు ప్రయత్నాన్ని ప్రభుత్వం చేసింది. కశ్మీర్ వివాదం అంతర్జాతీయ అంశం కాదంటూనే అదే ప్రయత్నంలో ఉన్న పాకిస్థాన్‌ను తీవ్రంగా వ్యతిరేకిస్తూనే తనే ఆ పని చేసింది.

యూరోపియన్ యూనియన్‌లో భాగస్వామ్య దేశాలైన బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీ, పోలాండ్, చెక్ రిపబ్లిక్ దేశాల నుండి 27 మంది సభ్యులను 'ఎంపిక' చేసుకొని కశ్మీర్‌కి ఆహ్వానించింది. ఈ 27 మందిలో నలుగురు సభ్యులు చివరి క్షణంలో భాగం కాలేదు. ఈ పర్యటన బృందంలోని వారంతా ఆయా దేశాల్లో ఇక్కడ భారత్‌లో బిజెపి ప్రవచిస్తున్న రాజకీయ కోవకు చెందిన పార్టీలకు ప్రాతినిధ్యం వహిస్తున్న వారే! వారిలో మెజారిటీ సభ్యులు ముస్లిం వ్యతిరేక, వలస వ్యతిరేక భావజాలంతో నిండి ఉన్నవాళ్లే! ఇద్దరూ ఆల్టర్నేటివ్ ఫర్ జర్మనీ (ఎఎఫ్‌డి), ఆరుగురు ఫ్రాన్స్‌లోని లీ పెన్‌కు చెందిన భారత్‌లో బిజెపి లాంటి నేషనల్ ర్యాలీ పార్టీ, ఆరుగురు పోలండ్ లా అండ్ జస్టిస్ పార్టీకి చెందిన, నలుగురు బ్రిటన్ బ్రెగ్జిట్‌కి చెందిన వారున్నారు. క్రిస్ డేవిడ్ అని లిబరల్ డెమొక్రటిక్ పార్టీకి చెందిన బ్రిటన్ సభ్యుడు తనను స్వేచ్ఛాయుతంగా తిరగనివ్వాలని, అన్ని ప్రాంతాల ప్రజలను కలసి మాట్లాడే అవకాశం ఇవ్వాలని కోరడంతో ఆ పర్యటనకు కొద్దిరోజుల ముందే ఆయనకు అనుమతి రద్దయింది.

ఈ బృందానికి శ్రీనగర్‌లోని ఒక లగ్జరీ హోటల్లో బస ఏర్పాటు చేశారు. దాల్ సరస్సులో బోటు విహారాన్ని కల్పించారు. ఈ బృందం పర్యటన అంతా పోలీస్, ఆర్మీ కనుసన్నల్లోనే జరిగింది. వారు ఎంపిక చేసిన ప్రాంతాలను మాత్రమే సందర్శించేలా, ఎంపిక చేసిన వారితో మాత్రమే మాట్లాడేలా కట్టుదిట్టంగా ఏర్పాట్లు చేశారు. రహదారుల మీద జనసంచారం కనిపించడం కోసం విద్యార్థుల పరీక్షల సమయాన్ని కూడా మార్చివేసింది. వారి వెంట ఉన్నది, వెంట నడిచింది మొత్తంగా మార్గదర్శనం చేసింది అంతా ఆర్మీనే. కొసమెరుపు ఏమిటంటే ఈ ఎంపిల బృందం బస చేసిన హోటల్ సమీపాన్నే కశ్మీర్ మాజీ ముఖ్యమంత్రి ఒమర్ అబ్దుల్లాను గృహ నిర్బంధంలో ఉంచారు. చివరికి వీరితో ఒక ప్రెస్ మీట్‌ను కూడా ఆర్మీ ఎంపిక చేసిన 'విలేకరుల'తో ఏర్పాటు చేశారు. ప్రభుత్వం ఆశించినట్టు అంతా బాగుందని, 370 ఆర్టికల్ రద్దు చర్య భారతదేశ అంతర్గత సమస్య అని, ఏ దేశం టెర్రరిజాన్ని ప్రోత్సహించ కూడదు అని ప్రభుత్వ లక్ష్యానికి అనుగుణంగా మాట్లాడి వెళ్లిపోయారు. యాదృచ్ఛికంగా కశ్మీర్‌లో అదే రోజున 'ఉగ్రవాదులు' అయిదుగురు పౌరులను కాల్చివేశారు.

నిజానికి 370 ఆర్టికల్ రద్దు నుండి కశ్మీర్‌లో నెలకొని ఉన్న పరిస్థితుల అధ్యయనానికి దేశీయంగా ఉన్న పలు రాజకీయ పార్టీల నేతలు, స్వతంత్ర జర్నలిస్టులు, న్యాయ విభాగానికి చెందిన వారితో సహా అనేక దేశాల రాయబారులు చివరికి ఐక్యరాజ్యసమితి కూడా ప్రయత్నించినప్పటికీ నిర్ద్వందంగా తిరస్కరించి ఈ యూరోపియన్ బృందాన్ని మాత్రం అనుమతించి, ఆహ్వానించి అతిధి మర్యాదలు చేసి వారితోనే భుజాలు తడిమించుకొని ద్వంద ప్రమాణాల జాతీయ వాదాన్ని ప్రదర్శించింది.

ఇంతా చేస్తే ఇది అధికారిక పర్యటన కాదని ఇటు భారత ప్రభుత్వం, యూరోపియన్ యూనియన్ అధికారికంగా ప్రకటించినవి. మరెలా సాధ్యం అయింది? ఆ బృందం ప్రధానమంత్రిని, జాతీయ భద్రతా సలహాదారుడు అజిత్ దోవల్‌ను కూడా కలసి వెళ్లింది.

తనను తాను అంతర్జాతీయ వ్యాపార బ్రోకర్‌గా చెప్పుకునే మాది శర్మ అనే విమెన్ ఎకనామిక్ అండ్ సోషల్ థింక్ ట్యాంక్‌కు చెందిన ఆవిడ ఈ మొత్తం పర్యటనను జాతీయ భద్రతా సలహాదారుడు అజిత్ దోవల్ కనుసన్నల్లో ఏర్పాటు చేసింది. ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ నాన్ అలైన్డ్ స్టడీస్ అనే సంస్థ ఈ పర్యటనకు అయిన ఖర్చంతా భరించింది. అంతర్జాతీయం గా పెద్దగా పరిచయంలేని ఈ సంస్థ కశ్మీర్ లాంటి కీలక సమస్య సందర్శనకు, అదీ ప్రధానమంత్రి కార్యాలయం, జాతీయ భద్రతా సలహాదారులను ఎలా ఒప్పించగలిగింది? నిజానికి ఈ 'థింక్ ట్యాంక్' సంస్థ శ్రీవాత్సవ గ్రూప్ అనే వ్యాపార సంస్థ ఆధ్వర్యంలో నిర్వహించబడు  తున్నదని నిర్ధారణ అయినది. అంటే వ్యాపార సంస్థ ఏర్పాటు చేసిన పర్యటన వల్ల అధికారికం కాకుండానే బహు ప్రయోజనాలు ప్రత్యేకించి వ్యాపార ప్రయోజనాలు ఉన్నాయని అర్థం అవుతున్నది. కశ్మీర్‌లో అంతా బాగుందని ప్రపంచానికి చెప్పించే ప్రయోజనం, భారత ప్రధానిని కలిసేలా ఏర్పాటు చేసిన 'బ్రోకర్' వ్యాపార ప్రయోజనాలు ఉన్నాయన్నమాట!

ఈ పర్యటన ద్వారా కశ్మీర్ ప్రజలకు గాని, అంతర్జాతీయంగా ఆందోళన పడుతున్న సమాజానికి గాని సత్యాన్ని ఇవ్వకుండా మరెవరో ప్రయోజనాల కోసం పని చేసిందన్న మాట. అంతర్జాతీయంగా పాకిస్తాన్ ప్రచారాన్ని తిప్పికొట్టే పని అధికారికం కానీ ఈ పర్యటన ద్వారా జరిగిందని ప్రభుత్వం అనుకుంటున్నది. కశ్మీర్ ప్రజలకు ప్రాతినిధ్యం వహించే అక్కడి స్థానిక పార్లమెంటు సభ్యులనేమో నిర్బంధించి కాశ్మీరు పైన కనీస అవగాహన లేని అదీ అనధికారికంగా యూరోపియన్ యూనియన్ సభ్యుల బృందాన్ని అనుమతించడం అంటేనే ప్రభుత్వం అసలు దృశ్యాన్ని దాస్తున్నదని అర్థం అవుతున్నది.

దేశంలో ఏ రాజకీయ నాయకునికి కశ్మీర్ వెళ్లే స్వేచ్ఛ లేకుండా చేసి విదేశీ ప్రతినిధులను అనధికారికంగా ఆహ్వానించడం ఏమిటి? నాటి ప్రధాని నెహ్రూ కశ్మీర్ అంశాన్ని అనవసరంగా ఐక్యరాజ్యసమితికి తీసుకువెళ్లి అంతర్జాతీయం చేశాడని తీవ్రంగా విమర్శించే బిజెపి ఇవాళ చేసిందేమిటి? ఓవైపు పార్లమెంటు సమావేశాలు నిర్వహిస్తూనే కశ్మీర్ ప్రాంత పార్లమెంట్ సభ్యులకు ఆ సమావేశాల్లో పాల్గొనే స్వేచ్ఛ లేకుండా చేయడమంటే అక్కడి ప్రజల ప్రాతినిధ్య హక్కుల్ని ఉల్లంఘించినట్టే కదా. ఇంకా ఇంటర్నెట్ సామాజిక మాధ్యమాలు, ప్రధాన స్రవంతి మీడియాపైన తీవ్ర ఆంక్షలు కొనసాగుతున్నవి. రహదారులపైన ప్రజల కదలికల కంటే సాయుధ బలగాలే ఎక్కువగా సంచరిస్తున్నాయి. బిజెపి ప్రభుత్వ చర్యను సమర్థించే వారే సంచరించే స్వేచ్ఛను పొందుతున్నారు. ఆ చర్యను విమర్శించే, విశ్లేషించే వారెవరికి కనీసంగా మాట్లాడే, కదలాడే హక్కుల్ని కూడా నిరాకరిస్తున్నారు. ప్రభుత్వం తాను చేపట్టిన చర్య సరైనదే అని కశ్మీర్ మినహాయించి మిగతా భూభాగమంతా చెప్పించినా అది వృథానే! అదే మాటను కశ్మీరీలతో అనిపించేలా వారి హృదయాలను గెలుచుకో గలదా? అయినా కశ్మీర్ మాది అని మిగతా భారతదేశం అంతా అనడం కంటే మొదలు భారతదేశంలో మేము అంతర్భాగం అని కశ్మీరీలు వారి గుండెల్లోంచి అనడమే అతి ప్రధానం.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# కార్పొరేట్లకు రెడ్ కార్పెట్ - బ్యాంకుల విలీనం

*జాతీయ బ్యాంకులను విలీనం చేస్తూ కార్పొరేట్ బ్యాంకులకు మరింత అవకాశం ఇస్తూ మొత్తంగా ప్రభుత్వ బ్యాంకింగ్ వ్యవస్థను నీరుగార్చడానికే ప్రభుత్వాలు విధానాల రూపకల్పన చేస్తున్నాయని అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

సంపూర్ణ మెజారిటితో వరసగా రెండోసారి అధికార పగ్గాలు దక్కించుకున్న బిజెపి సర్కారు ఐదు ట్రిలియన్ల ఆర్థిక వ్యవస్థ లక్ష్యంగా పనిచేస్తామని సంస్కరణల మోత మోగిస్తోంది. 1929-30లో వచ్చిన ప్రపంచ ఆర్థిక మాంద్యం భారతదేశాన్ని తీవ్ర ప్రభావానికి గురిచేయలేదు. నేడు భారత ఆర్థిక వ్యవస్థ కనీవినీ ఎరగని రీతిలో మాంద్యం వైపుగా ప్రయాణిస్తుంది. ఏప్రిల్ - జూన్ త్రైమాసికంలో స్థూల జాతీయోత్పత్తి (జిడిపి) స్వల్పంగా 5 శాతం మాత్రమే నమోదు అయింది. గడిచిన ఐదు సంవత్సరాలలో ఇది కనిష్టం కాగా జిడిపి వృద్ధిరేటు వరసగా ఐదు త్రైమాసికాలుగా తగ్గుతూనే ఉంది. డిసెంబర్ 1999 అనంతరం వరుసగా ఐదు త్రైమాసికాల్లో మళ్లీ వృద్ధిరేటు క్షీణించడం పాలకులతో పాటు ఆర్థిక విశ్లేషకులందరిని కలవరపెడుతుంది. ప్రభుత్వం ఈ క్రమంలో ఆర్థిక వ్యవస్థను వృద్ధి దిశగా ప్రగతి రథంపై పరుగులు తీయిస్తామంటూ ఉద్దీపనలతో చికిత్సను ప్రారంభించింది. తాజాగా ఎఫ్‌డిఐ 2 డి ద్వారా దేశంలోకి మరిన్ని విదేశీ పెట్టుబడులకు దారులు బార్లాగా తెరిచింది. వ్యాపార సెంటుమెంటును పెంచేందుకు నగదు సరఫరా సులువుగా సాగేందుకు నూతన గృహ నిర్మాణాలను, కార్ల కొనుగోలుకు డిమాండ్ పెంచేందుకు చర్యలకు ఆదేశించింది. మరో అడుగు ముందుకేస్తామంటూ బ్యాంకింగ్ రంగంలో పది ప్రభుత్వ బ్యాంకులను విలీనం చేసి నాలుగు పెద్ద బ్యాంకులుగా ఏర్పాటు చేసే ప్రక్రియను ప్రకటించింది. ఇందిరా గాంధీ హాయంలో బ్యాంకుల జాతీయాకరణ జరిగి ఈ ఏడాదికి 50 ఏళ్లు అయిన తరుణంలో ప్రభుత్వం బ్యాంకులను భారీ స్థాయిలో విలీనం చేసి 2017లో 27 బ్యాంకులుగా ఉన్న ప్రభుత్వ బ్యాంకింగ్ రంగం నేడు 12కి తగ్గడంతో దేశ వ్యాప్తంగా భారతీయ బ్యాంకింగ్ ఉద్యోగ సంఘాల సమాఖ్యలు రోడ్ల మీదకి వచ్చి నిరసనలు, ధర్నాలు నిర్వహించాయి. ప్రైవేటు, కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల కొరకే ప్రభుత్వ రంగ బ్యాంకులను కుదించారు.

**భారత బ్యాంకింగ్ రంగ పరిణామ క్రమం**

భారత బ్యాంకింగ్ చరిత్రను ప్రధానంగా వాణిజ్య బ్యాంకులు( ప్రభుత్వ, ప్రైవేట్) ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు, సహకార బ్యాంకులుగా పరిశీలించాలి. స్థూలంగా ఈ చరిత్రను మూడు దశలుగా వర్గీకరించాలి. మొదటిదశ స్వాతంత్ర్యానికి పూర్వం (1947కు ముందు). రెండవదశ స్వాతంత్ర్యం పొందినప్పటి నుండి ఆర్థిక సంస్కరణలు ప్రారంభం వరకు (1947-1991). మూడవదశ సరళీకృత ఆర్థిక సంస్కరణల ప్రారంభం నుండి నేటి వరకు (1991 నుండి నేటి వరకు).

**మొదటి దశ**

1770లో ఆర్థిక కార్యకలాపాల కొరకు ఒక బ్యాంకును బ్యాంక్ ఆఫ్ హిందుస్తాన్ పేరుతో కలకత్తాలో స్థాపించారు. (అది 1832లో మూసివేసినారు) అనంతరం చిన్న చిన్న బ్యాంకులను స్థాపించినప్పటికీ అవి విజయవంతం కాలేదు. భారతదేశ బ్యాంకింగ్ చరిత్రలో 1881లో స్థాపించిన 'అవద్' బ్యాంక్ మొదటి వాణిజ్య బ్యాంకుగా భారతదేశంలో స్థానం పొందింది. అనంతరం స్థాపించి నేటివరకు సేవలందిస్తున్న అలహాబాద్ బ్యాంక్ (1865), పంజాబ్ నేషనల్ బ్యాంక్ (1894), బ్యాంక్ ఆఫ్ ఇండియా (1906), బ్యాంక్ ఆఫ్ బరోడా (1905), సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (1911) ఉన్నాయి. వీటితో పాటు ప్రాంతీయ అవసరాల మేరకు వివిధ ప్రాంతాలలో స్థాపించిన బెంగాల్ బ్యాంక్ (1806), బొంబాయి బ్యాంక్ (1840), మద్రాసు బ్యాంక్ (1843)లు ఉన్నాయి. ఈ మూడు బ్యాంకులను సంఘటిత పరిచి 1921లో ఇంపిరియల్ బ్యాంక్‌గా నామకరణం చేసినారు. స్వాతంత్ర్యానంతరం ఈ బ్యాంకే 1955లో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాగా మారింది. 1926లో బ్రిటిష్ ప్రభుత్వం నియమించిన హిల్టన్‌యంగ్ కమిషన్ సూచన మేరకు ఏప్రిల్ 1935లో భారత రిజర్వు బ్యాంకు ఏర్పడింది. పై బ్యాంకులన్ని ప్రజల్లో నమ్మకాన్ని, విశ్వాసాన్ని కలిగించని కారణంగా ప్రజల నుండి డిపాజిట్లు, లోన్లు ఆశించిన మేరకు రాలేదు. దీనితో బ్యాంకులు స్ఫూర్తిదాయకంగా ముందుకు పోలేదనేది యథార్థం.

**రెండవ దశ**

స్వాతంత్ర్యానంతరం పాలకులు ఆర్థిక ప్రణాళికలను సమర్థవంతంగా అమలుపరచాలని నిర్ణయించినారు. ఈ దేశంలోని 70 శాతం పైగా గ్రామీణ ప్రజలకు, వ్యవసాయదారులకు, చిన్న పారిశ్రామిక వేత్తలకు సేవలందు విధంగా బ్యాంకులు పనిచేయాలని సంకల్పింపించారు. వడ్డీ వ్యాపారస్థుల దోపిడీని అరికట్టాలనే ప్రధాన ఉద్దేశంతో భారత రిజర్వు బ్యాంకును 1949 జనవరి 1న భారత ప్రభుత్వం జాతీయం చేసింది. దీనినే కేంద్ర బ్యాంకుగా గుర్తించింది. దీనితో బ్యాంకుల సేవలు కేవలం పెద్ద పారిశ్రామికులకు, వ్యాపారస్తులకే కాదని, అన్ని వర్గాల ప్రజల అభ్యున్నతికి ప్రభుత్వ బ్యాంకులు పనిచేయాలని ప్రభుత్వం ప్రకటించింది.

ఈ నేపథ్యంలో పేదరికంలో మగ్గుతున్న ప్రజలకు నిరుద్యోగంతో కొట్టుమిట్టాడుతున్న వారందరికి స్వయం సమృద్ధికి, స్వావలంబనకు బ్యాంకులు పనిచేయాలనే దృఢ సంకల్పంతో ఆనాటి ప్రధాని ఇందిరా గాంధీ 1969లో జూలై 19న 3000 శాఖలున్న 14 బ్యాంకులను జాతీయం చేసింది. అందుకుగాను ప్రైవేటు వ్యక్తుల షేర్లకు నష్టపరిహారంగా డబ్బులు చెల్లించింది.

1980 ఏప్రిల్‌లో 50 వేల శాఖలున్న మరో ఆరు బ్యాంకులను జాతీయం చేయడంతో భారతదేశంలో జాతీయ బ్యాంకుల సంఖ్య 20కి పెరిగింది. 1975 అక్టోబర్ 2న ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుల ప్రాధాన్యతలను అధ్యయనం కోసం ఏర్పడిన నరసింహం కమిటీ నివేదిక ఆధారంగా వ్యవసాయ, గృహ నిర్మాణం, విదేశీ వ్యాపారం, పారిశ్రామిక

అవసరాలకోసం 1982లో నాబార్డు, ఎగ్జిమ్ బ్యాంక్‌లు, 1988లో జాతీయ గృహ నిర్మాణ బ్యాంక్, 1990లో భారత చిన్న పరిశ్రమల అభివృద్ధి బ్యాంకు (ఎస్ఐడిబిఐ) సంస్థలను ఏర్పాటు చేసినారు. ఈ దశలోనే బ్యాంకులు జాతీయకరణ ప్రభావంతో ప్రజల్లో పూర్తి స్థాయిలో విశ్వాసాన్ని నింపే ప్రయత్నం చేసినాయి. అటు వ్యవసాయదారు లకు, ఇటు చిన్న వ్యాపారస్థులకు, గృహ నిర్మాణాలకు రుణాలివ్వడంతో ఆర్థిక శక్తి బదిలి అయింది. దీంతో ఆర్థికాభివృద్ధి కన్పించింది. ఈ మార్పు వలన బ్యాంకులకు ఆదరణ పెరిగి శాఖలను విస్తరించాల్సిన అనివార్యత ఏర్పడింది.

### మూడవ దశ

పెరిగే జనాభాకు సరిపోయే ఆర్థిక వనరులను ఈ బ్యాంకులు అందించలేకపోయాయి. ప్రభుత్వ రంగ బ్యాంకులు మరిన్ని శాఖలను విస్తరించలేకపోవడం మూలాన 1991లో ప్రభుత్వం ప్రవేశపెట్టిన సరళీకృత ఆర్థిక విధానాల పేరుతో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు భారత మార్కెట్ తలుపులు బార్లా తెరిచారు. ప్రపంచ బ్యాంకు ఆదేశాల మేరకు బ్యాంకుల్లో ప్రభుత్వ షేర్లు 26 శాతం నుండి 33 శాతం వరకే ఉండాలన్న ప్రభుత్వ విధానాలను ప్రజలు తిప్పికొట్టడం తో ఈ షేర్లు 51 శాతంగా నిర్ణయించారు. ఈ సంఘటన భారత ఆర్థిక సార్వభౌమాధికారాన్ని విదేశీయులకు తాకట్టు పెట్టినట్లుగా అర్థం చేసుకోవచ్చు. స్థూలంగా భారతదేశ ఆర్థిక గమనం విదేశీ పెట్టుబడిదారుల చెప్పు చేతల్లోకి జారిపోయింది. ఈ నేపథ్యంలో బ్యాంకింగ్ వ్యవస్థలో ప్రైవేట్ బ్యాంకులు పుంజుకున్నాయి. విదేశాలకు భారతదేశం అతిపెద్ద ఆర్థిక మార్కెట్‌గా విస్తరించడం మూలాన 10 ప్రైవేట్ సంస్థలకు బ్యాంకులుగా రిజర్వు బ్యాంకు లైసెన్స్‌లు మంజూర్ చేసింది. ఈ క్రమంలో ఐసిఐసిఐ, ఎచ్‌డిఎఫ్‌సి, ఎఎక్స్‌ఐఎస్, ఇండస్ట్రియల్ బ్యాంకు, డిసి బ్యాంకు లాంటివి అనివార్యంగా ప్రవేశించినాయి.

1998లో నరసింహం రెండవదశ నివేదిక ఆధారంగా మరికొన్నింటికి లైసెన్స్‌లు మంజూరుచేసినారు. వాటిలో ప్రధానంగా కొటక్ మహింద్రా బ్యాంక్, ఎక్స్ బ్యాంకు 2004లో ఏర్పాటైనాయి. 2013-14 మూడవ నివేదిక ఆధారంగా ఐ.డి.ఎఫ్.సి. బ్యాంకుకు, బందన్ బ్యాంక్‌లకు రిజర్వుబ్యాంకు లైసెన్స్ ఇచ్చింది. ఈ లైసెన్స్‌లతో పాటుగా భారత రిజర్వు బ్యాంకు 22 (1) సెక్షన్ బ్యాంకింగ్ రెగ్యులేషన్ చట్టం 1949 ప్రకారం చిన్న చిన్న ఆర్థిక సంస్థలను పైనాన్స్ బ్యాంకులు, చెల్లింపు బ్యాంకులు సేవలందిస్తున్నాయి. 1969లో దేశమంతటా 8,261 వాణిజ్య బ్యాంకు శాఖలుండగా రిజర్వు బ్యాంకు విధానాలు బ్యాంకు యాజమాన్యాల దృష్టి, ప్రజల ఆర్థిక అవసరాల కొరకు 2019 మార్చి నాటికి 1, 41,756 శాఖలుగా విస్తరించినాయి.

### బ్యాంకుల విలీనంలో ఎవరి ప్రయోజనాలు దాగి ఉన్నాయి

ఆర్థిక మాంద్యం అలుముకున్న దశలో ప్రభుత్వ రంగ బ్యాంకులను బలోపేతం సాకుతో కేంద్ర ప్రభుత్వం సంధించిన విలీనాస్త్రం సర్వత్రా చర్చనీయాంశమైంది. బ్యాంకుల విలీన ప్రక్రియ కొత్తదేమి కాదు. కాని ప్రభుత్వ రంగాల(పిఎస్‌బి)కే పరిమితమై పెద్ద నిర్ణయం తీసుకోవడం సంచలనమే. 2017లో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాతో దాని అనుబంధ బ్యాంకులను, భారతీయ మహిళా బ్యాంకును విలీనం చేసింది. 2018 ఏప్రిల్ 1న విజయ బ్యాంక్, దేనా బ్యాంక్‌లను బ్యాంక్ ఆఫ్ బరోడాతో కలిపింది. తాజాగా ఆగస్టు 30న పది ప్రభుత్వ రంగ బ్యాంకులను నాలుగు మెగా బ్యాంకులుగా విలీనం చేయాలని నిర్ణయించారు. ఈ విలీనాలతో బ్యాంకింగ్ రంగ ముఖచిత్రానికి కొత్త రూపం వచ్చింది. ఈ రూపం కోట్లాది మంది భారతీయులను బ్యాంకింగ్ సేవలకు దూరం చేసినట్లు అవుతుందని ప్రజలు ఆందోళనతో ఉన్నారు. ఈ నిర్ణయం వెనుక ప్రధానంగా కార్పొరేట్ శక్తుల హస్తముంది. ప్రభుత్వ బ్యాంకింగ్ వ్యవస్థను బలహీనపరచడమంటే జాతీయ బ్యాంకింగ్ రంగాన్ని ప్రైవేట్, కార్పొరేట్ శక్తులకు కట్టబెట్టడమే అవుతుంది. జనాభాలో అధిక భాగం ఉన్న గ్రామీణ ప్రాంత ప్రజలకు ప్రభుత్వ బ్యాంకుల సేవలు దూరం అవుతాయి.

ప్రస్తుతం విలీనం అవుతున్న బ్యాంకుల్లో కొన్ని బలహీనమైన బ్యాంకులున్నాయి. వాటికి తగినంతగా మూలధనం లేదు. విలీనం తర్వాత ఈ బలహీనతలను వాటితో కలుపుకున్న బ్యాంకు భరించాల్సి వస్తుంది. 2018లో దేనా, విజయ బ్యాంకులను బ్యాంక్ ఆఫ్ బరోడాలో సంఘటిత పరిచారు. ఈ మూడు బ్యాంకుల్లో విజయ బ్యాంకు బెటర్ ఫర్‌పామెన్స్‌లో ఉండే నేడు దానిని కూడా తక్కువ ఫర్‌పామెన్స్‌లోకి తెచ్చినారు. దేనా బ్యాంకు ఇబ్బందులను బ్యాంక్ ఆఫ్ బరోడా మోయాల్సిందే. రెండు మూడు బ్యాంకులను కలపడంతో సాఫ్ట్‌వేర్, సిబ్బంది పని సంస్కృతితో పాటు సిబ్బంది బదిలీలు, పదోన్నతులు, పర్యవేక్షణ పనితీరు మదింపు వంటి సవాళ్లు ఎదుర్కోవాల్సి వస్తుంది. నరసింహం కమిటీ సూచన మేరకు చిన్న బ్యాంకులే వినియోగదారులతో మంచి సంబంధాలు ఉంటాయన్నారు. దీంతో పాటుగా చిన్న బ్యాంకుల్లో లోన్లు మేనేజర్ స్థాయిలో మంజూరు అవుతాయి. మేనేజర్లు పూర్తి స్థాయి తనిఖీల అనంతరం లోన్లు మంజూరు చేస్తారు. నిరర్థక ఆస్తులు తక్కువ శాతంలో ఉంటాయి. అదే పెద్ద బ్యాంకుల్లో లోను మంజూరు బోర్డు డైరెక్టర్స్ స్థాయిలో అవుతుంది. బోర్డు డైరెక్టర్స్ నామినేట్ చేసినవారు. వారు అనేక ప్రభావాలకు లోనుకావడం వలన పెద్ద పెద్ద లోన్లు ఎలాంటి తనిఖీలు చేయకుండానే సాంక్షన్ చేస్తారు. దీనివలన నేడు అధిక నిరర్థక ఆస్తులు పెద్ద బ్యాంకుల్లోనే పేరుకున్నాయి.

### బ్యాంకుల విలీనం - నిరర్థక ఆస్తులు

బ్యాంకుల విలీనంతో పెద్ద బ్యాంకులుగా ఆవిర్భవించడంతో నిరర్థక ఆస్తులు తగ్గుతాయని ఆర్థిక మంత్రి అర్ధ సత్యాలను, అసత్యాలను చెబుతుంది. ఈ బ్యాంకుల విలీనంతో ఆశించిన మొండి బకాయిలు తగ్గకపోచ్చు. బ్యాంకు పనితీరులో, నిర్వాహణ మార్పు వస్తేనే మొండి బకాయిలు తగ్గుతాయనేది చారిత్రక సత్యం. కాని బ్యాంకులో కేంద్ర ప్రభుత్వ పెట్టుబడులను ఉపసంహరించడం, రాష్ట్ర ఈక్విటీలను తగ్గించడం వంటి చర్యల ద్వారా బ్యాంకులను 50 శాతం మేర తగ్గించేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. ప్రభుత్వ బ్యాంకుల్లో ఆస్తులపై రాబడి 2017 - 18లో మైనస్ 0.8 శాతం ఉండగా, ప్రైవేట్ బ్యాంకుల్లో అది 1.1 శాతంగా ఉంది. ఇక నిధులపై రాబడికి, నిధుల సేకరణ ఖర్చుకు మధ్య వ్యత్యాసం ప్రభుత్వ బ్యాంకుల్లో 2.5 శాతమైతే, ప్రైవేట్ బ్యాంకుల్లో 3.6 శాతం. 2017 - 18లో ప్రభుత్వ బ్యాంకులు ఇచ్చిన మొత్తం అడ్వాన్సుల్లో 14.6 శాతం పారు బాకీలుగా తేలితే, ప్రైవేట్ బ్యాంకుల్లో అవి 4.7 శాతంగా ఉన్నాయి. దీనికి కారణం ప్రభుత్వ బ్యాంకులు ఎదుర్కొంటున్న కీలక సమస్య కార్పొరేట్ శక్తులు, వ్యక్తులు పెద్ద మొత్తంలో తీసుకున్న రుణాలను తిరిగి చెల్లించకపోవడమే. భారీ నిరర్థక ఆస్తులు పెరిగినాయి. ఈ కార్పొరేట్ శక్తుల్లో ప్రత్యక్షంగా రాజకీయ నాయకులుండగా, పరోక్షంగా రాజకీయ నాయకులను పోషించే వారే అధికంగా ఉన్నారు.

ఈ విలీన నిర్ణయం పెద్ద బ్యాలెన్స్ షీట్‌ను తయారు చేసి నిరర్థక

ఆస్తులను, మొండి బకాయిలను దాచేందుకు ఉపయోగపడుతుంది. స్థూలంగా ఈ విలీనం ఇప్పటికే పెద్ద మొత్తంలో అప్పులు తీసుకున్న కార్పొరేట్ శక్తులకే లాభం చేకూర్చనుంది. విలీనాలు రెండు సందర్భాలలో జరుగుతాయి. స్వచ్ఛందగా పరస్పర అందకారంతో వ్యాపారభివృద్ధే లక్ష్యంగా జరిగే విలీనం మొదటిది కాగా, అనివార్య కారణాల వల్ల విపత్కర పరిస్థితుల నుంచి బయట పడేందుకు జరిగే విలీనం రెండవది. మొదటి విలీనంలో లాభాలుంటాయి. రెండవ దాంట్లో అనేక సమస్య లుంటాయి. ఈ ప్రభుత్వాలు రెండవ విలీనం ద్వారా బ్యాంకులను విలీనం చేసినాయి. దేశ వ్యాప్తంగా ప్రభుత్వ బ్యాంకుల్లో ప్రభుత్వ పెట్టుబడిని తగ్గించి ప్రైవేట్ భాగస్వామ్యాన్ని పెంచి ప్రైవేట్, కార్పొరేట్ సంస్థలకు బ్యాంకులను అప్పగించాలనేది ఈ విలీనాల అంతర్గత వ్యూహాలు. గతంలో జరిగిన విలీనాలు ఆశాజనకంగా లేవు. 1993లో బలమైన న్యూ?? బ్యాంకును పంజాబ్ నేషనల్ బ్యాంకులో విలీనం చేసినారు. కాని ఆశించిన ఫలితాలు రాలేదు. 2018లో ధేనా, విజయ బ్యాంకులను బ్యాంక్ ఆఫ్ బరోడాలో విలీనం చేస్తే ఈ విలీనం ఫలితం వలన ఏడాది క్రితం షేరు విలువ రు. 150 ఉంటే నేడది రు. 92కి పడిపోయింది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఐదు అసోసియేషన్ బ్యాంకులను విలీనం చేసిన తర్వాత నిరర్ధక ఆస్తులు తగ్గలేదని స్వయంగా బ్యాంకులే ప్రకటించినాయి. గ్లోబల్ ట్రుస్టు బ్యాంకును ఓరియంటల్ బ్యాంకులో విలీనం చేసినప్పటికీ నేడు నష్టాల్లో ఉంది.

బ్యాంకుకున్న నిర్వాహణ సామర్థ్యం, కష్టమర్ లయాలిటి, అసెట్స్, పోర్టు పోలియో లాంటివి ముఖ్యం కాని, సైజ్ ముఖ్య కాదని పై ఉదాహరణలున్నాయి. 2008లో గ్లోబల్ ఫైనాన్సియల్ క్రైసిస్ వచ్చినప్పుడు ప్రపంచ బ్యాంకుల్లో పెద్ద బ్యాంక్ అమెరికాలోని లేమెన్ బ్రదర్స్ బ్యాంకు కుప్పకూలింది. ఆనాడు 25 వేల మంది రోడ్డున పడ్డారు. దీనితో 158 సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర గల బ్యాంకును మూసినారు. 1990 తర్వాత అమెరికాలో అనేక బ్యాంకులు విలీనం అయినాయి. కాని విలీనం తర్వాత ప్రాంతాల పేరుతో, జాతుల పేరుతో వైరం పెరిగి రుణాలివ్వడంతో విచక్షణ చూపినారని అమెరికన్ బ్యాంకులు పాఠాలు చెబుతున్నాయి. బీమల్ జలాన్, రఘురాం రాజన్ లాంటి మాజీ రిజర్వు బ్యాంకు గవర్నర్లు చిన్న బ్యాంకులే ప్రగతికి మూలమని, ఒక బ్యాంకు విఫలమైతే మరొక బ్యాంకుకు సేవలందిస్తాయని అభిప్రాయపడినారు. బ్యాంకింగ్ విలీనాల మీద అధ్యయనం చేసి రిపోర్టు అందించిన మాజీ రిజర్వు బ్యాంకు గవర్నర్ రఘురాం రాజన్ గారు తన నివేదికలో భారతదేశంలో బ్యాంకింగ్ సర్వీసు ప్రజలందరికి విస్తరించాలంటే బ్యాంకులను కుదించడం కాదు, బ్యాంకుల బ్రాంచీలను విస్తరించాలని విశ్లేషించారు.

**కనుమరుగు కానున్న ఆంధ్రా బ్యాంకు సేవలు**

స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో 1923లో స్వతంత్ర సమరయోదుడు భోగరాజు పట్టాభినేత రామయ్య మచిలీపట్నంలో ఆంధ్రా బ్యాంకును స్థాపించినారు. ఈ బ్యాంకు తొమ్మిదిన్నర దశాబ్దాలుగా కోట్లాది మంది తెలుగు ప్రజలకు సేవలందించిందది. నాలుగేళ్లలో వందేళ్లు పూర్తి చేసుకోనుండగా ఈ పరిణామం చోటుచేసుకోవడం గమనార్హం. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుతో ఆంధ్రా బ్యాంకు ప్రధాన కార్యాలయం హైదరాబద్‌కు మారింది. ఈ బ్యాంకుకు రెండు రాష్ట్రాలలో మూడు వేలకు పైగా శాఖలున్నాయి. 3,798 ఎటిఎంలతో పాటు రు. 2,19,583 కోట్ల డిపాజిట్లు ఉండగా, రు. 1,58,848 కోట్ల రుణాలున్నాయి. మొత్తం అసెట్స్ రు. 2,54,044 కోట్లున్నాయి. ఇప్పటికే స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌ను ఎస్‌బిఐలో విలీనం చేయడంతో మొత్తానికి తెలుగు రాష్ట్రాలు కేంద్రంగా పనిచేసే రెండు బ్యాంకులు కనుమరుగైనట్లే. స్వతంత్ర్యోద్యమ కాలంలో బ్రిటిష్ వాళ్లకు పోటీగా ఏర్పాటు చేసిన ఆంధ్రా బ్యాంకు వ్యవసాయ రంగ అభివృద్ధికి కృషి చేసింది. దేశంలో 1981లోనే క్రెడిట్ కార్డులను ప్రవేశపెట్టింది. తెలుగు నేలపై తెలుగు వాడు స్థాపించినే బ్యాంకును తెలుగువారి కోడలు చేతుల మీదుగా కనుమరుగు కావడం యాదృచ్ఛికం కవచ్చు కాని, ఇదే స్ఫూర్తిగా ఆవిర్భవించిన బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర, పంజాబ్ అండ్ సింగ్ బ్యాంకులు ప్రాంతీయ అవసరాలను తీర్చుట పైనే దృష్టి కేంద్రీకరిస్తున్నాయి కాని, వాటిని స్వతంత్రంగా కొనసాగిస్తున్నారు. ఆంధ్రా బ్యాంకు విలీనం తెలుగు ప్రజలను అవమానపరచడమే.

**విస్తరిస్తున్న ఈ – బ్యాంకింగ్ సేవలు**

రోజు రోజుకు పెరిగిపోతున్న ఆర్థిక అవసరాల వేగంతో పాటు కృత్రిమ మేధ, డేటా ఎనలిటిక్స్ ఇంటర్‌నెట్ ఆఫ్ థింగ్స్, డిజిటల్ జీవనశైలిలో లావాదేవీలు జరపడానికి ఇవాళ స్మార్ట్ ఫోన్‌ను తాకి లేదా బార్‌కోడ్‌ను స్కాన్ చేసి అంతర్జాలం ద్వారా ప్రపంచంలో ఎక్కడి నుండి ఎక్కడికైనా డబ్బు పంపే సౌలభ్యం అందుబాటులోకి వచ్చింది. నేడు స్వరం (మాట్లాడడం) ఆధారంగా ఆర్థిక లావాదేవీలు జరుపు తున్నారు. అలెక్సా, సిరి వంటి వర్చువల్ అసిస్టెంట్లు సహకరిస్తున్నాయి. రాబోయే రోజుల్లో ఖాతాదారుల సంతకాల అవసరం లేకుండా వేలిముద్రలు, కనుపాపలు, స్వరాలతోనే పని జరిగే రోజు అత్యంత సమీపంలో ఉంది. బ్యాంక్ రుణాల కోసం వచ్చే ఖాతాదదారుల బలబలాలను ఈ సాంకేతికతలు ఖచ్చితంగా అంచనా వేసి రుణం ఇవ్వొచ్చా లేదా సలహాలిస్తాయి. ఇప్పటికే క్రెడిట్ స్కోరు ఆధారంగా రుణాలను మంజూరు చేస్తున్నారు. అయినప్పటికీ ప్రభుత్వ రంగ బ్యాంకుల్లో ఇలాంటి సౌకర్యాలు తక్కువే ఉన్నాయి. ప్రభుత్వ బ్యాంకులు సమర్థవంతంగా పనిచేస్తేనే, చెల్లింపులు బ్యాంకులు, గూగుల్ పేలు అవసరం లేకపోయేదనేది నిష్టుర సత్యం.

**ప్రభుత్వ రంగ బ్యాంకులే – ప్రజా సంక్షేమంగా పనిచేస్తాయి**

దేశ ఆర్థిక వ్యవస్థకు బ్యాంకింగ్ రంగం వెన్నెముక లాంటిది. పేదరికం, నిరుద్యోగం పాటు ఆర్థిక అసమానతల నిర్మూలన కొరకు బ్యాంకులు పనిచేయాలి. దేశంలోని అన్ని రంగాల అభవృద్ధికి బ్యాంకింగ్ వ్యవస్థ ఇంధనం లాంటిది. కావున దేశంలో ప్రభుత్వ బ్యాంకింగ్ వ్యవస్థను బలోపేతం చేసి, రుణ వితరణ సామర్థ్యం పెంచి ఆర్థిక వ్యవస్థను పటిష్ట పరచడమే లక్ష్యంగా కేంద్ర ప్రభుత్వం పనిచేయాలి. ప్రభుత్వ పథకాలు సంపూర్ణంగా మారుమూల ప్రాంతాలకు తీసుకెల్లాలంటే ప్రభుత్వ బ్యాంకులే సాధనాలు. కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన జన్‌ధన్ భీమా పథకాన్ని ముందుకు తీసుకుపోవుటకు 30 కోట్ల అకౌంట్స్ ప్రభుత్వ బ్యాంకుల్లో ఓపెన్ కాగా, ప్రజా ప్రయోజనాలు కాకుండా స్వప్రయోజనాలకు, లాభా పేక్షకు ప్రాధాన్యతనిచ్చే ప్రైవేట్ బ్యాంకులో 1 కోటి అకౌంట్స్ మాత్రమే ఓపెన్ చేసినారు. ప్రైవేట్ బ్యాంకులు లాభాల కోసం పనిచేస్తే ప్రభుత్వ బ్యాంకులు ప్రజా సేవే పరమావదిగా పనిచేస్తాయని పై సంఘటన నిరూపిస్తుంది.

ఈ క్రమంలో సరళీకృత ఆర్థిక విధానాల ప్రభావంతో 1993 నుండి బ్యాంకులను ప్రేవేటీకరణ చేయాలన్న ప్రతిపాదనలను ప్రజా పోరాటాల తోనే ఆపగలిగారు. నిరర్ధక అస్తులను తగ్గించడానికి విలీనం ఒకటే పరిష్కారం కాదు. బ్యాంకుల పరిమాణం ఏదైనా బ్యాంకుల పటిస్టత

# రాజ్యాంగం గురించి డా. బి ఆర్ అంబేద్కర్

***రాజ్యాంగ నిర్ణయ సభ చివరి సమావేశంలో రాజ్యాంగ రచనా కమిటీ అధ్యక్షుడిగా డా. బి ఆర్ అంబేద్కర్ 1949 నవంబర్ 25న చేసిన ముగింపు ఉపన్యాసం***

*(లాంచనప్రాయమైన కృతజ్ఞతలు, స్థూల అంశాలు, ఉపోద్ఘాతం ముగిసిన తర్వాత)*

**జ**నవరి 26, 1950న భారతదేశం స్వతంత్ర దేశంగా మారుతుంది. ఆ స్వాతంత్ర్యానికి ఏమవుతుంది? భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోగలుగుతుందా, లేదా మరొకసారి కోల్పోతుందా? నా మదిలో మెదులుతున్న మొదటి ఆలోచన ఇది. భారతదేశం గతంలో స్వాతంత్ర్యం అనుభవించిన దేశమే. కాని అది తన స్వాతంత్ర్యాన్ని ఒకసారి కోల్పోయింది. అది తన స్వాతంత్ర్యాన్ని రెండోసారి కోల్పోతుందా? ఈ ఆలోచనే భవిష్యత్తు పట్ల నన్ను ఆందోళనలో ముంచెత్తుతున్నది.

భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని ఒకసారి కోల్పోయిందనే విషయం మాత్రమే కాదు, ఆ ఓటమి తన సొంత ప్రజల అవిధేయత వల్లా, విద్రోహం వల్లా జరిగిందనే విషయం నన్ను తీవ్రంగా కలచివేస్తున్నది.

సింధ్ ను మహమ్మద్ బిన్ కాసిం దురాక్రమిస్తున్నప్పుడు రాజు దహర్ దగ్గర పనిచేస్తుండిన సైనికాధికారులు మహమ్మద్ బిన్ కాసిం తైనాతీల నుంచి లంచాలు తిన్నారు. తమ సొంత రాజుకోసం యుద్ధం చేయడం మానుకున్నారు. మహమ్మద్ ఘోరీ భారతదేశం మీద దండెత్తుతున్నప్పుడు ఆహ్వానించినవాడూ, పృథ్వీరాజు మీద యుద్ధం చేయమనీ, తానూ, సోలంకి రాజులూ సహకరిస్తామనీ చెప్పినవాడూ జైచంద్. శివాజీ హిందువుల విముక్తి కోసం పోరాడుతున్నప్పుడు ఇతర మరాఠా ప్రభువులూ రాజపుత్ర రాజులూ మొఘల్ చక్రవర్తుల పక్షం వహించారు. సిక్కు పాలకులను మట్టికరిపించడానికి బ్రిటిష్ వారు ప్రయత్నిస్తున్నప్పుడు సిక్కుల ప్రధాన సైనికాధికారి గులాబ్ సింగ్ మౌనంగా కూచుని, సిక్కు రాజ్యాన్ని కాపాడకుండా ఉండిపోయాడు. 1857లో భారతదేశంలో అత్యధికభాగం బ్రిటిష్ వారి మీద స్వాతంత్ర్య యుద్ధం ప్రకటించినప్పుడు, సిక్కులు ఆ పరిణామాలకు మౌనసాక్షులుగా నిలిచిపోయారు.

ఆ చరిత్ర పునరావృతమవుతుందా? ఆ ఆలోచనే నాలో ఆందోళన నింపుతున్నది. కులాలు, మతాల రూపంలోని మన పాత శత్రువులతో పాటు, ఇక ముందు మనకు విభిన్నమైన, పరస్పర వ్యతిరేకమైన రాజకీయ అభిమతాల రాజకీయ పార్టీలెన్నో ఉండబోతున్నాయనే వాస్తవం గుర్తిస్తే నా ఆందోళన మరింత పెరుగుతున్నది. భారతీయులు తమ దేశాన్ని తమ మతం కన్న ముందు పెడతారా, లేక మతాన్నే దేశం కన్న ముందు పెడతారా? నాకు తెలియదు. కాని నిశ్చితంగా చెప్పగలదేమంటే రాజకీయ పార్టీలు గనుక దేశం కన్న మతాన్నే పైన పెట్టేట్టయితే, మన స్వాతంత్ర్యం రెండోసారి కూడ ప్రమాదంలో పడుతుంది. బహుశా ఎప్పటికీ కోల్పోయే స్థితి వస్తుంది. ఈ దుష్పరిణామం రాకుండా మనందరమూ నిర్ణయాత్మకంగా పనిచేయవలసి ఉంది. మన చివరి రక్తపు బొట్టు వెచ్చించి అయినా సరే మన స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి మనం దృఢదీక్ష తీసుకోవలసి ఉంది.

1950 జనవరి 26న భారతదేశం ఒక ప్రజాస్వామిక దేశంగా మారనున్నది. అంటే ఆరోజు నుంచి భారతదేశం ప్రజల యొక్క ప్రజల చేత, ప్రజల కొరకు ఉండే ప్రభుత్వాన్ని చూడబోతున్నది. ఇక్కడ కూడ నాలో అదే ఆలోచన తలెత్తుతున్నది. భారత ప్రజాస్వామిక రాజ్యాంగానికి ఏమవుతుంది? భారతదేశం ఆ రాజ్యాంగాన్ని నిర్వహించుకోగలుగుతుందా లేక దాన్ని కూడ కోల్పోతుందా? నా మదిలో మెదులుతున్న రెండో ఆలోచన ఇది. మొదటి ఆలోచనలాగనే ఇది కూడ నన్ను ఆందోళన పరుస్తున్నది.

---

వాటి నిర్వహణ సామర్థ్యంపై ఆధారపడి ఉంటుంది. చిన్న బ్యాంకుల నష్టాల కంటే పెద్ద బ్యాంకుల నష్టాలు ఆర్థిక వ్యవస్థను అతలా కుతలం చేస్తాయి. పెద్ద బ్యాంకులు కేవలం పెద్ద కస్టమర్లకు మాత్రమే ఉపయోగపడుతాయి. అందుకే బ్యాంకుల విలీనం కంటే బ్యాంకుల నిర్వహణపై కేంద్రం నిర్దిష్ట చర్యలు చేపట్టాలి. భారీ స్థాయిలో రుణ వితరణ చేసేటప్పుడు తగిన మార్గదర్శకాల రూపకల్పనతో పాటు రిజర్వు బ్యాంకు ఆజమాయిషీ పెరగాలి. ప్రజా ప్రభుత్వాలు ప్రభుత్వ రంగ బ్యాంకుల అభివృద్ధి ధ్యేయంగా పనిచేయాలి తప్ప కార్పొరేట్ల కంపెనీల పెరుగుదలకు సాగిలపడరాదు.

వేలాది కోట్ల రూపాయల బ్యాంకు రుణాలు నిరర్థక ఆస్తులుగా మిగిలిపోవడం లేదా ఉత్పత్తికి దోహదపడకపోవడం ఆర్థిక వ్యవస్థకు చేటు తెచ్చింది. ఆర్థికాభివృద్ధి సాధనలో మన ప్రభుత్వాధినేతలు ప్రధానంగా విదేశీ పెట్టుబడులపై ఆధారపడడం వల్ల సంపన్న దేశాల విష సంస్కృతి అయిన మాంద్యం మనదేశాన్ని వెంటాడుతున్నది. ఆర్థిక మాంద్య నివారణలో భాగంగా ప్రజల నికర ఆదాయాన్ని పెంచేందుకు నిర్దిష్ట చర్యలు తీసుకోవాలి. ప్రజలందరిని ఇబ్బందులకు గురిచేసే సంస్కరణలతో ప్రయోజనం లేదు.

ఈ దేశంలో కేంద్ర ప్రభుత్వం ఏకపక్ష నిర్ణయాలతో కూడా బ్యాంకు ఉద్యోగ సంఘాల సమాఖ్య మేధావులను, బ్యాంకింగ్ రంగ, ఆర్థిక రంగ నిపుణులతో సంప్రదించి విస్తృతంగా చర్చించిన అనంతరం నిర్ణయిస్తే ఫల ప్రధంగా ఉండేది. ప్రజాస్వామ్యంలో ఏకపక్ష నిర్ణయాలు ఫలించిన సందర్భాలే లేవు. సువిశాల భారతావనిలోని బడుగుజీవుల బహుళ ప్రయోజనాలకై బ్యాంకులను విస్తరింపజేసి, ఆర్థికంగా ఎదగడానికి ఇతోధికంగా సహాయపడాల్సింది పోయి, బడా బూర్జువా పెట్టుబడిదారుల కొమ్ముకాస్తూ బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చే విధంగా కార్పొరేట్ల ఆశలకు పట్టంకడుతూ ప్రభుత్వాలు ఇటువంటి అప్రజాస్వామిక, ఆశ్రియపక్ష ప్రయోజనాలకై తీసుకునే విధాన నిర్ణయాలు ఎదిగి వస్తున్న మధ్యతరగతులు, పేదవర్గాల ప్రజలకు గొడ్డలిపెట్టుగా మారుతాయనడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)*

భారతదేశానికి ప్రజాస్వామ్యం అంటే తెలియదని కాదు. ఒకానొక కాలంలో భారతదేశం నిండా గణతంత్ర రాజ్యాలుండేవి. రాచరికాలు ఉన్నప్పుడు కూడ అవి ఎన్నికల ద్వారానో, పరిమిత అధికారాలతోనో ఉండేవి. ఎప్పుడూ సంపూర్ణ నిరంకుశాధికారాలు లేవు. భారతదేశానికి ప్రజా ప్రాతినిధ్య సభలూ పార్లమెంటరీ పద్ధతులూ కూడ తెలియనివేమీ కావు.

బౌద్ధుల భిక్కు సంఘాలను అధ్యయనం చేస్తే, ఆ సంఘాలు పార్లమెంట్లుగా వ్యవహరించాయని మాత్రమే కాదు, ఆధునిక కాలానికి తెలిసిన పార్లమెంటరీ పద్ధతుల సూత్రాలన్నీ ఆ సంఘాలకు కూడ తెలుసుననీ, అవి వాటిని పాటించాయనీ కూడ అర్థమవుతుంది. ఎవరు ఎక్కడ కూచోవాలో సూత్రాలున్నాయి. ప్రతిపాదనలు ఎలా పెట్టాలో, తీర్మానాలు ఎలా ప్రవేశపెట్టాలో, కనీసం ఎంతమంది ఉంటే నిర్ణయాలు తీసుకోవాలో చెప్పే సూత్రాలు, ఒక వైఖరి తప్పనిసరిగా తీసుకోవాలని నియంత్రించే సూత్రాలు (విప్), వోట్ల లెక్కింపు, రహస్య వోటింగ్, అభిశంసించే తీర్మానాలు, క్రమబద్ధీకరణ, నిర్ణయం జరిగిపోయిన అంశం మీద చర్చను నియంత్రించే సూత్రాలు వగైరా ఎన్నో ఉన్నాయి. స్వయంగా బుద్ధుడే సంఘ సమావేశాలలో ఈ పార్లమెంటరీ పద్ధతుల సూత్రాలను వర్తింపజేసినప్పటికీ, ఆయన తన కాలంలో దేశంలో ఉనికిలో ఉండిన రాజకీయ ప్రాతినిధ్య సభల సూత్రాలనే గ్రహించి ఉంటాడు.

ఆ ప్రజాస్వామిక వ్యవస్థను భారతదేశం కోల్పోయింది. మరి రెండోసారి కూడ దాన్ని కోల్పోతుందా? నాకు తెలియదు. కాని సుదీర్ఘకాలంగా వినియోగంలో లేని, ఏదో కొత్తగా వచ్చినదిగా గుర్తించబడుతున్న ప్రజాస్వామ్యాన్ని పాటిస్తున్న భారతదేశంలో ప్రజాస్వామ్యం స్థానంలో నియంతృత్వం తలెత్తే ప్రమాదం ఎంతగానో ఉంది. ఇప్పుడు కొత్తగా జన్మిస్తున్న ప్రజాస్వామ్యం కేవలం రూపంలో మాత్రమే మిగిలిపోయి, వాస్తవంలో నియంతృత్వం తలెత్తడానికి చాల అవకాశం ఉంది. ఏదో ఉత్పాతం జరిగితే, ఈ రెండో ప్రమాదం వాస్తవంగా మారే అవకాశం మరింతగా ఉంటుంది.

మనం ప్రజాస్వామ్యాన్ని కేవలం రూపంలో మాత్రమే కాక, వాస్తవంగా నిలుపుకోవాలంటే ఏం చేయవలసి ఉంది?

నా అంచనాలో మనం చేయవలసిన మొట్టమొదటి పని మన సామాజిక, ఆర్థిక లక్ష్యాలను సాధించడంలో రాజ్యాంగబద్ధ పద్ధతులకు కట్టుబడి ఉండాలి. దాని అర్థమేమంటే మనం విప్లవపు రక్తపాత పద్ధతులను వదిలివేయాలి. దాని అర్థమేమంటే మనం పౌర శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ, సత్యాగ్రహం వంటి పద్ధతులను వదిలివేయాలి. ఆర్థిక, సామాజిక లక్ష్యాలను సాధించడానికి రాజ్యాంగబద్ధ పద్ధతులకు అవకాశం లేనప్పుడు, రాజ్యాంగేతర పద్ధతులు ఉపయోగించడానికి చాల సమర్థనీయమే. కాని రాజ్యాంగబద్ధమైన పద్ధతులకు అవకాశం ఉన్నప్పుడు, రాజ్యాంగేతర పద్ధతులు ఉపయోగించడానికి సమర్థన లేదు. ఆ పద్ధతులు కేవలం అరాచక పద్ధతులు మాత్రమే అవుతాయి. వాటిని మనం ఎంత తొందరగా వదులుకుంటే అంత మంచిది.

రెండో విషయం, ప్రజాస్వామ్య నిర్వహణ మీద ఆసక్తి ఉన్నవాళ్లందరికీ జాన్ స్టువార్ట్ మిల్ చేసిన హెచ్చరికను పాటించడమే మనం చేయవలసిన పని. అదేమంటే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ఎంత గొప్పవారి పాదాల దగ్గరైనా పెట్టకపోవడం, ఎంత గొప్పవారినైనా నమ్మి ప్రజాస్వామిక వ్యవస్థలను తిరగదోయగల అధికారాన్ని వారి చేతుల్లో పెట్టకపోవడం. దేశానికి తమ యావజ్జీవిత సేవలు అందించిన మహానుభావుల పట్ల కృతజ్ఞత చూపడం తప్పేమీ కాదు. కాని కృతజ్ఞతకు కూడ పరిమితులున్నాయి. ఐరిష్ దేశభక్తుడు డానియెల్ ఓకానెల్ సరిగ్గా చెప్పినట్టుగా, ఏ పురుషుడూ తన ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టేంత, ఏ మహిళా తన శీలాన్ని పోగొట్టుకునేంత, ఏ దేశమూ తన స్వేచ్ఛను త్యాగం చేసేంత కృతజ్ఞత ఉండగూడదు. భారతదేశం విషయంలో ఏ దేశం కన్నా మరింత ఎక్కువగా ఈ హెచ్చరిక అవసరం. ఎందుకంటే, భారతదేశపు రాజకీయాల్లో భక్తి, లేదా ఆరాధనా మార్గం, లేదా వీరపూజ ప్రపంచంలోని మరే దేశ రాజకీయాల్లో కన్న ఎక్కువ పాత్ర వహిస్తాయి. మతంలోనైతే భక్తి అనేది ఆత్మ విమోచనకు మార్గం కావచ్చు. కాని రాజకీయాల్లో భక్తి లేదా వీరపూజ పతనానికి కచ్చితమైన మార్గం. అంతిమంగా అది నియంతృత్వానికే దారితీస్తుంది.

మనం చేయవలసిన మూడో విషయం, కేవలం రాజకీయ ప్రజాస్వామ్యంతో సంతృప్తి చెందకుండా ఉండడం. మనం మన రాజకీయ ప్రజాస్వామ్యాన్ని సామాజిక ప్రజాస్వామ్యంగా తయారుచేయవలసి ఉంది. పునాదిలో సామాజిక ప్రజాస్వామ్యం లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యం మనజాలదు.

సామాజిక ప్రజాస్వామ్యం అంటే ఏమిటి? అంటే స్వేచ్ఛను, సమానత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని జీవనసూత్రాలుగా గుర్తించే జీవన విధానం. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే ఈ సూత్రాలను వేరువేరుగా ఉండే త్రిమూర్తులుగా భావించగూడదు. అది మూడు మూర్తులూ కలిసిన ఒకే ఐక్యసూత్రం. వాటిలో ఒకదాని నుంచి మరొకదాన్ని వేరు చేస్తే అసలు ప్రజాస్వామ్య ప్రయోజనమే దెబ్బతింటుంది.

స్వేచ్ఛను సమానత్వం నుంచి వేరు చేయడానికి వీలులేదు. సమానత్వాన్ని స్వేచ్ఛ నుంచి వేరు చేయడానికి వీలు లేదు. స్వేచ్ఛనూ, సమానత్వాన్నీ సౌభ్రాతృత్వంతో వేరు చేయలేము. సమానత్వం లేకుండా స్వేచ్ఛ మాత్రమే ఉంటే అది అనేకుల మీద కొందరి ఆధిపత్యాన్ని సృష్టిస్తుంది. స్వేచ్ఛ లేకుండా సమానత్వం మాత్రమే ఉంటే అది వ్యక్తిగత చొరవను చంపివేస్తుంది. సౌభ్రాతృత్వం లేకుండా స్వేచ్ఛా సమానత్వాలు సహజంగా వికసించలేవు. వాటిని అమలు చేయడానికి సౌభ్రాతృత్వం రక్షక భటుడుగా ఉండాలి.

భారత సమాజంలో ఈ మూడిటిలో రెండు ఎంతమాత్రం లేవనే గుర్తింపుతో మనం ప్రారంభిద్దాం. ఆ రెంటిలో ఒకటి సమానత్వం. సామాజిక తలంలో భారత సమాజం తారతమ్య అసమానత సూత్రం పునాదిగా ఉంది. ఈ సమాజంలో కొందరికి అపార సంపద, అసంఖ్యాకులు దుర్భర దారిద్ర్యంలో జీవించే స్థితి ఉంది.

జనవరి 26, 1950న మనం ఒక వైరుధ్యమయమైన జీవితంలో ప్రవేశించబోతున్నాం. రాజకీయాలలోనేమో మనకు సమానత్వం ఉంటుంది. సామాజిక ఆర్థిక జీవనంలో మాత్రం మనకు అసమానత్వం ఉంటుంది. రాజకీయాలలో మనం ఒక మనిషికి ఒక వోటు ఒక విలువ అనే సూత్రాన్ని గుర్తిస్తాం. కాని మన సామాజిక, ఆర్థిక జీవనంలో మన సామాజిక ఆర్థిక వ్యవస్థ కారణంగా ఒక మనిషికి ఒక విలువ అనే సూత్రాన్ని నిరాకరించడం కొనసాగిస్తాం. ఈ వైరుధ్యమయమైన జీవితాన్ని ఎంతకాలం కొనసాగించగలం? మన సామాజిక, ఆర్థిక జీవనంలో సమానత్వాన్ని నిరాకరిస్తూ ఎంతకాలం కొనసాగగలం? ఆ నిరాకరణను మనం ఎంత ఎక్కువకాలం కొనసాగనిస్తే, అంత ఎక్కువ కాలం మన రాజకీయ ప్రజాస్వామ్యాన్ని ప్రమాదంలో ఉంచుతూనే ఉంటాం. వీలైనంత త్వరగా మనం ఈ వైరుధ్యాన్ని రద్దు చేయవలసి ఉంది. అలా జరగకపోతే,

అసమానత వల్ల బాధలు అనుభవిస్తున్నవారు ఈ రాజ్యాంగ నిర్ణయ సభ సుదీర్ఘకాలం కష్టపడి నిర్మించిన మన రాజకీయ ప్రజాస్వామ్య నిర్మాణాన్ని పేల్చివేస్తారు.

మనలో కొరతగా ఉన్న రెండో అంశం సౌభ్రాతృత్వ భావనను గుర్తించకపోవడం. సౌభ్రాతృత్వం అంటే ఏమిటి? సౌభ్రాతృత్వం అంటే భారతీయులందరి మధ్య ఒక ఉమ్మడి సోదర భావన. భారతీయులందరమూ ఒకటే అనే భావన. మన సామాజిక జీవనానికి ఐక్యతను, సంఘీభావాన్ని ఇచ్చే సూత్రం అది. కష్టసాధ్యమైన సూత్రం అది. ఈ సౌభ్రాతృత్వాన్ని సాధించడం ఎంత కష్టమో అమెరికా సంయుక్త రాష్ట్రాల విషయంలో అమెరికన్ కామన్వెల్త్ గురించి జేమ్స్ బ్రైస్ రాసిన సంపుటంలో తెలుస్తుంది.

ఆ కథను బ్రైస్ రాసిన మాటల్లోనే వివరిస్తాను.. "కొన్ని సంవత్సరాల కింద అమెరికన్ ప్రొటెస్టెంట్ ఎపిస్కోపల్ చర్చ్ తన త్రిశతజయంతి సమావేశంలో తన ప్రార్థనా గ్రంథానికి సవరణలు చేయాలని తలపెట్టింది. దాని చిన్న వాక్యాల ప్రార్థనలలో యావత్ ప్రజా సమూహానికీ వర్తించే మాటలు చేర్చాలని అనుకున్నారు. ఒక ప్రముఖ మతాచార్యుడు 'భగవంతుడా, మా దేశాన్ని దీవించు' అనాలని ప్రతిపాదించాడు. ఆ మధ్యాహ్నం తక్షణమే ఆ మాటను అందరూ ఆమోదించారు. మర్నాడు ఆ వాక్యం పునఃపరిశీలనకు వచ్చింది. ఎందరెందరో ఎన్నో అభ్యంతరాలు వ్యక్తం చేశారు. 'దేశాన్ని' అనే మాట వాడితే జాతీయ ఐక్యత గురించి ఒక నిశ్చిత గుర్తింపు ధ్వనిస్తున్నదని, అది కుదరదని అభ్యంతరాలు వచ్చాయి. ఆ మాటను వదిలేశారు. చివరికి అందరికీ ఆమోదయోగ్యమైన 'భగవంతుడా, సంయుక్త రాష్ట్రాలను దీవించు' అనే వాక్యాన్ని అంగీకరించారు.

ఈ ఘటన జరిగినప్పుడు అమెరికా సంయుక్త రాష్ట్రాల మధ్య సంఘీభావం అంత తక్కువగా ఉండింది. అమెరికా ప్రజలు తమను తాము ఒక దేశంగా కూడ గుర్తించుకోలేదు. అమెరికా ప్రజలే అలా తమది ఒక దేశం అని గుర్తించలేకపోయినప్పుడు, భారతీయులు తమను తాము ఒక దేశం అని గుర్తించడం ఎంత కష్టం?

రాజకీయ అభిప్రాయాలున్న భారతీయులు 'భారతదేశ ప్రజలు' అనే మాటను అంగీకరించని రోజులు ఉండేవని నాకింకా గుర్తుంది. ఆ మాట బదులు వాళ్లు 'భారత జాతి' అనాలని భావించేవారు. కాని మనం ఒక జాతి అని అనుకోవడంలో మనం ఒక పెద్ద భ్రమలో బతుకుతున్నామని నాకనిపిస్తుంది. వేలాది కులాలుగా విభజింపబడిన ప్రజలు ఒక జాతిగా ఎలా ఉండగలరు? జాతి అంటే ఉండే సామాజిక, మనస్తత్వ పరమైన అర్థంలో మనం ఇంకా ఒక జాతి కామని మనం ఎంత తొందరగా గుర్తిస్తే అంత మంచిది. అలా గుర్తించినప్పుడు మాత్రమే మనం ఒక జాతిగా రూపొందవలసిన అవసరాన్ని గ్రహించగలం. ఆ గమ్యాన్ని చేరడానికి ఉన్న మార్గాలూ సాధనాలూ ఏమిటో తీవ్రంగా ఆలోచించగలం. ఆ లక్ష్యాన్ని సాకారం చేసుకోవడం నిజంగా చాల కష్టతరమైనది. అది అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కన్న ఎక్కువ కష్టతరమైనది. అమెరికాలో కుల సమస్య లేదు. భారతదేశంలో కులాలు ఉన్నాయి. కులాలు దేశద్రోహకరమైనవి. అవి ఎందుకు దేశద్రోహకరమైనవంటే, మొట్టమొదట అవి సామాజిక జీవనంలో వేర్పాటును తీసుకువస్తున్నాయి. అలాగే అవి ఎందుకు దేశద్రోహకరమైన వంటే అవి కులానికీ కులానికీ మధ్య ఈర్ష్యాసూయలనూ, వైమనస్యాన్నీ సృష్టిస్తాయి. కాని వాస్తవంగా మనం ఒక దేశంగా, జాతిగా మారాలని కోరుకుంటే ఈ అవరోధాలన్నిటినీ అధిగమించవలసి ఉంది. ఎందుకంటే ఒక్క దేశం, ఒక్క జాతి ఉన్నప్పుడు మాత్రమే సౌభ్రాతృత్వం అనేది సాధ్యమవుతుంది. సౌభ్రాతృత్వం లేకుండా సమానత్వమూ స్వేచ్ఛా అనేవి పైన వేసిన రంగుల కన్న ఎక్కువ లోతుకు పోజాలవు.

మన ముందు ఉన్న కర్తవ్యాల గురించి ఇవీ నా ఆలోచనలు. ఇవి కొందరికి అంత సంతోషకరంగా ఉండకపోవచ్చు. కాని ఒక మాట చెప్పకతప్పదు. ఈ దేశంలో రాజకీయాధికారం అనేది సుదీర్ఘకాలంగా అతి కొద్ది మంది గుత్తాధిపత్యంగా ఉండిపోయింది. అశేష ప్రజానీకం కేవలం గొడ్డుచాకిరీకి మాత్రమే కాదు, వేటాడబడే జంతువులుగా కూడ ఉండిపోయారు. కొందరికి ఉన్న గుత్తాధిపత్యం వల్ల అశేష ప్రజానీకానికి తన జీవన పరిస్థితులు మెరుగు పరచుకునే అవకాశాలు నిరాకరించబడడం మాత్రమే కాదు, వారి జీవన ప్రాధాన్యత అనేదే వారి నుంచి కొల్లగొట్టబడింది. ఈ అణగారిన వర్గాలు ఇంకెంతమాత్రమూ పాలించబడడానికి సిద్ధంగా లేవు. తమను తాము పాలించుకోవాలనే అసహనం వారిలో ముప్పిరిగొంటున్నది. ఈ అణగారినవర్గాలలో స్వీయ ఆకాంక్షల సాకారం కోసం తపన వర్గపోరాటంగానో, వర్గ యుద్ధంగానో మారడానికి మనం అనుమతించగూడదు. అదే జరిగితే మన గృహం, ఈ రాజ్యాంగ నిర్ణయసభ ముక్కలైపోతుంది. అది నిజంగా విధ్వంస దినంగా మిగిలిపోతుంది. ఎందుకంటే, అబ్రహాం లింకన్ సరిగ్గా చెప్పినట్టు, తనలో తాను ముక్కలైన గృహం ఎక్కువకాలం నిలబడి ఉండజాలదు. అందువల్ల, వారి ఆకాంక్షలను నెరవేర్చడానికి ఎంత తొందరగా అవకాశాలు కల్పిస్తే, కొద్ది మందిగా ఉన్నవారికి అంత మేలు. దేశానికి అంత మేలు. దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి అంత మేలు. దేశ ప్రజాస్వామిక నిర్మాణాలను నిర్వహించడానికి అంత మేలు. అది సాధించాలంటే సమస్త జీవన రంగాలలో సమానత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని స్థాపించడం ఒక్కటే మార్గం. అందువల్లనే నేను ఆ అంశాల మీద అంతగా నొక్కి చెపుతున్నాను.

ఈ సభా సమయాన్ని నేనింకా ఎక్కువగా తీసుకోదలచలేదు. నిస్సందేహంగా స్వాతంత్ర్యం అనేది సంతోష సందర్భమే. కాని ఈ స్వాతంత్ర్యం మన ముందుకు అనేక బాధ్యతలు తెస్తున్నదని మనం మరచిపోగూడదు. ఇంతకాలంగా ప్రతి తప్పుకూ బ్రిటిష్ వాళ్లను కారణంగా చూపే అవకాశాన్ని ఈ స్వాతంత్ర్యం ద్వారా మనం కోల్పోతాం. ఇకనుంచి ఏదైనా తప్పు జరిగితే మనం నిందించడానికి ఎవరూ లేరు. మనను మనం నిందించుకోవలసిందే. పైగా తప్పులు జరగడానికి మరింత ఎక్కువ అవకాశం ఉంది కూడ. కాలం వేగంగా మారుతున్నది. మన ప్రజలతో సహా ప్రజలందరూ కొత్త భావజాలాలతో ప్రేరణ పొందుతున్నారు. ప్రజల చేత ఏర్పడిన ప్రభుత్వం అనేదానితో వారు విసిగిపోతున్నారు. ప్రజల కొరకు ఏర్పడిన ప్రభుత్వాలు కావాలని వారు అనుకుంటున్నారు. అవి ప్రజల చేత, ప్రజల వల్ల ఏర్పడిన ప్రభుత్వాలు కాకపోయినా సరే అనుకుంటున్నారు. ప్రజల చేత, ప్రజల వల్ల, ప్రజల కొరకు ప్రభుత్వం అనే సూత్రం ఆధారంగా మనం రూపొందించిన ఈ రాజ్యాంగాన్ని మనం సంరక్షించుకోవాలంటే, మన మార్గంలో అడ్డుగా ఉన్న చెడులను గుర్తించడంలో ఏమరపాటు లేకుండా ఉందామని ప్రతిజ్ఞ చేసుకుందాం. ఆ చెడులు మన ప్రజలను ప్రజల చేత ప్రభుత్వం నుంచి మళ్లించి ప్రజల కొరకు ప్రభుత్వం వైపుగా ఆకర్షిస్తాయని గుర్తిద్దాం. ఆ చెడులను తొలగించడంలో మన కర్తవ్యదీక్షలో బలహీనంగా ఉండబోమని ప్రతిజ్ఞ చేద్దాం. దేశానికి సేవ చేయడానికి అది ఒక్కటే మార్గం. అంతకంటె మెరుగైన మార్గం నాకు తెలియదు.

*రాజ్యాంగ నిర్ణయ సభ చర్చలు, పదకొండో సంపుటం నుంచి*
*(http://164.100.47.194/Loksabha/Debates/cadebatefiles/C25111949.htm)*

# ప్రపంచీకరణ కొత్తరూపం ఆర్‌సిఇపి

***బ్రిటిష్ వారు మనల్ని వలసలుగా మార్చినప్పుడు కుటీర పరిశ్రమలు ఎలా చిన్నాభిన్నం అయ్యాయో ఆర్‌సిఇపి వల్ల కూడా అదే పరిస్థితి రాబోతోందనీ, దీన్ని అడ్డుకోవడానికి రైతులు కలిసికట్టుగా పోరాడాలనీ అంటున్నారు* కేశవ్**

ఇటీవల రైతు సంఘాల నుండి, ఇతర మిత్ర సంఘాల నుండి భారీ ఎత్తున వ్యతిరేకత రావడంతో భారతదేశం ఆర్‌సిఇపి నుండి వైదొలగింది. ఈ చర్య రైతు సంఘాలకు తాత్కాలికంగా చిన్న ఊరటనిచ్చింది. ఒక సమస్యకు అన్ని వైపుల నుండి పోరాటం చెయ్యడం ద్వారా సత్ఫలితాలు ఎలా ఉంటాయో భారత ప్రభుత్వ ఈ చర్య రుజువు చేసింది. పెట్టుబడిదారీ దేశాలు తమ వ్యాపార స్వార్థ ప్రయోజనాల కోసం భారతదేశం లాంటి దేశాలతో చేసుకునే ఒప్పందాలను తిప్పి కొట్టడం గొప్ప విజయం. అయితే, ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రపంచ బజారులో దేశాన్ని సిద్ధం చేసి నిలబెడుతోన్న తరుణంలో, రిజర్వు బ్యాంకు భారీ నిధుల తరలింపు నేపథ్యంలో, పబ్లిక్ సెక్టార్ బ్యాంకుల్ని ఒక్కొక్కటి బలహీనం చేసేసి ప్రైవేటు మార్గాలకు సుగమం చేసే దిశలో నిజంగా ఇది శాశ్వత విజయమేనా అనేది ఇంకా స్పష్టం కాని విషయం.

**ఆర్‌సిఇపి అంటే?**

ఆర్‌సిఇపి అంటే ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం స్వేచ్ఛా వాణిజ్యం ఒప్పందంలో భాగస్వామ్యం. ప్రపంచీకరణలో భాగంగా భారతదేశంతో కలిపి దాదాపు 16 దేశాల మధ్య వ్యాపార సయోధ్యను కుదుర్చుకోవడమే. ఆస్ట్రేలియా, బ్రూనే, కాంబోడియా, చైనా, ఇండోనేషియా, జపాన్, లావోస్,మలేసియా, మయన్మార్, న్యూజిల్యాండ్, ఫిలిప్పీన్స్, సింగపూర్, థాయిలాండ్, వియత్నాం, సౌత్ కొరియా దేశాలు ఈ ఒప్పందంలో ఉన్నాయి. భారతదేశం కలిస్తే 16వ దేశం అవుతుంది. నవంబర్ 2012లో కాంబోడియాలో జరిగిన సమావేశంలో ఈ సయోధ్యకు పునాది పడింది. ఆర్థిక సరళీకరణల మరో విడతకు శ్రీకారం చుట్టే ప్రక్రియకు తాత్కాలికంగా ఫుల్‌స్టాప్ పడడంతో రైతాంగం, ఆ ఉత్పత్తుల మీద ఆధారపడే ఇతర శ్రామికులు కాస్తా ఊపిరి పీల్చుకున్నారు తాత్కాలికంగానైనా.

**ఒప్పందంలో ఏముంది?**

భారతదేశం 1990ల నుండే స్వేచ్ఛా వాణిజ్యంలోకి ప్రవేశించినాసరే వ్యవసాయ ఉత్పత్తుల విషయంలో టారిఫ్ లను పూర్తిగా తొలగించలేదు. పాల ఉత్పత్తుల మీద కూడా టారిఫ్ లను తొలగించలేదు.అత్యంత చవగ్గా దిగుమతి అయ్యే వ్యవసాయ ఉత్పత్తుల ద్వారా రైతులు, వ్యవసాయ ఉత్పత్తుల మీద ఆధారపడే ప్రజలు ఇబ్బంది పడకుండా ఈ టారిఫ్ లు రక్షిస్తాయి. అయితే, ఆర్‌సిఇపి నిబంధనల మేరకు, సభ్య దేశాలు దిగుమతుల మీద టారిఫ్‌లను రాబోయే 15 సంవత్సరాల్లోగా తొలగించాలి. అంటే, దిగుమతి సుంకాలనేవి కనిపించకూడదు. వినిపించకూడదు. సభ్య దేశాలు ఈ ఉమ్మడి సమూహంలోని దేశాల నుండి దిగుమతుల్ని స్వేచ్ఛగా ఆహ్వానించగలగాలి. అడ్డుల్ని తొలగించగలగాలి. తొలగించాలి కూడానూ. ప్రపంచ వాణిజ్యానికి ద్వారాలు పూర్తిగా తెరవాలి. వినడానికి చాలా వినసొంపైన మాట.. కానీ, వాస్తవాలు భయంకరంగా ఉంటాయి. ఒప్పందం ప్రకారం, 2014వ సంవత్సరాన్ని బేస్ ఇయర్‌గా పరిగణించాలి. కానీ, 2019వ సంవత్సరాన్ని బేస్ ఇయర్‌గా పరిగణించమని భారతదేశం కోరుతోంది.

**వ్యవసాయం మీద విష ప్రభావం**

వ్యవసాయరంగం ఇప్పటికే విపరీతమైన కష్టాల్లో ఉంది. రైతుల ఆత్మహత్యలు, పగిలిన పాదాల రైతుల కాలినడకలు మనకు తెలిసిందే. గిట్టుబాటు ధరలు ఇప్పటికే పంట పండించే రైతుకు రావడం లేదు. సరయిన ధర దొరక్క పంటను రోడ్లమీదకు విసిరేసిన సంఘటనలు ఎన్నో. దానికి తోడు, ఈ కొత్త ఒప్పందం గోరుచుట్టుమీద రోకటిపోటులా వ్యవసాయదారుడి మీద విపరీతమైన ఒత్తిడిని కలిగిస్తుంది. ప్రపంచమంతా మనదే అని దిగుమతి సుంకాలు మాయం చేసేస్తే, అత్యంత చవగ్గా దిగుమతి అయ్యే వ్యవసాయ ఉత్పత్తులూ, పాల ఉత్పత్తులూ స్థానిక మార్కెట్‌లో స్థానిక ఉత్పత్తులు అమ్మకం కానివ్వకుండా వ్యవసాయరంగాన్ని అతలాకుతలం చేసేస్తాయి. వ్యవసాయరంగంలోనూ, పాడి పరిశ్రమలోనూ బహుళజాతి కంపెనీలు స్థానిక మార్కెట్‌లను మరింత శాసిస్తాయి. ప్రపంచంలోని సగం జనాభా ఈ ప్రాంతంలోనే ఉంది. ప్రపంచం వర్తకంలోని 40 శాతం వర్తకం ఈ ప్రాంతంలోనే నడుస్తోంది. ఒకవేళ ఈ ఒప్పందం నిజంగానే జరిగితే, ప్రపంచంలోని అతి పెద్ద వ్యాపార ఒప్పందం అవుతుంది. ఇప్పటికే కుదేలయిన వ్యవసాయరంగం, ఆర్థికరంగం మరింత ఆటుపోట్లకు గురవుతాయి. రైతులూ, తాత్కాలికంగా ఆగిన ఈ ఒప్పందం నిజంగా అమలయితే, సాధారణ ప్రజల జీవితాల్ని మరింత ఛిన్నాభిన్నం చేసేస్తుంది. అందుకే, విభిన్న సంఘాలూ, ఎన్‌జిఒలూ వ్యతిరేకిస్తున్నాయి. ఆర్‌సిఇపి ఒప్పందం దేశంలోని రైతాంగానికి పూర్తి వ్యతిరేకమని అఖిల భారత కిసాన్ సభ ప్రధాన కార్యదర్శి హన్నన్ మొల్లా విమర్శించారు

**పాడి పరిశ్రమపై తీవ్ర ప్రభావం**

హిందూ లోని ఒక ఆర్టికల్ ప్రకారం ఆర్‌సిఇపిని అంగీకరిస్తే, పాల పరిశ్రమ తీవ్రంగా దెబ్బతింటుంది. పాడి ఉత్పత్తుల్ని అత్యధికంగా నియంత్రిస్తున్న దేశాలు ఆర్‌సిఇపి లోనే ఉన్నాయి. ప్రపంచంలోని 51 శాతం పాడి వ్యాపారాన్ని ఈ దేశాలే నియంత్రిస్తున్నాయి. 45 శాతం పాల పొడుల వ్యాపారాన్ని, 38 శాతం బటర్ ఆయిల్ వ్యాపారాన్ని, 35 శాతం జున్ను వ్యాపారాన్ని, 31శాతం వెన్న వ్యాపారాన్ని ఈ ప్రాంతంలోని దేశాలే నియంత్రిస్తున్నాయి. ఆస్ట్రేలియా న్యూజిల్యాండ్ దేశాలు పాల వ్యాపారంలో రారాజుల్లా ఏలుతున్నాయి. కాబట్టి సహజంగానే వీటికి,

ఇలాంటి ఒడంబడికల మీద గొప్ప అభిరుచి ఉండడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. న్యూజిల్యాండ్ దేశం పాల ఉత్పత్తులను భారీస్థాయి పారిశ్రామిక పద్ధతిలో నిర్వహిస్తాయి. ఫలితంగా, భారీస్థాయి పరిశ్రమలు అనుభవించే ఆదాలు ఆర్థిక శాస్త్రం ప్రకారం ఇవి పొంది ఉంటాయి. అందుకే, వీటి యూనిట్ ధర తక్కువ ఉంటుంది. వీరి పాడి ఉత్పత్తులకు దిగుమతి చేసుకునే అవకాశం ఇస్తే, అదీనూ సున్నా టారిఫ్‌తో అలవాటు చేస్తే, కిలో 150 రూపాయలకే లభిస్తాయి, అదే మన దేశం ఉత్పత్తులు కిలో 300 రూపాయలకు లభిస్తాయి. ఇక మన పాడి ఉత్పత్తుల గిరాకీ పడిపోతుంది. వీటి మీద ఆధారపడ్డ 7 కోట్ల శ్రామికులు రోడ్డు మీద పడతారు. ఇప్పటికే తగ్గిన జిడిపిలతో సతమతమవుతున్న ఆర్థికవ్యవస్థ మీద ఇది మరింత భారం వేస్తుంది. పాడి ఉత్పత్తుల ఎగుమతుల్లో అగ్రగాములు అమెరికా,ఆస్ట్రేలియా, న్యూజిల్యాండ్, యూరోపియన్ దేశాలు. 93 శాతం పాల ఉత్పత్తులను న్యూజీల్యాండ్ ఎగుమతి చేస్తోంది. పాడి పరిశ్రమమీద భారతదేశంలో దాదాపు 7 కోట్ల కుటుంబాలు ఆధారపడి ఉన్నాయి. న్యూజిల్యాండ్‌లో ఉత్పత్తులు ఎక్కువే. కానీ, ఈ పరిశ్రమ మీద 10 వేలమంది మాత్రమే ఆధారపడి ఉన్నారు. ఆస్ట్రేలియా లో 6300 మంది మాత్రమే ఆధారపడి ఉన్నారు. ఈ గణాంకాలను బట్టి, పాడి పరిశ్రమ భారతదేశంలోని రైతుల, అసంఘటిత శ్రామికుల ఉపాధినీ, జీవితాన్నీ ఎంతగా ప్రభావితం చేస్తుందో అర్థం అవుతుంది.

**పాడి పరిశ్రమను మింగేస్తున్న పెద్ద కంపెనీలు**

ఇప్పటికే, భారతదేశంలో పాడి పరిశ్రమలో బడా కంపెనీలు ప్రవేశించి ఉన్నాయి. 2019లో పాలను కొనే ప్రైవేటు కంపెనీలలో అత్యంత పెద్ద కంపెనీ నెస్లే. మరో ఫ్రెంచ్ కంపెనీ లక్టలీస్ 2014లో ప్రవేశించి హైదరాబాద్‌లోని తిరుమల మిల్క్ ప్రొడక్ట్స్‌ని, ఇండోర్‌లోని అనిక్ ఇండస్ట్రీస్, ప్రభాత్ పాడిని కొనేసింది. న్యూజిల్యాండ్‌కి సంబంధించిన ఫోంటేరా పాడి కిశోర్ బిర్యానీ ఫ్యూచర్ కంజుమర్ ప్రొడక్ట్‌లో సగం వాటాను పంచుకుంది. ఇలా చూస్తోంటే, ఇప్పటికే ఆర్‌సిఇపి రాకముందే పెద్ద కంపెనీలు మార్కెట్‌ని ఎలా కైవసం చేసుకొని ఉన్నాయో అర్థం అవుతుంది. ఇంకా ఆర్‌సిఇపి ఒప్పందంలో భారతదేశం చేయికలిపితే దిగుమతి సుంకాలు మొత్తం మెల్లమెల్లగా తీసేస్తే, బహుళజాతి కంపెనీల ఉత్పత్తులకు ఎర్ర తివాచీ పరిచేస్తే పరిస్థితి ఇంకెంత దారుణంగా ఉంటుందో అర్థం అవుతుంది. ఒక్క పాల ఉత్పత్తుల విషయంలోనే కాదు. అసంఖ్యాకమైన వినియోగ వస్తువుల విషయంలోనూ బహుళజాతి కంపెనీలు తమహస్తాన్ని చాపి ఉన్నాయి. మందులూ, వ్యవసాయరంగం లోనూ ఇవి ప్రవేశించి ఉన్నాయి. ఇప్పటికే చైనా వస్తువులతో భారతదేశం డంపింగ్ గ్రౌండ్ అయికూర్చుంది. అత్యంత చవగ్గా, నాణ్యత లేని చైనా వస్తువులు భారతదేశం మీద విపరీతంగా పడి స్వదేశీ కంపెనీలను విపరీతంగా కష్టాలలోకీ, నష్టాల్లోకి ముంచాయి. సుంకాలు ఉన్నప్పటికీ, గట్టి చట్టాలు ఉన్నప్పటికీ, గత 12 నెలల్లో చైనా నుండి 8 శాతం స్టీల్ ఉత్పత్తులు దిగుమతి అయ్యాయి. ఇంకా ఎన్నో దిగుమతుల్ని నియంత్రించ లేకపోయే పరిస్థితి ఉంది. ఇప్పటికే ఆన్‌లైన్ కంపెనీలు ధరలతో ఆడుకుంటున్నాయి.

**దిగుమతి సుంకాల మీద వెసులుబాటు**

దిగుమతి సుంకాల మీద వెసులుబాటు ప్రపంచీకరణలో అంతర్భాగమే. పెట్టుబడిదారీ వ్యవస్థలో అంతర్భాగమే. అంతా మార్కెట్ చూసుకుంటుంది అని వల్లించే ఆర్థిక మేధావుల బుర్రలోంచి వచ్చిందే. ప్రపంచీకరణలో భాగంగా పబ్లిక్ సెక్టార్ బ్యాంకులను కుదించే పని ఆరంభం అవ్వనే అయింది. పబ్లిక్ సెక్టార్ కంపెనీల్లోంచి ప్రభుత్వ సబ్సిడీల ఉపసంహరణ ఏనాడో ఆరంభం అయింది. ప్రపంచీకరణ పవనాల మధ్య కూరుకుపోయిన అత్యంత ప్రతిష్టాత్మకమైన కంపెనీ బిఎస్ఎన్ఎల్ నష్టాల్లో కూరుకుపోయి ఇప్పటికే ఈ వ్యాసం రాసే నాటికి 22 వేల మంది ఉద్యోగులు విఆర్ఎస్‌కి దరఖాస్తు పెట్టుకునే పరిస్థితి వచ్చింది. ఎల్‌పిజి సిలిండర్లపై మెల్లమెల్లగా సబ్సిడీల ఉపసంహరణ ఏనాడో ఆరంభం అయింది. రైల్వేలో ఒక్కో విభాగం, ఒక్కో ట్రైన్ ప్రైవేటీకరణకు ఏనాడో గురయింది. రిజర్వేషన్ వెయిటింగ్ రూమ్‌లో కూర్చోవాలన్న నేడు గంటకు పది రూపాయలివ్వాలి. సంవత్సరం తర్వాత అదే యాభై రూపాయలైనా ఆశ్చర్యపోనవసరం లేదు. హౌరా లాంటి పెద్దస్టేషన్లు ఎవరో ఒక కార్పొరేట్ ఖాతాలోకి చేరిపోయినా ఆశ్చర్యం వేయదు. మ్యానుఫ్యాక్చరింగ్ రంగం, ఆటోమొబైల్ రంగం డిమాండ్ లేక ఉన్న ఉద్యోగుల్ని తరిమేసే పరిస్థితి వస్తోంది.

ఆర్థిక వ్యవస్థలో ప్రపంచీకరణకు హారతి పట్టే ఆర్థికవేత్తలు చెబుతోన్న 'గ్రోత్' ఇప్పుడు కనిపించడం లేదు. నిరుద్యోగం పెరిగింది. 'ఆకలి'లో అడుగు వెనక్కి వేస్తోన్నా, 'ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్' లో మాత్రం భారతదేశం అడుగు ముందుకు వేస్తోంది. దిగుమతి సుంకాల సడలింపు ప్రతిపాదనలు కూడా ఈ ప్రజా వ్యతిరేక, సామ్రాజ్యవాదుల, పెట్టుబడిదారుల అనుకూల ప్రక్రియలో భాగమే. వీటి నుండి దేశానికీ, శ్రామిక వర్గానికీ నష్టాలే తప్ప ప్రయోజనం శూన్యం. 'మేక్ ఇన్ ఇండియా' అని ఒకవైపు చెబుతూ, మరోవైపు స్వదేశీ వస్తువుల అమ్మకాలకు నష్టం వచ్చేలా చేసే ఇలాంటి ఒప్పందాలు అత్యంత భయంకరమైనవి. ప్రజావ్యతిరేకమైనవి.

చైనా ఇప్పటికే ఈ ఒప్పందంతో ప్రయోజనం పొందడానికీ, మరిన్ని వేల కోట్ల నాణ్యతలేని వస్తువుల్ని భారత దేశంలో విసిరేసి దేశాన్ని చైనీష్ వస్తువులతో ముంచేయడానికీ గంపెడాశతో ఎదురుచూస్తోంది. భారతదేశం కూడా చైనా చర్యల్ని ఆర్థికంగానూ, రాజకీయంగానూ తిప్పికొట్టడానికి ప్రయత్నం చేస్తోంది. కానీ, ఇంకా స్పష్టత కనిపించడం లేదు. అదనపు ఉత్పత్తి అనేది పెట్టుబడిదారీ వ్యవస్థ అంటుజాడ్యం. శ్రమదోపిడీతో ప్రపంచంలోని శ్రామికుల అదనపు ఉత్పత్తినీ, అదనపు విలువలనీ లాభాల పేర్ల మీద మింగేసి, తమ దేశంలో అమ్మకం కాని అదనపు ఉత్పత్తుల్ని మరో దేశం మీద విసిరెయ్యడం ఈ రోజు కొత్త విషయం కాదు. బ్రిటిష్ వారు మనల్ని కాలనీలుగా మార్చేసినప్పుడు, దేశ చేనేత రంగాన్ని,కుటీర పరిశ్రమల్ని తమ దిగుమతులతో ఛిన్నాభిన్నం చేసేసినప్పుడు కూడా చూశాం. ఈ రోజు ప్రపంచీకరణ పేరు మీద, ఆర్‌సిఇపి పేరు మీద ఇదే పన్నాగం చూస్తున్నాం. దిగుమతి సుంకాల మీద వెసులుబాటు అనే ఒక్క అంశం మాత్రమే ఈ ఒప్పందంలో లేదు. పెద్ద పెద్ద బహుళ జాతి సంస్థలు ఈ కొత్త చట్టాల, ఒప్పందాల పేర్లతో ఈ దేశాల వ్యవసాయ రంగాన్ని కైవసం చేసుకోవాలనుకుంటున్నాయి. వ్యవసాయాన్ని లాభసాటి పరిశ్రమగా మార్చెయ్యాలని అనుకుంటు న్నాయి. దేశంలోని పాడి పరిశ్రమలోని కో ఆపరేటివ్ అంశాన్ని భారీ పరిశ్రమగా మార్చేసి అత్యంత లాభసాటి వ్యాపారంగా మార్చెయ్యాలని అనుకుంటున్నాయి. ఇలాంటి ఒప్పందాలను తిప్పి కొట్టడంలో రైతులే కాదు. మొత్తం ప్రజలు ముందుకు రావలసిన అవసరం ఉంది. అలా కాకపోతే, ఈ ఒప్పందం తాత్కాలికంగా ఆగినా, చాప కింద నీరులా కల్లబొల్లి మాటలతో మరో రూపంలోనో, మరో అందమైన ముసుగులోనో అవతరించి దేశాన్ని డంపింగ్ గ్రౌండ్‌గా మార్చేసే ప్రమాదం ఉంది.

*(రచయిత అధ్యాపకులు.*
*'జాగృతి సమీక్ష' త్రైమాసిక పత్రిక సంపాదకులు.)*

# విత్తనంపై రైతులకు హక్కు లేదా?

*వలసవాద విధానాల కొనసాగింపే విత్తన బిల్లు 2019 అనీ, అది విదేశీ బహుళజాతి కంపెనీలకు ప్రయోజనం తప్ప రైతులకు ప్రయోజనం కాదనీ, రైతు విత్తన హక్కును కాపాడి దేశ వ్యవసాయాన్ని రక్షించే బిల్లు కావాలనీ అంటున్నారు* **డా. కొల్లా రాజమోహన్**

**భా**రతదేశ పరిస్థితులకు, విభిన్న వాతావరణాలకు, ఆహారభద్రతకు, అనువైన విత్తనాలను సకాలంలో సరసమైన ధరకు అందించేటట్లుగా విత్తన విధానం ఉండాలి. రైతుల విత్తన స్వతంత్ర్యం దేశ విత్తన విధానానికి పునాదిగా ఉండాలి. విత్తన రక్షణ అంటే జాతీయ రక్షణే. ధనదాహంతో విత్తనాన్నీ, వ్యవసాయాన్నీ, ఆహారాన్నీ, దేశాన్నీ కంట్రోలు చేసే దేశ, విదేశ కంపెనీల చేతులలో విత్తనం కంట్రోలు ఉంచరాదు.

దేశంలోని 80 శాతానికి పైగా విత్తన కంపెనీలు మన తెలుగు రాష్ట్రాల లోనే ఉన్నాయి. నూతన రకాల రూపకల్పన, విత్తనోత్పత్తి ఇక్కడే జరుగుతుంది. ఉమ్మడిరాష్ట్రంలో ప్రత్యేక విత్తన చట్టం రూపకల్పనకు ప్రయత్నించినా కేంద్రం ఒప్పుకోలేదు.

రైతు విత్తనాల స్థానంలో కంపెనీ విత్తనాలను తెచ్చిపెట్టే టట్లుగా ఈ విత్తనబిల్లు-2019, ఉన్నది. మన విత్తన తయారీని ఎం.ఎన్.సి. ల చేతులలో పెట్టడానికి పరాకాష్టే ఈ బిల్లు. టెక్నాలజీ పేరున మళ్లీ పంటకు పనికిరాని విత్తనాలను రైతులకు అంటగట్టే కంపెనీలకు రక్షణ కల్పించి, రాయల్టీ పేరున దేశీయ సంపదను దోచిపెట్టడానికి చేసే ప్రయత్నమే ఈ బిల్లు. వ్యవసాయ సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేసి, రైతుల వ్యవసాయం స్థానంలో కంపెనీ వ్యవసాయాన్ని ప్రవేశపెట్టే ప్రయత్నంలో భాగమే ఈ విత్తన బిల్లు-2019.

వ్యవసాయంలో కీలకమైన విత్తనాన్ని, విత్తనచట్టాన్ని కేంద్రం తన పరిధిలో ఉంచుకున్నది. 1966 విత్తన చట్టం స్థానంలో కేంద్ర ప్రభుత్వం 2004లో రూపొందించిన విత్తన బిల్లును 2004 డిసెంబర్ 9న రాజ్యసభలో ప్రవేశపెట్టారు. వివరమైన పరిశీలన కోసం 2004 డిసెంబర్ 16న పార్లమెంట్ వ్యవసాయ సెలెక్ట్ కమిటీకి పంపారు. ప్రభుత్వంపై మోన్సాంటో లాంటి ఎం.ఎన్.సి.ల వత్తిడి తీవ్రంగా ఉంది. రైతుల ప్రయోజనాలకు ద్రవ్యపెట్టుబడి ప్రయోజనాలకు వైరుధ్యం పెరిగింది. దేశంలోని రైతు సంఘాలు, మేధావులు రైతుల ప్రయోజనాలను రక్షించాలని ఆందోళనలు చేశారు. ఫలితంగా పార్లమెంట్ సెలెక్ట్ కమిటీ కొన్ని మంచి విషయాలను బిల్లులో పెట్టమని సూచించింది. అటువంటి మార్పులు చేయకుండా మోన్సాంటో, బేయర్స్ లాంటి కంపెనీలు ప్రభుత్వంపై ఒత్తిడి చేస్తూనేవున్నాయి. అందువలననే ఆ బిల్లు ఇప్పటివరకూ చట్ట రూపం దాల్చలేదు. సరైన అవకాశంకోసం కంపెనీలు కాసుకొని కూర్చున్నాయి.

కొత్త ప్రభుత్వ విధానాలే అదునుగా భావించి, ఈ నవంబర్ 18 నుంచి మొదలయ్యే శీతాకాల పార్లమెంటు సమావేశాల్లో 2019 విత్తన బిల్లును ప్రవేశ పెట్టనున్నారు. ఈ మేరకు కేంద్ర వ్యవసాయ మంత్రిత్వశాఖ సవరించిన విత్తన బిల్లు 2019ని వెబ్ సైట్‌లో ఉంచింది. దీనిపై సలహాలు. సూచనలు నవంబర్ 13 లోగా పంపమని కోరారు.

2010లో పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ సూచించిన సిఫార్సులను విత్తన బిల్లు 2019 డ్రాఫ్ట్ లో కనిపించలేదు. రైతు హక్కుల రక్షణకు, కంపెనీల ప్రయోజనాలకు పోటీ ఏర్పడింది. ప్రభుత్వం కంపెనీల పక్షం వహించింది. కంపెనీల ప్రయోజనాల పరిరక్షణే ధ్యేయంగా ప్రభుత్వం ఈ బిల్లును తయారుచేసింది. ఈ కొత్త బిల్లులో క్లాజ్ 11 ప్రకారం రైతు అంటే ఎవరు అనే నిర్వచనంలోనే తేడా ఉంది. వ్యవసాయ భూమి స్వంతదారులై ఉంటే చాలు. వ్యవసాయంచేసినా, చేయించినా రైతులే అని బిల్లు అంటుంది. అంటే భూమిని కొనుక్కుని వ్యవసాయం చేయించే కంపెనీలు కూడా రైతులు అవుతున్నారు.

*'Farmers means any person who owns cultivable land or any other category of farmers who are doing agricultural work as notified by the central or state Governments'.*

హర్యానా లోని పల్వాల్ ప్రాంతంలో 10 ఎకరాల విస్తీర్ణంలో, బేయర్ కంపెనీ ఆవాల రీసర్చ్ కేంద్రాన్ని ఏర్పాటు చెంసింది. భారత దేశంలో 65 లక్షల హెక్టార్లలో ఆవాల సాగు ఉంది. ఆ మార్కెట్ కోసం బేయర్ కంపెనీ రైతు అవతారం ఎత్తుతున్నది. ఈ బిల్లు 11 వ క్లాజు ప్రకారం బేయర్ కంపెనీ కూడా రైతు నిర్వచనం కిందకు వస్తుంది. రైతు ప్రయోజనాలన్నీ బేయర్ కంపెనీకి చట్ట ప్రకారం దక్కుతాయి.

**విత్తనం ధర నిర్ణయించడంలో ప్రభుత్వ పాత్ర ఉండాలి.**

విత్తన అమ్మకం ధరలను నియంత్రణ చేసే అధికారం ఈ బిల్లు ప్రకారం ప్రభుత్వాలకు లేదు. రైతులకు సరైన ధరలకు విత్తనాలు అందించే బాధ్యతను కంపెనీలకు వదలడం అంటే కసాయి వానికి కత్తి అందించటమే. ప్రస్తుతం సంకర రకాల, జన్యుమార్పిడి రకాల విత్తన ధరలు ఆకాశాన్నంటాయి. సంకర జాతి కాయగూరల విత్తనాల ధరలు కిలో లక్షకు చేరింది. రాష్ట్రం లో సాగవుతున్న పంటలలో 60 శాతానికి పైగా (వరి, అపరాలు మినహా) అన్నీ హైబ్రీడ్ విత్తనాలే. పత్తిలో 94 శాతానికి పైగా ఉత్పత్తి చేసి ప్రయివేట్ సంస్థలు మార్కెటింగ్ చేస్తున్నాయి. ఆయా విత్తనాల అమ్మకం ధరలను ఆ సంస్థలే నిర్ణయించుకుంటున్నాయి. అసంబద్ధంగా, అశాస్త్రీయంగా లాభాపేక్షతో ధరలు నిర్ణయించ బడుతున్నాయి. మన రైతుల ప్రత్యక్ష అనుభవమే పెద్ద ఉదాహరణ.

**రైతుల ఆందోళనలతో ధర తగ్గింది**

మోన్సాంటో కంపెనీ 2002 నుండి 2006 వరకు తన ఇష్టమొచ్చిన ధరకు పత్తి విత్తనాలు అమ్ముకున్నది. 2005లో నల్లమడ రైతు సంఘం ప్రారంభించిన ఉద్యమం ఫలితాలను ఇచ్చింది. మాన్సంటో అక్రమ

ధరలు తగ్గించాలని, రాయల్టీలు, పేటెంట్‌లు రద్దు చేయాలని. గుంటూరు జిల్లాలో చేసిన ధర్నాలు రైతు సంఘాలను, రాష్ట్ర ప్రభుత్వాన్ని కదిలించాయి. 450 గ్రాముల బి.టి. పత్తి విత్తనాల పాకెట్‌ను 1850 రూపాయలకు అమ్ముతున్నారు. ఆందోళనల తర్వాత 750 రూపాయలుగా ప్రభుత్వం నిర్ణయించింది. ప్రభుత్వానికి ధర నిర్ణయించే అధికారం లేకపోతె పత్తి విత్తనాల పాకెట్ ధర 1850 రూపాయల దగ్గరే వుండేది. 2004 సం లో పార్లమెంట్ స్టాండింగ్ కమిటీ రైతులనుండి ఇష్టమొచ్చినట్లు వసూలు చేయకుండా కంపెనీలను కట్టడి చేసే బిల్లును తయారు చేయాలని గట్టిగా సిఫారసు చేసింది.

పేటెంట్ లేకుండానే రాయల్టీని రౌడీల లాగా వసూలు చేశారు. దేశ, విదేశీ కంపెనీలు కలిసి రైతులను దోపిడీ చేశాయి. మన్సంటో తొలి రకం బి.టి. 1 విత్తనాలకు ఇండియాలో పేటెంట్ లేనేలేదు. పేటెంట్ ఉందన్న భ్రమను భారీ ప్రచారాలద్వారా కల్పించారు. 2002 సం నుండి 2018 సం వరకు రైతుల వద్దనుండి రాయల్టీని గోళ్లూడకొట్టి వసూలు చేశారు. చట్టవ్యతిరేక పాపపు సొమ్మును దేశీయ, విదేశీయ కంపెనీలు పంచుకున్నాయి.

గ్రామాలలోని రైతులు అనేక సంవత్సరాలుగా సాంప్రదాయ దేశీ విత్తనాలను రక్షిస్తూ వస్తున్నారు. వాటిని హైబ్రిడ్‌ల అభివృద్ధిలో వాడేటప్పుడు గ్రామాలలోని రైతులకు కనీస గుర్తింపు కూడా ఇవ్వటంలేదు. మద్దతు ధరలకు స్వామినాధన్ కమిటీ సిఫార్సులను అనుసరించినట్లే, విత్తన రైతులకు పంట పెట్టుబడి ఖర్చు పోను 50 శాతం లాభం ఉండేలా విత్తన కంపెనీలు రైతుల విత్తన పంటలకు ధర చెల్లించాలి.

**కాంపెన్సేషన్ క్లాజు**

రైతు విత్తనాలు కొని పంట పండించిన తర్వాత ముందుగా విత్తన కంపెనీలు చెప్పిన మేరకు దిగుబడులు రాకపోతే ఆయా విత్తన కంపెనీలు నష్టపరిహారం చెల్లించేలా అవసరమైన కాంపెన్‌సేషన్ కమిటీని నియమించే అధికారాన్ని ఇచ్చే క్లాజును ఈ బిల్లులో తీసివేశారు. వినియోగదారుల రక్షణ చట్టం-1986 ప్రకారం నష్ట పరిహారం పొందాలని పేర్కొన్నారు. ప్రత్యేక కాంపెన్‌సేషన్ కమిటీని నియమించే అధికారాలు బిల్లులో ఉంటే రైతులకు సకాలంలో నష్టపరిహారం అందుతుంది. నాణ్యమైన విత్తనం మాత్రమే సరిపోదు. ఆయా విత్తనాల ధరలు నియంత్రణలో ఉండాలి. రైతు భరించగలిగేలా ఉండాలని పార్లమెంటరీ కమిటీ సూచించింది. నెలలోపు ఇప్పటికే ఆకాశాన్నంటు తున్న హైబ్రిడ్ విత్తన ధరలతో రైతులు బెంబేలెత్తుతున్నారు. ఒకసారి ఆ విత్తనాలు మొలకెత్తకపోయినా, పంట నష్టపోయినా మళ్లీ కొని విత్తాలంటే అయ్యే పనికాదు. కంపెనీ విత్తనాల వలన పంట నష్టపోయినపుడు పంట నష్టాన్ని రైతుకు ఇవ్వాలి. అప్పటివరకూ రైతులకు అయిన ఖర్చులతో పాటుగా, 10 లక్షల రూపాయలను కంపెనీలు చెల్లించేటట్లుగా ఉండాలి. మండల స్థాయిలో నియమించిన స్థానిక కమిటీలు నష్టాన్ని నిర్ణయించి నెలలోపు అమలుపరచాలి.

కల్తీ విత్తనాలు మార్కెట్‌లో రాజ్యమేలుతున్నాయి. ఒకవేళ పట్టుబడినా అరకొర పెనాల్టీతో వదిలిపెడుతున్నారనే భరోసా కంపెనీ లకు ఉన్నది. అందుకే 2010లో బిల్లులో సవరణల ప్రకారం రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ లేని, లేదా కల్తీ విత్తనాలు లేదా మిస్ బ్రాండెడ్ విత్తనాలు అమ్మినా, నిల్వ చేసినా, దిగుమతి చేసుకున్నా రు.50 వేల నుంచి పది లక్షల దాకా పెనాల్టీగా వేయాలని కమిటీ సూచించింది. అలాగే 3 నుంచి 12 నెలల జైలు శిక్ష విధించాలన్నది. అయితే ప్రస్తుతం రూపొందిస్తున్న బిల్లులో పెనాల్టీగా రు.25 వేల నుంచి ఐదు లక్షల వరకు తగ్గించారు. జైలుశిక్షను గరిష్ఠంగా ఏడాదివరకు విధించాలని పేర్కొన్నారు.అయితే ఇవి కంపెనీలను నకిలీ బ్రాండ్ విత్తనాలు అమ్మకుండా నియంత్రించ డానికి సరిపోవు. వాస్తవంగా ఈ చట్టాలు కంపెనీలకు చుట్టాలుగా ఉన్నాయి. కనీసం 10 లక్షల పెనాల్టీ ఉండాలి.

విదేశాల నుండి గోధుమతో పాటు దిగుమతి చేసుకున్న వయ్యారిభామ విత్తన కంపెనీలు కోకొల్లలుగా అనేక రకాలను విదేశాల నుంచి దిగుమతి చేసుకుంటున్నాయి. ఆయా దేశాల ఎగుమతిదారులు ఇచ్చే సమాచారం మేరకే వాటిని మన దేశం లోనికి అనుమతిస్తున్నారు. గోధుమల జర్మ్‌ప్లాస్మ్‌తో దేశంలోకి ప్రవేశించిన వయ్యారిభామ కలుపు మొక్కల నివారణ దేశానికి పెద్ద తలనొప్పిగా మారింది. ప్రభుత్వ పరిశోధన సంస్థలు పూర్తిగా క్షేత్ర స్థాయిలో పరిశీలించిన తరువాత దిగుమతి చేసుకున్న విత్తనాలను పరిశోధనకు వాడుకునేందుకు అనుమతులు ఇవ్వాలి. అపుడే కొత్త చీడపీడల సమస్యలు తలెత్తవు. విత్తనోత్పత్తికి మన దేశంలోనే ప్రాంతీయ వాతావరణం వైరుధ్యం వలన వచ్చిన అనుకూలత అపారం. ఆ అవకాశాలను సద్వినియోగపరచుకుని జీవ వైవిధ్యాన్ని కాపాడాలి.

రైతులు తాము రూపొందించిన విత్తన రకాలను మార్కెట్‌లో అమ్ముకు నేందుకు ప్రత్యేక అవకాశం కల్పించాలి. అందుకు అనుగుణమైన ప్రత్యేక గుర్తింపు గల సంచులను అందుబాటులో ఉంచాలి. బహుళజాతి విత్తన సంస్థలు రావటంవలన కుదేలైన దేశీయ విత్తన రంగాన్ని నిలబెట్టి కాపాడుకోవాలి. విత్తన రక్షణలో రైతులకు ఎక్కువ భాగస్వామ్యం కల్పించాలి. దేశంలో నాణ్యమైన విత్తనం అందుబాటులోకి తేవడానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని రైతులకు అందించడానికి చర్యలు తీసుకోవాలి.

ప్లాంట్ వెరైటీ ప్రొటెక్షన్ రైతుహక్కుల చట్టం పివిపి & ఎఫ్ఆర్ ఆక్ట్ 2001, కల్పించిన రైతు హక్కులు ఏమైపోతున్నాయి.? 2001 లో పంట రకాల పరిరక్షణ, రైతుల హక్కుల చట్టం ద్వారా రైతు విత్తన హక్కులకు భంగం కలగకుండా నూతన రకాల అభివృద్ధికి ప్రోత్సాహకరమైన అంశాలు ఆ చట్టం ద్వారా అందుబాటులోకి వచ్చాయి. పివిపి & ఎఫ్ఆర్ ఆక్ట్-2001 ప్రకారం రైతుల సాంప్రదాయక విత్తనం హక్కులన్నీ ర్నక్షించబడ్డాయి. ఈ చట్టం ఆధారంగానే గుజరాత్ బంగాళదుంప రైతులు పెప్సీ కంపెనీపై పోరాడి విజయం సాధించారు. బ్రాండడ్ విత్తనాలు అమ్మనంతకాలం ఏ విత్తనాలనైనా సాగు చేసుకోవడానికి, ఇతరులతో పంచుకోవడానికి అవకాశం ఉన్నది. విత్తన కంపెనీలు బలోపేతమై ప్రభుత్వాలను శాసించే స్థాయికి ఎదిగిన తరువాత, తమకు అనుకూలమైన చట్టాలను చేయించుకుని రైతుల పొట్టలను కొడుతున్నారు. అంతులేని సంపదను సొంతం చేసుకుంటున్నారు. 'పంటలో తీసిన విత్తనం నాదే' అని రైతులు అంటున్నా విత్తన కంపెనీలు 'విత్తనం మా స్వంతం' అంటున్నారు. పివిపి & ఎఫ్ఆర్ ఆక్ట్ 2001 కల్పించిన రైతు హక్కులకు విత్తన కంపెనీల హక్కులకు పోటీ పెట్టి రైతులకు అన్యాయం తలపెట్టారు. పివిపి & ఎఫ్ఆర్ ఆక్ట్ 2001లో విత్తన మోసాలను అరికట్టే అనేక అంశాలున్నాయి. విత్తన పరీక్షా కేంద్రాలలో నాణ్యత నిర్ధారణ విత్తన రకాల తప్పనిసరి నమోదు, నమోదైన విత్తనాలను రైతులు సాగు చేసే వెసులుబాటు, విత్తనాల ఎగుమతి దిగుమతుల నియంత్రణ, జరిమానా పెంపు, మొదలగు మంచి అంశాలున్నాయి. విత్తన మోసాలకు గరిష్టంగా

# ప్రపంచ దేశాల్లో ప్రజాపోరాటాలు

*నేడు ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటు చేస్తున్నారనీ, ఈ పోరాటంలో ప్రజలు ఐక్యంగా పోరాడితేనే విజయం సాధించగలరనీ అంటున్నారు* **ఎ. నర్సింహా రెడ్డి**

**1991**లో సోవియట్ విచ్ఛిన్నంతో చరిత్ర అంతమైపోయిందని ఇక పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయం లేదని బూర్జువా సిద్ధాంతకర్తలు బాకాలూదారు. సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి నిలబడ్డ సోషలిజం ఎదురుదెబ్బ తినడంతో ఇక ఏకధృవ ప్రపంచం శాశ్వతమని ప్రచారం చేశారు. పెట్టుబడిదారీ వ్యవస్థే చరిత్ర గమనంలో చివరి మజిలి అని సిద్ధాంతీకరించారు. ఇక భవిష్యత్‌లో యుద్ధాలు వ్యవస్థల మధ్య కాకుండా నాగరికతల మధ్య జరుగుతాయని శ్యామ్యూల్ హంటిగ్టన్ కొత్త సిద్ధాంతాన్ని రూపొందించాడు. కానీ చరిత్ర అంతం కావడంలేదనీ, పెట్టుబడిదారీ వ్యవస్థే చివరి మజిలీకి వచ్చిందని గత దశాబ్దకాలంలో జరిగిన ఘటనలు, మరీ ముఖ్యంగా ఇటీవలి ప్రపంచ ఆర్థిక, రాజకీయ పరిణామాలు తెలియజేస్తున్నాయి. ద్రవ్య పెట్టుబడి తన లాభాల వేటలో సృష్టించిన పెద్దబుడగ పగిలిపోవడంతో 2008లో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ మూలాల్లో వ్యాపించిన సంక్షోభాన్ని బట్టబయలు చేసింది.

మూడు దశాబ్దాలుగా ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాలను అత్యంత వేగవంతంగా ప్రభావితం చేస్తున్న అంశం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు. ప్రపంచీకరణ అనేది అప్పటికప్పుడు పుట్టుకు వచ్చిన నూతన విధానమేమి కాదు. సామ్రాజ్యవాద దేశాలు ప్రపంచం మీద తమ ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పెత్తనాన్ని అలాగే పట్టుసడలకుండా కొనసాగించే ప్రక్రియనే 'ప్రపంచీకరణ'గా పేర్కొనవచ్చు. అంటే పెట్టుబడిదారీ విధానం పాత ప్రమాణాలతో కూడిన నూతన తరహా వ్యవస్థ. పెట్టుబడిదారీ విధానం 1880 నాటికి గుత్త పెట్టుబడిగా ఎదిగి సామ్రాజ్యవాదంగా మొదలైంది. పెట్టుబడి కేంద్రీకరణ, పారిశ్రామిక, బ్యాంకింగ్ రంగాలలో గుత్త సంస్థల ఏర్పాటుకు దారి తీసింది. పరిశ్రమల, బ్యాంకుల పెట్టుబడుల కలయికవల్ల ద్రవ్య పెట్టుబడి ఏర్పడింది. ద్రవ్య పెట్టుబడిని గుప్పెట్లో పెట్టుకున్న కొద్దిమంది కుబేరులు ప్రభుత్వాలను శాసిస్తున్నారు. ఈ విధానాలు రెండు ప్రపంచ యుద్ధాలకు కారణమయ్యాయి.

**పలు దేశాల్లో ప్రజాగ్రహానికి నేపథ్యం**

1970 నాటికి సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడిదారీ విధానం నూతన దశలోకి ప్రవేశించింది. ఈ దశలో ద్రవ్య పెట్టుబడి అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిగా మారింది. మొదటగా సామాజిక ఉత్పత్తి రూపాలన్నింటిని తనకు ఉపాంగంగా మార్చుకుంది. అంటే, మానవ కార్యకలాపాలను అత్యధికంగా తన అధీనంలోకి తెచ్చుకొని ప్రపంచ దేశాలన్నింటిని సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలకు లోబడి ఉండేట్లు చేసుకుంది. రాజ్యం స్వభావంలో అది మార్పు తెచ్చింది. ఆర్థిక రంగం బతికి బట్ట కట్టాలంటే ప్రజా ప్రయోజనాలను పణంగా పెట్టి ద్రవ్య పెట్టుబడిని సంతృప్తిపరచడం రాజ్యం విధిగా మారింది. ప్రపంచీకరణ ఆర్థిక రాజకీయ విధానాల అమలు వలన సామాజిక ఆర్థిక అసమానతలు పెరిగాయి. ప్రజాస్వామ్యాన్ని పరిహసిస్తూ జీవనాధారాల కొరకు, హక్కుల కొరకు ఉద్యమిస్తున్న ఆందోళనకారులపైన అన్ని దేశాలు ఫాసిస్టు నిర్బంధాన్ని అమలు చేస్తున్నాయి.

దశాబ్దానికి పైగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థను పట్టి పీడిస్తున్న పెట్టుబడిదారీ వ్యవస్థాగత సంక్షోభం కార్మికుల, పేదల, రైతాంగం జీవన ప్రమాణాలపై తీవ్ర ప్రభావం చూపింది. విభిన్న చారిత్రక, సాంస్కృతిక నేపథ్యం గల చిలే నుంచి లెబనాన్ వరకు, హాంకాంగ్ నుంచి చికాగో వరకు వేర్వేరు అంశాలపై ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు గత కొంతకాలంగా జరుగుతున్నాయి. ఇవాళ ఉద్యమాలు కొత్త పంథాలో సాగుతున్నాయి. సాంకేతికతను అందిపుచ్చుకుని సామాజిక మాధ్యమాలతో మరింత ప్రభావాన్ని చూపుతున్నాయి. తక్కువ సమయంలో ఎక్కువ మందిపై ప్రభావాన్ని చూపుతున్నాయి. అమెరికా ఖండంలో ఈక్వెడార్, చిలే, హైతీ, మధ్యాసియాలో లెబనాన్, ఇరాక్, ఈజిప్ట్, సౌదీ అరేబియా, ఐరోపాలో స్పెయిన్, చెక్ రిపబ్లిక్, రష్యా, ఫ్రాన్స్, ఆఫ్రికా ఖండంలో అల్జీరియా, సూడాన్, ఆసియాలో కజకిస్థాన్, హాంకాంగ్ తదితర దేశాల్లో ప్రజా వెల్లువలు లేచాయి. ఈ ఉద్యమాల మధ్యన ఒక అంతస్సంబంధం ఉందని గార్డియన్ పత్రికలో సైమన్ టిసా డాల్ రాశాడు. 'ఒక్కో దేశంలో జరిగిన ఉద్యమానికి ఒక్కోరకమైన ప్రత్యేకత ఉంది. అయితే వీటి మధ్యగల ప్రధాన సారూప్యత ఏమంటే యువత ఉద్యమాలలో ఎక్కువగా పాల్గొనడం, ప్రపంచవ్యాప్తంగా నెరవేరని యువత ఆకాంక్షలు టైం బాంబులుగా మారుతున్నాయని' సైమన్ పేర్కొనడం గమనార్హం.

---

6 నెలల జైలు శిక్ష 1000 రూపాయల జరిమానా మాత్రమే. వీటికి భయపడే కంపెనీ లేనేలేదు. కాబట్టి రాష్ట్ర విత్తన సంఘ ఏర్పాటు దీనికి పరిష్కారం. దేశీయ విత్తన రక్షణ సంస్థను ఏర్పరచాలి. భారతదేశ జన్యుసంపదను రక్షించాలి.

తెల్లదొరల కాలంనాటి గుడ్‌ఫెయిత్ క్లాజు ప్రకారం ప్రభుత్వ అధికారులు, కంపెనీ అధికారులు తప్పులు చేయరు. చేసినా ప్రభుత్వానికి అంటే బ్రిటిష్ రాజ్యానికి మంచి చేయాలనే నమ్మకంతో చేస్తున్నారు కాబట్టి చేసిన తప్పులకు వారు బాధ్యులు కారని అన్నారు. గుడ్‌ఫెయిత్ క్లాజు ఈ బిల్లులో పెట్టడం వలన అధికారులు ఎవరికీ సమాధానం ఇవ్వనవసరం లేదు. వలసవాద విధానాల కొనసాగింపు వలన కంపెనీలకు ప్రయోజనం రైతులకు నష్టం జరుగుతుంది.రైతుల ప్రయోజనాలకు నష్టం కలిగించే ఈ బిల్లుకు బదులుగా రైతు విత్తన హక్కులను కాపాడి మన దేశ వ్యవసాయాన్ని రక్షించే సమగ్ర విత్తన బిల్లు కావాలి.

*(రచయిత నల్లమడ రైతు సంఘం )*

వీ

### చిలేలో ప్రజా ఉద్యమం

లాటిన్ అమెరికా దేశాల్లో ఒకటైన చిలేలో అక్టోబర్ 18న అధ్యక్షుడు సెబాస్టియన్ పినేరా నేతృత్వంలోని మితవాద ప్రభుత్వం ప్రజా రవాణా ఛార్జీలను 4 శాతం పెంచడాన్ని వ్యతిరేకిస్తూ ఆందోళన మొదలైంది. ఆ దేశంలో పాలకుల అవినీతి, జీవన వ్యయం, ప్రైవేటీకరణ, అసమానతలకు ప్రతిస్పందనగా ప్రజలు పెద్ద యెత్తున వీధుల్లోకి వచ్చారు. అధ్యక్ష భవనాన్ని ముట్టడించారు. ప్రభుత్వం అత్యవసర పరిస్థితిని ప్రకటించింది. పోలీసులు కర్ఫ్యూ విధించారు. 7500 మందిని నిర్బంధించారు. కాల్పుల్లో 19 మంది మృతి చెందారు. ఈ పోరాటాలు ప్రపంచ కార్మికోద్యమ చరిత్రలో కొత్త అంకానికి తెరతీశాయి. మెట్రో ఛార్జీల పెంపుతో మొదలైన విద్యార్థుల నిరసన ఆ దేశాధ్యక్షుడు సెబాస్టియన్ పినేరా అధికారాహంకార చర్యలతో ఇంతింతై వటుడింతై అన్నట్లుగా క్రమంగా ప్రజా తిరుగుబాటుగా మారింది. మెట్రోరైలు టిక్కెట్ ధరను పెంచడం ఈ నిరసనకు తక్షణం పురిగొల్పి ఉండవచ్చునేమో కానీ, ప్రభుత్వ విధానాల వల్ల ఏర్పడిన అసమానతలకు వ్యతిరేకంగా ప్రజల్లో దశాబ్దాలుగా గూడుకట్టుకొని ఉన్న ఆగ్రహమే వారిని వీధుల్లోకి నడిపించిందన్నది యదార్థం.

సంపదకు ఏలోటులేని చిన్నదేశం చిలే. ఆ దేశ జనాభా ఒక కోటి డెబ్బై లక్షలు. పసిఫిక్ మహాసముద్రం తీరం వెంట ఉన్న ఈ అందమైన దేశం పర్యాటకానికీ, వైన్ ఉత్పత్తికి ప్రసిద్ధి. ప్రపంచంలోనే అత్యధిక రాగి ఖనిజం నిల్వలున్నాయి. సహజమైన నైట్రేట్ ప్రపంచంలో ఒక్క చిలేలోనే దొరుకుతుంది. కానీ, దశాబ్దాల సరళీకృత ఆర్థిక విధానాలు సృష్టించిన అసమానతలతో పడిపోతున్న జీవన ప్రమాణాలతో ప్రజలు విసిగిపోయారు. పేదరికం, నిరుద్యోగం, అవిద్య పెరిగిపోయాయి. విద్యావైద్యం వంటివి సామాన్యులకు దూరమైపోయాయి. ప్రజా సంక్షేమంపై వ్యయం సన్నగిల్లింది. పింఛన్లపై కోతలు హెచ్చు తున్నాయి. సంస్కరణల పేరిట పాలకులు తీసుకొనే నిర్ణయాలన్నీ సామాన్యుల నడ్డి విరిచాయి. మరోవైపు ఒకశాతం సంపన్నుల చేతిలో అరవైశాతం దేశ సంపద పోగుబడి, ప్రజల కళ్లెదుటే కొద్దిమంది వరుసబెట్టి కోటీశ్వరు లవుతున్నారు.

కోటి ఎనభై లక్షల జనాభా కలిగిన దేశంలో రాజధాని శాంటియాగోలో పది లక్షల మందితో అసమానతలకు వ్యతిరేకంగా అక్టోబర్ 25న అనేక కిలోమీటర్లు సాగిన ప్రదర్శన చారిత్రాత్మకమైనది. భారీ నిరసన ర్యాలీ నిర్వహించడంతో ప్రభుత్వం గజగజలాడింది. అధ్యక్షుడు పినేరా మీడియాతో మాట్లాడుతూ తాను 'ప్రజల సందేశాన్ని' విన్నానన్నారు. అత్యంత శాంతియుతంగా జరిగిన భారీ ర్యాలీని తిలకించామని, ప్రజల ఆగ్రహాన్ని గుర్తించామన్నారు. ప్రజల ఆగ్రహానికి కారకులైన మంత్రులందరినీ పదవులకు రాజీనామా చేయాల్సిందిగా ఆదేశించినట్లు ఆయన చెప్పారు. దేశవ్యాప్తంగా వివిధ నగరాలలో విధించిన కర్ఫ్యూ నిషేధాజ్ఞలను వెంటనే ఎత్తివేస్తున్నట్లు ఆయన ప్రకటించారు. మంత్రులందరూ తమ పదవులకు రాజీనామా చేస్తారని ప్రకటించిన పినేరా సరికొత్త కేబినెట్‌ను చేస్తానన్నారు. కానీ, తన రాజీనామా విషయాన్ని మాత్రం ప్రస్తావించలేదు. మరోవైపు భద్రతా బలగాలు హక్కుల ఉల్లంఘనకు పాల్పడుతున్నాయని వచ్చిన ఆరోపణలపై విచారణ జరిపేందుకుగాను కమిటీని పంపుతున్నామని చిలే సోషల్ డెమోక్రాట్ మాజీ అధ్యక్షురాలు, ఐక్యరాజ్య సమితి మానవ హక్కులు అధ్యక్షురాలు మిచెల్లీ బాచెలెట్ తెలిపారు. పౌర సంఘాల రౌంటేబుల్ నిర్ణయానుసారం దేశ వ్యాప్తంగా నవంబర్ 25న సార్వత్రిక సమ్మె, నిరసన ర్యాలీలు జరిగాయి.

### లెబనాన్ జనాగ్రహ జ్వాలలు

లెబనాన్‌లో షియాలు, సున్నీలు, క్రైస్తవులు, ఇతర తెగలు, జాతులు, మతాల మధ్య అనేక ఏళ్లపాటు సాగిన తీవ్రమైన అంతర్యుద్ధం 1990లో ముగిసింది. ప్రభుత్వ ఏర్పాటులో అన్ని తరగతులకు ప్రాతినిధ్యం కల్పించే ఏర్పాటు జరిగింది. అంతర్యుద్ధంలో పాల్గొన్న వార్‌లార్డ్స్ ప్రభుత్వంలో మంత్రి పదవులు పంచుకున్నారు. ప్రధానమైన హిజ్‌బుల్ వర్గానికి ప్రధాని పదవి లభించింది. అప్పటి నుండి ఆయా రాజకీయ నాయకుల కుమారులు, వారసులు మంత్రి పదవులు పొందుతూ ఒక రకమైన ఆశ్రిత పెట్టుబడిదారీ వ్యవస్థను నెలకొల్పారు. రాజకీయ నాయకులు వ్యాపారాలు, కాంట్రాక్టులు, ఇతర మార్గాల్లో డబ్బు సంపాదించుకుని ప్రజలపై పన్నుల భారాలు వేస్తూ వచ్చారు. దేశంలో 58 శాతం సంపద 1 శాతం కుబేరుల వద్ద పోగయింది.

మధ్యప్రాచ్యంలోని చిన్నదేశం లెబనాన్‌లో అక్టోబర్ 17న పెంచిన వాట్సాప్ చార్జీలకు వ్యతిరేకంగా ప్రారంభమైన ఉద్యమం క్రమంగా అక్టోబర్ 19 నాటికి పెరిగి పెద్దదైంది. అక్టోబర్ 20న లక్షల సంఖ్యలో కార్మికులు, విద్యార్థులు, మహిళలు దేశంలోని పలు నగరాల్లో వీధుల్లోకి వచ్చారు. రాజధాని బీరుట్‌లో పెద్ద ప్రదర్శన జరిగింది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలు కదం తొక్కారు. లెబనాన్ ఆందోళనకు ప్రధాన కారణం ఆర్థిక పరిస్థితి. లెబనాన్‌లో ఏర్పడిన ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించడంలో ప్రభుత్వం విఫలం కావడంతో ప్రజల్లో పెరిగిన అసంతృప్తి వాట్సాప్ ఛార్జీల పెంపు అనే చిన్న అగ్గిరవ్వతో మహోద్యమజ్వాలగా మారింది. దేశంలో నిరుద్యోగం పెరిగిపోయింది. దేశం అప్పుల్లో కూరుకుపోయింది. ఇవాళ ఆ ఉద్యమం క్రమంగా 'రాజకీయ వ్యవస్థను మార్చాలి, విప్లవం రావాలి, ప్రజలపైనా భారాలు తగ్గాలి' అన్న నినాదాలతో ప్రభుత్వ వ్యతిరేక పోరాటంగా మారింది'.

ప్రపంచ బ్యాంకు కనుసన్నల్లో ఆర్థిక వ్యవస్థ నడవడంతో 2010 నుండి సంక్షోభం ఏర్పడింది. విదేశీ రుణాలు ఆగిపోయాయి. స్థానిక కరెన్సీ విలువ పడిపోయింది. బడ్జెట్ లోటు పెరిగిపోయింది. దీన్నుండి బయటపడేందుకు ప్రపంచ బ్యాంకు, ఐరోపా బ్యాంకు, సౌదీ అరేబియాలు అభివృద్ధి, పునర్నిర్మాణం పేరుతో 86 కోట్ల డాలర్ల రుణం ఇవ్వడానికి 2018లో ఒక ప్యాకేజీ ప్రకటించాయి. దానికోసం అవి ప్రజా వ్యతిరేక షరతులు విధించాయి. ప్రభుత్వం ప్రజలపై ట్యాక్సులు వడ్డించడం ప్రారంభించింది. ప్రజల నెత్తిన పన్నుల భారం పెరిగింది. ఆర్థిక పరిస్థితి చక్కదిద్దలేని స్థాయికి చేరుకుంది. చివరకు ప్రభుత్వం ఖజానా నింపడానికి వాట్సాప్, ఫేస్‌బుక్ కాల్ చేసినా చార్జీలు వడ్డించడం మొదలు పెట్టింది.

అప్పు ద్వారా వచ్చే డాలర్లను దిగుమతి వ్యాపారం చేసే కంపెనీలకు ఇచ్చేందుకు ఒక వ్యూహాన్ని గత అక్టోబర్ 1న ప్రభుత్వం ప్రకటించింది. లెబనాన్ సమాచార శాఖమంత్రి దీనిపై వ్యాట్ 2020 నాటికి 15 శాతం చేస్తామని చెప్పడం కూడా అగ్నికి ఆజ్యం పోసింది. వాట్సాప్, ఫేస్‌బుక్ వంటి ఇంటర్నెట్ సేవలపై నెలకు 6 డాలర్లు (సుమారు 400 రూపాయలు) ఛార్జీలు వేసింది. ఆందోళనకు జడిసి వాట్సాప్, ఫేస్‌బుక్ కాల్స్‌పై చార్జీలను రద్దు చేసింది. అయినా ఒకసారి ప్రారంభమైన ఆందోళనలు కొనసాగుతున్నాయే తప్ప తగ్గడం లేదు. ప్రభుత్వంపై అనేక ఫిర్యాదులు ముందుకు వచ్చాయి. దేశంలో పెరిగిపోతున్న అవినీతి, ప్రభుత్వంలో ఉన్న పెద్దల అవినీతి, ఆర్థిక అవకతవకలు, ఆర్థిక వ్యవస్థను నాశనం చేసిన తీరు ఇవన్నీ ప్రజలు ఇప్పుడు చర్చిస్తున్నారు. అన్నింటికి పరిష్కారాలు కోరుతున్నారు. సమూల ప్రక్షాళన కోరుతున్నారు.

లెబనాన్‌లోని యువకుల్లో 37 శాతం మంది నిరుద్యోగులుగా ఉన్నారు. వేతనాలు తక్కువ. జీవన వ్యయాలు భరించలేనంతగా

పెరిగిపోయాయి. దేశంలో విద్యుత్తు, నీటి సదుపాయాలు అధ్వాన్నంగా ఉన్నాయి. వీటికి తోడు ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు సంస్కరణలతో మరిన్ని భారాలు వేయడం వారిలో అసంతృప్తిని నిరసనోద్యమంగా మార్చింది. ఉద్యమం వెనుక ఒక నాయకత్వ కేంద్రం లేనందున ఉద్యమం చప్పున చల్లారిపోతుందనుకున్న వారి ఆశలు ఆవిరైపోయాయి. నిత్య అంతర్యుద్ధాల వల్ల లెబనాన్ ప్రజలు 60 లక్షల మంది దేశంలో నివసిస్తే, 14 లక్షల మంది దేశం బయట విదేశాల్లో ఉంటున్నారు. లెబనాన్ స్వాతంత్ర్య దినోత్సవం నవంబర్ 22న నిరసనకారులు పెద్దఎత్తున ర్యాలీ నిర్వహించారు. బీరుట్‌లో జరిగిన ప్రదర్శనలో వైద్యులు, న్యాయవాదులు, పదవి విరమణ చేసిన మిలిటరీ ప్రముఖులు, విద్యార్థులు, కార్మికులు పాల్గొన్నారు. దాదాపు పది లక్షల మంది ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు. గత నెల రోజులుగా నిరసనలు హోరెత్తడంతో ప్రధాని సాద్ హరిరి రాజీనామా చేశారు. ప్రధాని రాజీనామా ఒక్కటే చాలదని రాజకీయ వ్యవస్థ మారేంతవరకు విశ్రమించమని నిరసనకారులు అంటున్నారు.

**ఈక్వెడార్**

ఈక్వెడార్ అధ్యక్షుడు లెనిన్ మొరెనో మే 2017లో అధికారం చేపట్టాడు. గత ఫిబ్రవరిలో ఐఎంఎఫ్ నుంచి 420 కోట్ల డాలర్ల అప్పు తీసుకోవడానికి ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. అప్పు కోసం ఐఎంఎఫ్ విధించిన దుర్మార్గమైన షరతులను అమలుపరచడానికి అంగీకరించాడు. దీంట్లో భాగంగా 70 ఏళ్లుగా దేశంలో అమలవుతూ వస్తున్న ఇంధన సబ్సిడీలను ఎత్తివేయడం, 'ఫ్లెక్సిబుల్' కాంట్రాక్టులను చేపట్టేందుకు కార్మిక సంస్కరణలు చేయడం, ప్రభుత్వ రంగంలో కొత్తగా ఉద్యోగాల్లోకి తీసుకునే వారికి 20 శాతం జీతాలు కోత పెట్టడం, కార్మికులకు ఏడాదికి ఇచ్చే 30 సెలవులను 15కు తగ్గించడం, ప్రజలపై మరిన్ని భారాలు వేయడం, కార్మిక చట్టాలను సరళీకరించడం వంటివి ఉన్నాయి.

మొరెనో ప్రభుత్వ అధికారం చేపట్టిన వెంటనే ఈక్వెడార్ మూలవాసి జాతుల సమాఖ్య (సిఓఎన్ఎఐఇ), పాపులర్ ఫ్రంట్, యూనిఫైడ్ వర్కర్స్ ఫ్రంట్ సంయుక్తంగా ఆందోళనకు పిలుపు ఇచ్చాయి. మూలవాసి ప్రజలు, కార్మికులు, యువకులు, విద్యార్థులు, మహిళలతో కూడిన ప్రజావెల్లువ ప్రభంజనంలా సాగింది. అక్టోబర్ 1న దేశవ్యాప్తంగా సమ్మెలు, ధర్నాలు, నిరసన ప్రదర్శనలు, రోడ్డు దిగ్బంధాలు, ప్రభుత్వ కార్యాలయాల స్వాధీనాలు వంటివి జరిగాయి. అక్టోబర్ 5న మొరెనో దేశంలో 60 రోజుల ఎమర్జెన్సీ ప్రకటించాడు. నిరసనలు, సభలు వగైరాలను నిషేధించాడు. కానీ ఆందోళనకారులు వీటిని లెక్క చేయలేదు. మూడు రోజుల్లోనే ఉద్యమం ప్రజల ఉద్యమంగా మారిపోయింది. బెంబేలెత్తిన మొరెనో 7వ తేదీన రాజధానిని క్విటో నుండి సముద్ర తీర నగరమైన గ్వాయాక్విల్‌కు మార్చేశాడు.

కార్మికుల సమ్మెతో పరిశ్రమలు మూతపడ్డాయి. రవాణా బంద్ అయింది. రోజువారి పెట్రోలియం ఉత్పత్తి 4.3 లక్షల బ్యారెళ్ల నుండి మూడు నాలుగు రోజుల్లో 1.76 లక్షల బ్యారెళ్లకు పడిపోయింది. పాఠశాలలు మూతపడ్డాయి. విద్యార్థులు పెద్ద ఎత్తున ఉద్యమంలోకి వచ్చేశారు. తూర్పు, దక్షిణ రాష్ట్రాల్లో అనేక సైనిక, పోలీసు వాహనాలను మూలవాసీ ప్రజలు స్వాధీనం చేసుకున్నారు. 50 మంది సైనికులను బందీలుగా పట్టుకున్నారు. మూడు ప్రభుత్వ రంగ చమురు క్షేత్రాలను 'ప్రజలు స్వాధీనం' చేసుకున్నారు. ఎక్కడికక్కడ ప్రజలు సైన్యంతో (అక్టోబర్ 1 నుంచి 14 వరకు) 14 రోజుల పాటు తలపడుతూ ప్రభుత్వాన్ని స్తంభింపచేసి ఐఎంఎఫ్ ఆదేశిత ప్రజావ్యతిరేక ఆర్థిక ప్యాకేజీని తిప్పికొట్టారు. ఉద్యమ సమయంలో ప్రభుత్వం ఉద్యమంపై ఉక్కుపాదం మోపింది. 7గురు చనిపోయారు. 100 మంది గాయపడ్డారు. వేలాదిమంది నిర్బంధానికి గురయ్యారు. అయినా ఉద్యమం ఆగలేదు.

ఐఎంఎఫ్, అమెరికా అండతో మొరెనో ఈక్వెడార్ ప్రజలపై మెరుపుదాడి చేస్తే ప్రజలు అంతే మెరుపు వేగంతో సంఘటితంగా ప్రతిఘటించి ఆయన మెడలు వంచారు. రాజధాని విడిచి పారిపోయినా తను ఈక్వెడార్ ప్రజా ప్రతిఘటనా దాటి నుండి తప్పుకోలేనని, సైన్యం, నిర్బంధాలు తనను కాపాడలేవని తెలుసుకున్న మొరెనో చివరకు దిగివచ్చాడు. ఉద్యమానికి నాయకత్వం వహించిన సంస్థల ప్రతినిధులను చర్చలకు పిలిచి అక్టోబర్ 14న తన 'సంస్కరణల ప్యాకేజీని' రద్దు చేస్తున్నట్లు ప్రకటించాడు. అయితే దేశాన్ని ప్రస్తుత ఆర్థిక దుస్థితి నుండి కాపాడ్డానికి తీసుకోవలసిన చర్యలతో కొత్త ప్రతిపాదన చేసేందుకు ఈ సంస్థల ప్రతినిధులు తమకు సహాయం అందించాలని కోరాడు. ప్రతిఘటనోద్యమ నాయకులు ఆందోళన విరమిస్తున్నట్లు ప్రకటించారు.

'సంస్కరణలు మొత్తంగా ఆపేయాలి. కొత్త ప్రతిపాదనలకు ప్రయత్నాలేమిటి' అని కొందరు ప్రశ్నించారు. కొత్త ప్రతిపాదన లేమైనా ఉంటే ధనికులపై భారాలు వేయాలి గాని పేదవాళ్లను ముట్టుకుంటే ఊరుకోం అని మూలవాసీ కిచ్వా జాతి నాయకుడు ఆండ్రెస్ టాపియా పేర్కొన్నాడు. మరోవైపు ఐఎంఎఫ్ నిర్దేశిత పొదుపు చర్యలకు వ్యతిరేకంగా ఈక్వెడార్‌లో ప్రజా పార్లమెంటు నిర్వహించాలని ప్రధాన పోరాట సంస్థలు నిర్ణయించాయి. ఐఎంఎఫ్‌కు బంటుగా మారిన అధ్యక్షుడు లెనిన్ మొరెనో ఆర్థిక విధానాలకు ప్రత్యామ్నాయంగా రూపొందించిన నూతన ఆర్థిక నమూనాను ఈ ప్రజా పార్లమెంటులో ఓటింగ్‌కు పెట్టాలని ఈక్వెడార్ మూలవాసులు, సామాజిక సంస్థలు సంయుక్తంగా నిర్ణయించాయి.

**హాంకాంగ్**

హాంకాంగ్‌లో ప్రస్తుతం కొనసాగుతున్న 'ఒకే దేశం రెండు వ్యవస్థలు' విధానం 2047 వరకు కొనసాగాలని గతంలో బ్రిటన్‌తో చైనా ఒప్పందం కుదుర్చుకుంది. దీని ప్రకారం చైనాలో హాంకాంగ్ విలీనం 2047 వరకు పాక్షికమనే భావించాలి. ఈలోగానే హాంకాంగ్‌లో తమదైన ముద్ర వేయాలని, ఇది తనలో అంతర్భాగమేనని ప్రపంచ దేశాలకు చాటిచెప్పాలని చైనా అనుమానిత నేరగాళ్లను తమకు అప్పగించాలనే బిల్లును ప్రతిపాదించడం ద్వారా హాంకాంగ్‌పై పూర్తి ఆధిపత్యం సంపాదించాలని భావించింది. చైనా వత్తిడితో స్థానిక ప్రభుత్వం కొత్తగా ఫిబ్రవరి 2019లో తీసుకొచ్చిన నేరస్తుల అప్పగింత చట్టం తీవ్ర ఆందోళనకు దారితీసింది. ఈ చట్టాన్ని అడ్డుకోవడానికి మార్చి 31న నిరసన ఉద్యమం ప్రారంభించారు. ఏప్రిల్ 28న, జూన్ 9న చేసిన ప్రదర్శనలు ప్రపంచం దృష్టిని ఆకర్షించాయి. లక్షలాది మంది ప్రదర్శనల్లో పాల్గొంటున్నారు. జూలైలో ఆందోళనకారులు పార్లమెంటును ముట్టడించడంతో ఉద్యమం హింసాత్మకంగా మారింది. ఉద్యమకారులపై పోలీసులు బాష్పవాయు గోళాలు ప్రయోగించారు. ప్రతిగా ఉద్యమాన్ని అణచివేస్తున్న పోలీసులపైకి ఆందోళనకారులు పెట్రో బాంబులు, రాళ్లు, యాసిడ్ బాటిళ్లు విసిరారు. దీంతో పరస్పరం ఉద్రిక్తతలు తారాస్థాయికి చేరాయి.

ఉద్యమాన్ని అణచివేయాలని చైనా ప్రభుత్వం ఉక్కుపాదం మోపడానికి పావులు కదుపుతుంటే, తమ ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం హాంకాంగ్ ప్రజలు ప్రతిఘటిస్తున్నారు. స్వయం పాలన కోసం జరుగుతున్న ఉద్యమంపై ప్రభుత్వం తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించినా ఉద్యమం చల్లారకపోగా మరింత తీవ్రమవుతోంది. పాత్రికేయులు, సామాజిక కార్యకర్తలు, సాధారణ ప్రజలు వేల సంఖ్యల్లో ఆందోళనల్లో

పాల్గొంటున్నారు. ఈ ఉద్యమాన్ని దొమ్మీలుగా, అల్లర్లుగా భావించవద్దని, అరెస్టు చేసిన ఉద్యమకారులను విడుదల చేయాలని, పోలీసుల హింసాకాండపై న్యాయ విచారణ జరిపించాలని, సార్వత్రిక ఓటుహక్కు కల్పించాలన్న డిమాండ్లతో నేటికీ ఈ నిరసనలు కొనసాగుతున్నాయి. హాంకాంగ్‌పై పెత్తనం కోసమే చైనా నేరస్తులను అప్పగించే బిల్లు పెట్టడానికి క్యారీ లామాపై ఒత్తిడి తెచ్చారని, ముందుగా చైనాలో ఉన్న ఆర్థిక నేరస్థులపై విచారణ జరిపి శిక్షించాలని డిమాండు చేస్తున్నారు. నవంబర్ మొదటి వారంలో ఉద్యమకారులు హాంకాంగ్ నగర రహదారులను వారం రోజులు దిగ్బంధించారు. రహదారులు చెత్తతో నిండాయి. ఈ క్రమంలో చైనా సైనికులు పారిశుద్ధ్య కార్మికుల వేషధారణల్లో హాంకాంగ్ విశ్వవిద్యాలయాలను టార్గెట్ చేసుకొని నిఘా పెట్టారు.

**ఇండోనేషియా**

అవినీతి నిర్మూలన కమిషన్ అధికారాల్ని తగ్గించే నూతన చట్టానికి వ్యతిరేకంగా ఇండోనేషియాలో వేలాది మంది సెప్టెంబర్ 23న నిరసనబాట పట్టారు. అలాగే కొత్తగా అమల్లోకి తెచ్చిన క్రిమినల్ కోడ్ ప్రజలను ఆగ్రహానికి గురి చేసింది. వివాహానికి ముందు యువతీయువకులు లైంగిక చర్యకు పాల్పడడం లేదా కలిసి జీవించడాన్ని తీవ్రంగా పరిగణిస్తూ కొత్త చట్టం చేశారు. చట్ట ఉల్లంఘనలకు ఆరు నెలల జైలు శిక్ష విధించేలా కఠిన నిబంధనలు పొందుపరిచారు. దీంతో ప్రజలు తిరుగుబావుటా ఎగరేశారు. ఉద్యమానికి తలొంచి నూతన చట్టాన్ని ఆమోదించే ప్రక్రియను తాత్కాలికంగా వాయిదా వేసింది. ఇండోనేషియా అధ్యక్షుడికి వ్యతిరేకంగా 1998లో జరిగిన ఉద్యమ రికార్డును ఇది తిరగరాసింది.

**ఇరాక్**

2003లో అమెరికా ప్రవేశించేంతవరకు ఆ దేశం శాంతి సౌభ్రాతృత్వాలతో పయనించింది. అప్పటివరకు విద్య, వైద్యం, సంక్షేమం అమలు చేయడంలో మధ్యప్రాచ్య దేశాలకు ఆదర్శంగా ఇరాక్ నిలిచింది. ఆ తరువాత పదహారు సంవత్సరాలుగా ప్రభుత్వ వర్గాల్లో అవినీతి, లంచగొండితనం పెరిగిపోయింది. విభజించు పాలించు సిద్ధాంతాన్ని షియా – సున్నీల మధ్య రగిలించిన అమెరికా సామ్రాజ్యవాద కీలుబొమ్మ ప్రభుత్వం ప్రజాసర్వీసుల నిర్వహణ లోపం, విద్యుత్ సరఫరాల్లో అస్తవ్యస్తం, ఆర్థికమాంద్యం, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడంలో విఫలమైంది. గత కొన్ని మాసాలుగా ఇరాక్ ప్రధానమంత్రి అదెల్ అబ్దుల్ మహ్దీకి వ్యతిరేకంగా సాగుతున్న ఆందోళనలు అక్టోబర్ 8న తాత్కాలికంగా విరమించుకున్నారు. తిరిగి అక్టోబర్ 29న ప్రారంభించారు. అబ్దుల్ మహ్దీ ఏడాది పాలన మౌలిక సమస్యలు పరిష్కరించడంలో విఫలమైంది. విరక్తి చెందిన పౌరులు తిరుగుబావుటా ఎగరేస్తున్నారు. పౌరసేవల అభివృద్ధి అంశంలో ప్రభుత్వ అసమర్థతపై వీరు ఆగ్రహిస్తున్నారు. దీనికి తోడు తీవ్రవాద నిరోధక సంస్థ చీఫ్‌గా లెఫ్టినెంట్ జనరల్ అబ్దుల్ వాహబ్ అల్–సాది తొలగింపు పైనా ప్రజలు మండిపడుతున్నారు. అక్టోబర్ 29న వీధుల్లోకి చేరుకొని ఆందోళనలు చేపట్టారు. ప్రభుత్వ కార్యాలయాలను ముట్టడించేందుకు ప్రయత్నించారు. ఇరాక్‌లోని షియాతే పవిత్ర స్థలం కర్బలా ప్రాంతంలో నిరసనలు ఉవ్వెత్తున ఎగిసిపడ్డాయి. నిరసనకారులపై పోలీసులు బలప్రయోగం చేశారు. లాఠీలు ఝుళిపించారు. భాష్పవాయుగోళాలు ప్రయోగించారు. కర్బలాలో చెలరేగిన అల్లర్లలో 18 మంది పోలీసు కాల్పుల్లో మరణించారు. వందలాది మంది గాయపడ్డారు.

నిరుద్యోగం రూపుమాపాలని లంచగొండితనం అంతమొందాలని, ప్రజల కనీస అవసరాలు తీర్చాలని డిమాండ్‌చేస్తూ నవంబర్ 1న లక్షలాది మంది సెంట్రల్ బాగ్దాద్ చేరుకున్నారు. బాగ్దాద్‌లోని తహ్రీర్ స్క్వేర్‌లో గుమికూడిన ఆందోళనకారులను చెదరగొట్టేందుకు భద్రతా బలగాలు భాష్పవాయువు, రబ్బరు బుల్లెట్లు ప్రయోగించాయి. పోలీసుల దాడుల్లో ఒక మహిళ మృతి చెందగా, 155 మందికి గాయాలయ్యాయని ఇరాక్ మానవ హక్కుల కమిషన్ తెలిపింది. విద్యా వాణిజ్య సంస్థలు మూత పడ్డాయి. వాహనాల రాకపోకలను నిరసనకారులు అడ్డుకున్నారు. గత నెలరోజులుగా జరుగుతున్న ఆందోళనలో కనీసంగా 250 మందికి పైగా ఆందోళనకారులు ప్రాణాలు కోల్పోయారు, వేలాదిమంది గాయపడ్డారు, 2 వేల మందిని ప్రభుత్వం అదుపులోకి తీసుకొంది. అవినీతిలో కూరుకుపోయిన ప్రభుత్వం రాజీనామా చేయాలని ఉద్యమకారులు డిమాండ్ చేస్తున్నారు.

**నెదర్లాండ్స్**

నెదర్లాండ్స్‌ను హాలెండ్ అని కూడ పిలుస్తారు. నెదర్లాండ్స్ రైతులు ప్రభుత్వం మీద కన్నెర్ర చేశారు. అక్టోబర్ 1న వేలాది మంది రైతులు ట్రాక్టర్లతో జాతీయ రహదారులపైకి వచ్చారు. మెగా ర్యాలీ చేపట్టారు. దీంతో దాదాపు 400 కి.మీ పొడవునా ట్రాఫిక్ స్తంభించింది. ఈ ర్యాలీ ఉట్రిచ్, హేగ్‌లో నిర్వహించారు. వాతావరణ కాలుష్యానికి రైతులే కారణమంటూ పార్లమెంటు సభ్యులు వ్యాఖ్యానించడం అన్నదాతలను అగ్రహోద్రులను చేసింది. పైగా కర్బన ఉద్గారాలకు హేతువు అవుతున్న కొన్ని పశుక్షేత్రాలను తక్షణమే మూసివేయాలని పాలకులు నిర్ణయించడం ఆందోళనకు కారణమైంది. మమ్మల్నే ఎందుకు తప్పుబడతారు. విమానాల వల్ల అత్యంత కాలుష్యం వెలువడుతోంది. మరి దానిపై ఎందుకు చర్యలు తీసుకోరు? పౌర విమానయాన శాఖ గురించి ఎందుకు మాట్లాడరు? బొగ్గుతో నడిచే విద్యుత్ థర్మల్ పరిశ్రమలు విడుదల చేస్తున్న కాలుష్యం గురించి ఎందుకు మాట్లాడరు? అంటూ రైతులు ప్రభుత్వాన్ని నిలదీశారు.

**పెరూ**

దేశ అధ్యక్షుడు మార్టిన్ విజ్‌కార్రా కాంగ్రెస్‌ను రద్దు చేయడాన్ని ఖండిస్తూ చట్టసభ్యులు రాజధాని లీమాలో అక్టోబర్ 1న ఆందోళనకు దిగారు. సంవత్సరకాలంగా కొనసాగుతున్న ఆందోళన పార్లమెంట్ రద్దుతో తీవ్రమైంది. అధ్యక్ష పదవి నుంచి వైదొలగాలంటూ రైట్‌వింగ్ చట్టసభ్యులు డిమాండ్ చేశారు. ఉపాధ్యక్షుడు మెర్సెడెస్ ఆరారోజ్‌ను అధికార పగ్గాలు చేపట్టాలని కోరారు. స్పీకర్ విజ్‌కార్రాను పదవి నుంచి తాత్కాలికంగా తొలగించి మెర్సెడెస్ ఆరాజోజ్‌కు తాత్కాలిక అధ్యక్ష బాధ్యతలు అప్పగించారు. అయినా ఆందోళనలు తీవ్రస్థాయికి చేరాయి. అయితే, అధ్యక్షుడు పదవినుంచి తప్పుకున్నారా? లేదా? అన్నదానిపై నేటికీ స్పష్టత రాలేదు. పెరూ పౌరులు రాజధాని నగరం లీమా నడివీధుల్లో ర్యాలీలు చేపట్టారు. అయితే ఈ క్రమంలో పోలీసులు మాత్రం అధ్యక్షుడు విజ్‌కార్రాకే విధేయులుగా వ్యవహరించారు. తిరుగుబాటును అణచేసేందుకు ప్రయత్నించారు.

**హైతీ**

హైతీలో పెరుగుతున్న ధరలు, ఆహారం, చమురు, విద్యుత్ సమస్యలతో సతమతం అవుతుండటం ప్రజల్లో అసహనాన్ని పెంచుతోంది. ప్రస్తుత ఆందోళనకు 2018 జూలైలో బీజం పడింది. ఇంధన సబ్సిడీలు

ఎత్తేయాలని నిర్ణయించడం జనాగ్రహానికి కారణమైంది. వెనిజులా చమురు సంస్థ పెట్రోకారిబ్ ఇచ్చిన రుణం 3.8 బిలియన్ డాలర్లు ప్రభుత్వం దుర్వినియోగం చేసిందని, దీనివల్ల దేశంలో ఆర్థిక సమస్యలు తలెత్తాయని, ప్రజల జీవన వ్యయం భారీగా పెరిగిపోయిందని నిరసనకారులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. అవినీతిపరులైన ప్రభుత్వ ప్రతినిధులతో పాటు అవినీతి అధికారులను కూడా విచారించి శిక్షించాలని డిమాండ్ చేస్తున్నారు. అవినీతిపరుడైన దేశాధ్యక్షుడు జోవెనెల్ మోయిస్‌ను గద్దె దించేందుకు ప్రతిపక్ష నేత జీన్ చార్లెస్ మోయిస్ నేతృత్వంలో నిరసనలు మొదలయ్యాయి. దీంతో కరీబియన్ దేశం హైతీలో అంతర్గత పోరు ముమ్మరమైంది.

సెప్టెంబర్‌లో ఆందోళనకారులు అధ్యక్షుడి రాజీనామా కోసం పట్టుబట్టారు. తాను రాజీనామా చేసే ప్రసక్తేలేదని జోవెనెల్ భీష్మించారు. దీంతో పెద్దసంఖ్యలో ప్రజలు రోడ్లపైకి వచ్చారు. దేశంలో సామాజిక, ఆర్థిక అస్థిరతకు కారణమైన మోయిస్‌కు దేశాన్ని పాలించే హక్కులేదని ప్రజలు నినదిస్తున్నారు. తక్షణమే ఆయన రాజీనామా చేయాలని డిమాండ్ చేస్తూ రాజధాని పోర్ట్ ఆవుప్రిన్స్ వీధుల్లో నిరసన తెలిపారు. ఆందోళన చేస్తున్న వారిపై పోలీసులు లాఠీచార్జీ చేశారు. బాష్పవాయువు ప్రయోగించారు. వార్తలు కవరు చేయడానికి వచ్చిన ఒక జర్నలిస్టును పోలీసులు కాల్చి చంపడంతో ఉద్యమం తీవ్రమైంది. ప్రజలు అనేక బ్యాంకులను తగులబెట్టారు. పోలీసులపై తిరుగబడ్డారు. పోలీసు కాల్పుల్లో ఇద్దరు ఉద్యమకారులు చనిపోయారు. ఈ సంఘటన తర్వాత మోయిస్ అజ్ఞాతంలోకి వెళ్లారు.

### ఈజిప్టు

అధ్యక్షుడు అబ్దుల్ ఫట్టా ఇల్-సిసి పాలనలో అవినీతి, బంధుప్రీతి, అణచివేత పెరిగింది. ఆయన అధికార పీఠం దిగాలన్న డిమాండ్ మరోసారి ఉవ్వెత్తున ఎగసిపడింది. సెప్టెంబర్‌లో ప్రభుత్వ వ్యతిరేక ఆందోళన మొదలైంది. అక్టోబర్ నాటికి ఆందోళన మరింత తీవ్రమైంది. దేశంలో మూడోవంతు ప్రజలు పేదరికంలో మగ్గుతున్నారు. ఆందోళనలకు మద్దతిస్తున్న ప్రతిపక్ష నేతలను అరెస్టు చేశారు. 2013 నుంచి ఇప్పటివరకు ప్రతిపక్ష పార్టీలకు చెందిన 60 వేల మంది కార్యకర్తలను జైళ్లలో అక్రమంగా నిర్బంధించారు. మీడియాపై ఆంక్షలు విధించారు. 2000 మంది నిరసన కారులను జైళ్లలో బంధించారు. ట్విట్టర్ వంటి సామాజిక మాధ్యమాలను నిషేధించారు. వార్తా సంస్థలను, వెబ్‌సైట్లను నిలిపివేశారు.

### సిరియా

కుర్దుల పోరాటం ఏళ్లకేళ్లు కొనసాగుతూనే ఉంది. స్వతంత్ర దేశం కోసం ఉద్యమిస్తూనే ఉన్నారు. తాజాగా ఐరాస కమిటీ నుంచి వారిని తప్పించడాన్ని నిరసిస్తూ ఆందోళన చేసారు. సిరియా రాజ్యాంగాన్ని తిరిగి లిఖించాలని డిమాండ్ చేశారు. మరోవైపు ఇస్లామిక్ తీవ్రవాదానికి వ్యతిరేక పోరాటం నేపథ్యంలో నిన్నటిదాకా అగ్రరాజ్యం అమెరికా కుర్దులకు మద్దతుగా నిలిచింది. ఇటీవల ఈశాన్య సిరియా నుంచి బలగాలను వెనక్కి రప్పించిన అగ్రరాజ్యం కుర్దులకు మరోసారి మొండి చెయ్యి చూపింది. దీంతో టర్కీ ప్రభుత్వం వీరిపై అణచివేత చర్యలను మొదలుపెట్టింది. అస్తిత్వం కోసం దశాబ్దాలుగా చేస్తున్న పోరాటం కుర్దుల పోరాటం ఎప్పటికి కొలిక్కి వస్తుందో అంతుబట్టని అంశంగా మారింది. అమెరికా నిర్ణయం వీరిని మరిన్ని కష్టాల్లోకి నెట్టింది.

### స్పెయిన్

స్పెయిన్ గత నాలుగేళ్లుగా రాజకీయ అస్థిరతలో ఉంది. ఎన్నికల్లో ఎవరికి మెజారిటీ రావడంలేదు. ఈ నాలుగేళ్లలో నవంబర్‌లో 10న జరిగిన ఎన్నికలు నాల్గవసారి కావడం విశేషం. 40 సంవత్సరాలుగా స్పెయిన్‌లో అంతర్భాగమైన కెటలోనియా స్వాతంత్ర్య పోరాటం చేస్తున్నది. ఈ పోరాటాన్ని ఫాసిస్టు భావజాలంతో ఉన్న వోక్స్ పార్టీ తీవ్రంగా వ్యతిరేకిస్తోంది. స్పెయిన్ ప్రభుత్వం కూడా కెటలోనియా ప్రజల ఆకాంక్షలు గుర్తించడం లేదు. 75 లక్షల జనాభా గల కెటలోనియా స్పెయిన్‌లో అర్ధ స్వాతంత్ర్యం గల దేశం. దానికి స్వంత భాష, పార్లమెంట్, జండా, జాతీయగీతం ఉంది. స్వంత పోలీసు కూడ ఉంది. కెటలోనియా నుంచే స్పెయిన్ ప్రభుత్వానికి అత్యధిక ఆదాయం పన్నుల రూపంలో వస్తున్నది. అయినా గత దశాబ్దకాలం కెటలోనియా స్వయం ప్రతిపత్తిని నిర్వీర్యం చేసే ప్రయత్నం జరుగుతోంది. అక్టోబర్ 26న బార్సిలోనాలో కెటలోనియా స్వాతంత్ర్య కోరుతూ మూడున్నర లక్షల మంది ఉద్యమకారులు నిరసన ప్రదర్శన నిర్వహించారు. దీనికి ప్రతిగా అక్టోబర్ 27న స్పెయిన్ సమైక్యతను కోరే 75 వేల మంది నిరసన తెలిపారు. ఈ సందర్భంగా పోలీసులకు ఆందోళకారుల మధ్య ఘర్షణ జరిగింది.

### కొలంబియా

1960 దశకంలో కొలంబియాలో సాయుధ గెరిల్లా పోరాటం ప్రారంభమైంది. ఈ పోరాటం 2013 వరకు సాగింది. ఈ ఉద్యమంలో 40,787 మంది గెరిల్లాలు, 1,77,307 మంది పౌరులు మరణించారు. 2016 జూన్‌లో సాయుధ గెరిల్లాలకు ప్రభుత్వానికి మధ్య శాంతి ఒప్పందం కుదిరింది. కొలంబియా ప్రభుత్వానికి అప్పుడు ఇప్పుడు బహుళజాతి సంస్థలు, అమెరికా ప్రభుత్వం తోడ్పాటు అందిస్తోంది. 2019 సెప్టెంబర్‌లో కొలంబియా అధ్యక్షుడు ఇవాన్‌ద్యూక్ 'రివల్యూషనరీ ఆర్మ్‌డ్ ఫోర్సెస్ ఆఫ్ కొలంబియా' (ఎఫ్ఎఆర్‌సి) పై సైనిక చర్యలు ప్రకటించాడు. ఎఫ్ఎఆర్‌సి నాయకుడు లూసియానో మారిన్ కొలంబియా ప్రభుత్వం శాంతి ఒడంబడికను ఉల్లంఘించినందుకు, ప్రభుత్వ వైఫల్యాన్ని నిరసిస్తూ తిరిగి సాయుధ పోరాటాన్ని ప్రారంభిస్తున్నట్లు 2019, అక్టోబర్ 29న ప్రకటించారు. మరోవైపు కొలంబియా ప్రభుత్వ ఆర్థిక, సామాజిక భద్రతా విధానాలను నిరసిస్తూ నవంబర్ 22న ఆ దేశ రాజధాని బోగోటోలో అధ్యక్షుడు ఇవాన్ ద్యూక్ ఇంటి ముందు కర్ఫ్యూ ఆంక్షలు అధిగమిస్తూ వేలాది మంది ప్రదర్శన నిర్వహించారు. పోలీసు కాల్పుల్లో ముగ్గురు ఆందోళన కారులు మృతిచెందారు. దేశవ్యాప్తంగా పదిలక్షల మంది విద్యార్థులు, అధ్యాపకులు నిరసన ప్రదర్శనలు చేశారు.

### ఫ్రాన్స్

దాదాపు సంవత్సరకాలంగా ఎల్లోవెస్ట్ ఆందోళన ప్రభుత్వాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది. ఇంధన చార్జీలకు వ్యతిరేకంగా పట్టణాల్లో నిరసనలు చెలరేగుతున్నాయి. ఎల్లోవెస్ట్ ఆందోళనకారులు, వారి ప్రత్యర్థులైన అరాచకవాద ప్రతిరూపాలైన బ్లాక్ బ్లోక్ నిరసనకారులు పరస్పరం హింసకు దిగారు. బయట నుంచి చూస్తే ఇది పెట్రోల్, డీజిల్ ధరల పెంపుపై ప్రజాగ్రహంలా కనిపిస్తుంది. కానీ లోతుల్లోకి వెళితే సమస్య మూలాలు అర్థమవుతాయి. కొన్నేళ్లుగా ప్రజల్లో నెలకొన్న తీవ్ర అసంతృప్తికి ఈ ఆందోళనలు ప్రతిరూపం. సమస్య తెలిసినా పాలకులు బలవంతంగా ముందుకు వెళ్లే ప్రయత్నం చేయడంతో ఫ్రాన్స్ భగ్గుమంది. ఏకంగా అధ్యక్షుడినే లక్ష్యంగా చేసుకొని ఆందోళనలు జరిగాయి. ఈ ఆందోళనల్లో పార్టీల జోక్యం నామమాత్రమే.

సామాజిక అసమానతలు భరించలేని ప్రజలే రోడ్లపైకి స్వచ్ఛందంగా వచ్చి ఆందోళనలు చేశారు. ఫ్రాన్స్‌లో ఎక్కువ శాతం కార్లు డీజిల్‌తో నడిచేవే. గత 12 నెలల్లో డీజిల్ ధర 23 శాతం పెరిగింది. 2018 నవంబర్‌లో డీజిల్‌పై హైడ్రోకార్బన్ సుంకాన్ని లీటరుపై 7.6 సెంట్ల వరకు ప్రభుత్వం పెంచింది. పెట్రోల్‌పైనా 3.9 సెంట్లు అధికంగా వసూలు చేస్తోంది. 2019 జనవరి ఒకటి నుంచి అదనంగా డీజిల్‌పై మరో 6.7 సెంట్లు, పెట్రోల్‌పై 2.9 సెంట్లు పెంచింది. ఇది మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి ప్రజలపై తీవ్ర ప్రభావాన్ని చూపింది. మరోవైపు పర్యావరణ పరిరక్షణ ఉద్యమం ఎగసిపడింది. లక్షలాది మంది పర్యావరణ కార్యకర్తలు పారిస్ వీధుల్లో ర్యాలీ తీశారు. డచ్ రైతుల మాదిరిగానే ఫ్రెంచ్ రైతులు కూడా దేశ వ్యవసాయ విధానంపై ఆగ్రహం చెందారు. జాతీయ రహదారుల దిగ్బంధనానికి దిగారు.

'మేము జీవన వ్యయం గురించి మాట్లాడుతుంటే మెక్రాన్ పర్యావరణం గురించి మాట్లాడుతారేంటీ' అన్న ఉద్యమకారుల మాటల్లో వాస్తవం కనబడుతుంది. ఈ విషయం అధ్యక్షుడు మెక్రాన్‌కు తెలియనిది ఏమీ కాదు. కొత్త పార్టీ పెట్టిన ఆయన 2017 ఎన్నికల సందర్భంగా మార్పులు తీసుకొస్తానని చెప్పి అధికారంలోకి వచ్చారు. తీరా అధికారంలోకి వచ్చాక సామాన్యుడిపై పన్నుభారం తగ్గించాల్సిందిపోయి కార్పొరేట్లకు మినహాయింపులు ఇచ్చారు. ప్రజా సంక్షేమ పథకాలకు కోత విధించారు. దీంతో తాము మోసపోయామనే భావన ప్రజల్లో ఏర్పడింది. అందుకే ఈ ఉద్యమం ఏ ఒక్క వర్గానికి పరిమితం కాలేదు. చివరికి విద్యార్థులు, అంబులెన్స్ సిబ్బంది కూడా పాల్గొన్నారంటే పరిస్థితి తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

గ్రీన్‌ట్యాక్స్ ఉపసంహరణ డిమాండ్‌తో పాటుగా సాంఘిక సామాజిక సమన్యాయం కోసం, వేతనాల పెంపుదలకు మెక్రాన్ పదవి నుండి తప్పుకోవాలనీ, జనరల్ అసెంబ్లీ రద్దుచేయాలని, శత కోటీశ్వర్లకు కల్పిస్తున్న ప్రభుత్వ రాయితీలను రద్దుచేయాలని, ఫ్రాన్స్ కోరుకుంటున్న మిలిటరీ వ్యవస్థ రద్దుకోసమై పోరాడుతున్నారు. యువ ఉద్యమకారులకు ఉద్యమ అనుభవరాహిత్యం, రాజకీయ ఆశయం లేకపోవటం, పరిపక్వం చెందని నాయకత్వ లేమితో ఉద్యమం ఏక్షణం ఏ మలుపు తిరగనుందో చెప్పలేని పరిస్థితుల్లో ఉంది. ఒకటి మాత్రం చెప్పగలం అది ప్రపంచీకరణ నేపథ్యంలో యూరోపియన్ యూనియన్ విధిస్తున్న సాంఘిక కోతలకు నిరసనగా యూరప్ అంతా ప్రజలు నిరసనలు తెలుపుతున్నారు. సంపద కేంద్రీకరణను నిరసిస్తున్నారు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థకు ప్రత్యామ్నాయ దిశగా అడుగులేనన్నది స్పష్టం.

**రష్యా**

రష్యా ఆర్థిక పరిస్థితి సజావుగా లేదు. ఇతర ధనిక దేశాల మాదిరే ఆర్థిక సంక్షోభ ప్రభావం తీవ్రంగా ఉంది. అభివృద్ధి రేటు గిడసబారింది. నాయకులపై అవినీతి ఆరోపణలు ఉన్నాయి. ఒక దశాబ్దంపాటు దాని ఆర్థిక పరిస్థితి నిరాశజనకమేనని బ్లూమ్‌బెర్గ్ విశ్లేషించింది. పుతిన్ జనాధారణ 30 శాతానికి పడిపోయిందని పలు నివేదికలు తెలుపుతున్నాయి. ఆయన పాలన నియంతృత్వంగా మారింది. ఆగస్టు 30న విద్యార్థులు ప్రజాస్వామ్యం కోరుతూ నిరసన ప్రదర్శన చేశారు. 2019 ఆగస్టు 13న మహిళలు సెప్టెంబర్ 8న జరిగే రష్యా డ్యూమా మండలి ఎన్నికలు స్వేచ్ఛాయుతంగా జరగాలని డిమాండ్ చేస్తూ మాస్కోలో ర్యాలీ నిర్వహించారు. ఈ నిరసనలు 2011-2012లో పుతిన్‌కు వ్యతిరేకంగా జరిగిన బోలోట్నాయ్ నిరసనలను గుర్తుచేశాయి.

2019 మేలో ఎన్నికల అధికారి రష్యా డ్యూమా మండలికి వేసిన ప్రత్యర్థుల నామినేషన్ పత్రాలను ఉద్దేశపూర్వకంగా తిరస్కరించడంతో ప్రభుత్వ వ్యతిరేక పార్టీలు అలెక్సీ నవాల్నీ నేతృత్వంలో నిరసన ప్రదర్శనలు చేశారు. అరెస్టయిన వారిపై విచారణకు వ్యతిరేకంగా 25వేల మంది మేలో ర్యాలీలో పాల్గొన్నారు. రష్యా అధ్యక్షుడు పుతిన్ విధానాలను నిరసిస్తూ గత మే, జూన్ మాసాలలో అరవై వేల మంది నిరసన కార్యక్రమాలు చేపట్టారు. ఆ సందర్భంలో పోలీసులపై తిరగబడ్డారు. ఈ కారణంగా వారిపై కేసులు నమోదయ్యాయి. విచారణ పేరుతో ఇప్పటికీ వేధింపులు సాగుతున్నాయి. ప్రతిపక్షాలు కూడా నిరసనకారులకు మద్దతు ప్రకటించాయి. తక్షణమే బాధితులపై కేసులు కొట్టివేసి, విడుదల చేయాలని డిమాండ్ చేశాయి. 2012లో పుతిన్ తిరిగి అధ్యక్షుడిగా ఎన్నికైన తర్వాత జరిగిన ఆందోళన కార్యక్రమాల్లో ఇదే అతిపెద్దది.

గత ఆరు మాసాలుగా రష్యాలో వ్లదిమీర్ పుతిన్ ప్రభుత్వం చేపట్టిన ప్రజావ్యతిరేక విధానాలు, ఆయన తీసుకుంటున్న చర్యల వల్ల పాలకపార్టీ యునైటెడ్ రష్యా పార్టీ గణనీయంగా ప్రజల నుండి అసమ్మతిని ఎదుర్కొంటున్నది. దేశ వ్యాప్తంగా ప్రజలు మార్పు కోసం ఆందోళనలు చేస్తున్నారు. ప్రజలపై ఆర్థిక భారం పెరిగింది. తీవ్ర ఇబ్బందులను వారు ఎదుర్కొంటున్నారు. ప్రభుత్వం పెన్షన్ పొందే వయస్సును పెంచింది. అధికార పార్టీ అధ్యక్షుడు డిమిట్రీ మెద్వెదేవ్ పట్ల కార్యకర్తల్లో తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతోంది. అయితే అధికార పార్టీ అధ్యక్షునితో తనకు సంబంధం లేదని పుతిన్ చెబుతున్నాడు. ప్రభుత్వం ప్రజానుకూల విధానాలు చేపట్టకుండా భారాలు మోపుతోందని ప్రజలు వాపోతున్నారు. ప్రజా అవసరాల కంటే సైనికశక్తిని పెంచడమే పుతిన్‌కు ప్రధానమైపోయింది.

**అమెరికా**

అమెరికాలో ఆర్థిక అంతరాలకు నిరసనగా అక్టోబర్ 2011లో చేపట్టిన వాల్‌స్ట్రీట్ ముట్టడిలో మేం 99 శాతం, మీరు 1 శాతం అని ప్రజలు నినదించారు. అంతరాలను ఈ ఉద్యమం ఎత్తిపట్టింది. ట్రంప్ అధికారం చేపట్టాక మైనార్టీలు, మహిళలు, కార్మికులు, వలస కార్మికులు ట్రంప్ ఆర్థిక రాజకీయ విధానాలకు వ్యతిరేకంగా ఎన్నో ప్రదర్శనలు, ఆందోళనలు పలు నగరాల్లో చేపట్టారు. వీటిలో లక్షలాది మంది పాల్గొన్నారు. ప్రధానంగా మహిళలు వేతనాలతో కూడిన కుటుంబ సెలవు, బిడ్డల పెంపకం సెలవులు, సమాన పనికి సమాన వేతనం వంటి హక్కుల కోసం నిరంతరం పోరాడుతూనే ఉన్నారు. అలాగే లెస్బియన్, గే, బై సెక్సువల్, ట్రాన్స్‌జెండర్ (ఎల్‌జిబిటి)లు, హిస్పానిక్, ఆఫ్రికన్ అమెరికన్లు, అమెరికన్ ఇండియన్లు, అలస్కా స్థానికులు, ఆసియన్లు, పసిఫిక్ ద్వీపవాసులు వంటి మైనార్టీలు హక్కుల కొరకు పోరాడుతున్నారు. మధ్య అమెరికా నుంచి అమెరికాకు వస్తున్న శరణార్థులు, వలస కార్మికులు అమెరికా-మెక్సికో సరిహద్దులో అమెరికా సైన్యంతో తలపడుతున్నారు. అమెరికా చెరలో 70 వేల మంది చిన్నారులు ఉన్నట్లు యుఎస్ రీసెర్చ్ అనే సంస్థ వెల్లడించింది.

ఇల్లీనాయిస్ రాష్ట్రంలోని చికాగో పట్టణంలో ఉపాధ్యాయులు ఉద్యమ బాట పట్టారు. పాతిక వేల మంది ఉపాధ్యాయులు తరగతి గదుల నుంచి బయటకొచ్చారు. ఆందోళన పథంలో అడుగులు వేస్తున్నారు. వీరికి సహాయ సిబ్బంది మద్దతు పలికారు. వారూ నిరసనలో భాగస్వాములయ్యారు. డిమాండ్ల సాధన కోసం అధికార వర్గాలతో సంప్రదింపులు కుదరలేదు. పరిస్థితి మరింత తీవ్రమైంది. వేతనాల పెంపు, పబ్లిక్ ఎడ్యుకేషన్స్ సిస్టమ్‌లో పారదర్శక పెట్టుబడుల విధానం, అనుకూల హౌసింగ్ స్కీం, సిబ్బంది పెంపు వంటి ప్రధాన డిమాండ్లతో ఆందోళనకు

దిగారు. మౌలిక వసతుల్లో అసమానతలు తొలగాలన్నదే మా న్యాయబద్ధమైన కోరిక అని చికాగో టీచర్స్ యూనియన్ అధ్యక్షుడు డేవిస్ గేట్స్ చెప్పారు. ఇది ఇన్‌కమ్‌కు సంబంధించిన సమస్య కాదు... ఔట్ కమ్‌కు సంబంధించిన అంశమని చెప్పారు.

ట్రంప్ జాత్యహంకారానికి, యుద్ధోన్మాదానికి, అధిక సైనిక వ్యయానికి, ఇరాన్ అణు ఒప్పందం నుంచి బయటికి రావడం, పర్యావరణ ఒప్పందం నుంచి వైదొలగడం వంటి అనుచిత చర్యల పట్ల ట్రంప్ పాలన పట్ల, విధానాల పట్ల అమెరికా పౌరులు తీవ్ర అసంతృప్తిని నిరసనల ద్వారా ఎప్పటికప్పుడు తెలియజేస్తున్నారు.

**పర్యావరణ ఉద్యమం**

పర్యావరణ పరిరక్షణ కోసం ప్రపంచ వ్యాప్తంగా యువతరం ఉద్యమిస్తోంది. ఆయా దేశాల్లో ప్రభుత్వాల మీద ఒత్తిడి తీసుకొస్తున్నది. ఈ తరహా ఆందోళనల తీవ్రత యూరప్‌లో ఎక్కువగా ఉంది. విద్యార్థులు పెద్దసంఖ్యలో పర్యావరణ సంరక్షణ పోరాటం చేస్తున్నారు. వాతావరణ మార్పుపై దశాబ్దాల తరబడి కనబరుస్తున్న నిష్క్రియాపరత్వంపై అమెరికా యువతగా మేం విసుగెత్తిపోయాం. అందుకే మా వంటి యువత కలిసికట్టుగా అమెరికాలోని పాఠశాలల నుంచి బయటికొచ్చి సమ్మె చేస్తున్నాం. పెరుగుతున్న ప్రపంచ ఉష్ణోగ్రతలు, పైపైకి వస్తున్న సముద్ర మట్టాలు, వాతావరణ వైపరీత్యాల కారణంగా ఏర్పడే పరిణామాలకు ఎక్కువగా ప్రభావితం అయ్యే మా తరానికి చెందిన లక్షలాది మంది దృష్టిని ఆకర్షించేందుకు మేం సమ్మె చేస్తున్నాం. అయితే ఇది ఒక్క అమెరికాలో మాత్రమే కాదు. ప్రతి ఖండంలోనూ డజన్ల కొద్దీ దేశాలకు చెందిన విద్యార్థులందరూ కలిసి మొదటిసారిగా చేస్తున్న సమ్మె ఇది అని అంటున్నారు.

స్వీడన్‌కు చెందిన పర్యావరణ కార్యకర్త గ్రెటా థంబెర్గ్ యువతరానికి ఆదర్శంగా నిలుస్తున్నారు. అని గళమెత్తుతూ గతేడాది కాలం నుంచి ఈమె పదునైన ప్రసంగాలతో ప్రజలను, సమాజాన్ని చైతన్యం చేస్తోంది. మరోవైపు ఉద్గారాల నియంత్రణ చర్యలు చేపట్టాలంటూ ప్రభుత్వాలను డిమాండ్ చేస్తోంది. ఈ ఏడాది 15 మార్చిన 80 దేశాల్లో విద్యార్థులు పర్యావరణ ఆందోళన చేపట్టారు. ప్రధాన నగరాల్లోని వీధుల్లో ర్యాలీ తీశారు. ఫ్రైడే ఫర్ ఫ్యూచర్ నినాదంతో కదంతొక్కారు. వాతావరణ మార్పులపై తక్షణమే స్పందించకుంటే భావితరాలకు మనుగడలేదంటూ లండన్‌లో ఎక్స్టింక్షన్ రెబెలియన్ (ఎక్స్ఆర్) గ్రూపు భారీ స్థాయిలో నిరసనోద్యమానికి దిగింది. అంతర్జాతీయంగా 6 కోట్ల మంది రోడ్డెక్కారు. వాతావరణ మార్పులపై ఈ తరహా ఉద్యమం ప్రపంచంలో ఇదే అతిపెద్దది.

మనం నివసిస్తున్న జీవావరణంలోకి శిలాజ ఇంధన పరిశ్రమలు దశాబ్దాల నుంచి అత్యుష్ణ వాయు ఉద్గారాలను వదలిపెడుతున్నాయి. వాతావరణ మార్పు గురించి ముప్పై సంవత్సరాల క్రితమే వాతావరణ శాస్త్రవేత్త జేమ్స్ హాన్సెన్ అమెరికన్ పార్లమెంట్‌ను హెచ్చరించారు. ప్రపంచ వ్యాప్తంగా ఉష్ణోగ్రతల పెరుగుదలకు సంబంధించి అంతర్ ప్రభుత్వ సంస్థ తాజాగా ఒక నివేదిక విడుదల చేసింది. వాతావరణ మార్పు పర్యవసానాలు మరింత ఘోరంగా దిగజారకుండా అడ్డుకోవడానికి మనకు 11 సంవత్సరాల వ్యవధి మాత్రమే ఉందని ఆ నివేదిక చెప్తోంది. 2030 తరువాత ఉష్ణోగ్రత పెరుగుదల భూ మండలం ప్రమాదానికి గురవుతుందన్న శాస్త్రవేత్తల హెచ్చరికలు దృష్టిలో ఉంచుకుని మేం సమ్మె చేస్తున్నాం అని నిరసనకారులు అన్నారు.

పైన పేర్కొన్న దేశాల్లోనే కాకుండా ఆఫ్రికాలో అల్జీరియా, సూడాన్, అమెరికా ఖండంలో బొలివియా, అర్జెంటినా, కొలంబియా, యూరప్‌లో చెక్ రిపబ్లిక్, ఆసియాలో సౌదీ అరేబియా, లెబనాన్, పాకిస్తాన్, కజకిస్తాన్ దేశాల్లో పాలకులు అనుసరిస్తున్న ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా, హక్కుల హననానికి వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు కొనసాగుతున్నాయి.

**ముగింపు**

ప్రపంచ వ్యాపితంగా గత మూడు దశాబ్దాలుగా సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ (ఎల్‌పిజి) విధానాలను ప్రభుత్వాలు అనుసరిస్తున్నాయి. ప్రపంచ దేశాల్లో తలెత్తుతున్న ఆర్థిక సంక్షోభాలకు ప్రధాన కారణం అభివృద్ధి జరగక కాదని, పెరుగుతున్న వృద్ధి అంతా కార్పొరేట్ల చేతుల్లోకి వెళ్తుందని నిరుద్యోగుల గళమెత్తుతున్నారు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ సృష్టిస్తున్న ఆర్థిక మాంద్యాలకు ప్రత్యామ్నాయంగా దేశాలలోని సంపదను మెజారిటీ ప్రజలైన రైతులు, కార్మికులు ప్రజలు వైపు మళ్లాలని ఉద్యమిస్తున్నారు. సరళీకృత ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా ప్రభుత్వాలను మార్చటానికి చిలే, అర్జెంటీనా, ఈక్వేడార్, లెబనాన్‌లో ప్రజలు ముందుకు వస్తున్నారు. మునుముందు సాంఘిక కోతలకు వ్యతిరేకంగా మరిన్ని దేశాల ప్రజలు ఉద్యమించనున్న ఉద్యమ వాతావరణం స్పష్టంగా కనిపిస్తోంది.

ఈ పోరాటాలను విడివిడిగా చూస్తే ఆయా సమస్యలపైనా, ఆయా ప్రభుత్వాల విధానాలకు వ్యతిరేకంగా జరిగినట్టు కనిపిస్తుంది. కానీ తరచి చూస్తే అన్నిటి వెనుకా ఉన్న అసలు కారణం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలని విదితమవుతోంది. 2008లో ప్రారంభమైన ప్రపంచ ఆర్థిక సంక్షోభం క్రమంగా విస్తరిస్తూ నేడు తీవ్రరూపం దాలుస్తోంది. ప్రపంచం మరో ఆర్థిక మాంద్యంలోకి జారుకుందని ఆర్థికవేత్తలు హెచ్చరిస్తున్నారు. ఆర్థిక సంక్షోభం వల్ల ప్రజల్లో ఏర్పడిన అసంతృప్తి వారిని ఉద్యమాల వైపుకు నడిపిస్తోంది. రైతులు, కార్మికులు, యువకులు, మహిళలు ఈ ఉద్యమాల్లో ప్రధానంగా కనిపిస్తున్నారు. అయితే, అసంతృప్తిని ఉపయోగించుకుని గతంలో అనేక చోట్ల మితవాద, మతవాద, జాత్యహంకార రాజకీయ శక్తులు అధికారంలోకి రావడానికి ప్రజలను జాతి, వర్ణ, మత అస్తిత్వాల ప్రాతిపదికపై చీలగొట్టడానికి ప్రయత్నించాయి. కానీ నేటి ఉద్యమాలు ఈ అస్తిత్వాలను అధిగమించి విస్తృత ప్రజా తిరుగుబాట్లుగా ముందుకొస్తున్నాయి. అయితే ఒక పటిష్టమైన నాయకత్వం, స్పష్టమైన ప్రత్యామ్నాయ విధానాలు లేకుండా సోషల్ మీడియా ప్రచారం ద్వారా ఉవ్వెత్తున లేస్తున్న ఈ ఉద్యమాలకు పరిమితులు కూడా ఉన్నాయి.

ఇవాళ పెట్టుబడిదారీ విధానం వ్యవస్థాపరమైన సంక్షోభంలో ఉంది. అమెరికా, యూరప్, జపాన్ తదితర పారిశ్రామిక దేశాల ఆర్థిక అభివృద్ధి రేటు పడిపోతోంది. సంవత్సరం సంవత్సరానికి మరింత దిగజారిపోతున్న. మరోవైపు చరిత్రలో ఎన్నడూ లేని విధంగా ఆర్థిక అసమానతలు పెరుగుతున్నాయి. అవి సంక్షోభం నుంచి బయట పడుతున్నామని చెప్పడం హాస్యాస్పదంగా ఉంది. 2008 నుంచి నెలకొన్న సంక్షోభం పెట్టుబడిదారీ విధాన క్షీణతకు సంకేతం. దీనికి పరిష్కారం పెట్టుబడిదారీ వ్యవస్థను మార్చడమే. పెట్టుబడిదారీ విధానం తన మరణం కొరకు నిరీక్షించదు. తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి అనాగరికంగా, నిర్దయతో వ్యవహరిస్తోంది. దాన్ని కూల్చవలసింది శ్రమ జీవులే. అయితే ఈ పోరాటాలకు రాజకీయ, చారిత్రక దృక్పథం అలవడేలా చేయగలిగే విప్లవ నాయకత్వం అభివృద్ధి కావడమనేదే అత్యంత కీలకాంశం. అదే నేటి చారిత్రక, రాజకీయ సంధికాలంలో అత్యంత ప్రాధాన్యతగల విషయంగా ముందుకు వస్తోంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# శ్రామికవర్గ వెలుగు దివ్వె ఫ్రెడరిక్ ఎంగెల్స్

***ఎంగెల్స్ జన్మించి నవంబర్ 28కి రెండు వందల ఏళ్లు అవుతున్న సందర్భంలో, దోపిడివర్గ మూలాలను తెలిపి దాని నుంచి విముక్తినిచ్చే సిద్ధాంతాన్ని అందించడంలో ఎంగెల్స్ చేసిన కృషిని వివరిస్తున్నారు బి. రామకృష్ణ***

మానవ చైతన్యం, ఆలోచనలే మానవ ఆచరణను నిర్ణయిస్తాయని చెప్పడాన్ని పూర్వపక్షం చేసి మానవ ఆచరణ, అవసరాలే ఆలోచనలను చైతన్యాన్ని ప్రభావితం చేస్తాయని చెప్పిన అగ్రగణ్యుల్లో మార్క్స్‌తో పాటు ఎంగెల్స్ ప్రముఖ వ్యక్తి. 1820 నవంబర్ 28న బార్మెన్ పట్టణం ప్రష్యా (జర్మనీ) లో జన్మించాడు. ఎంగెల్స్ తండ్రి నూలు దారాన్ని ఉత్పత్తి చేసే పరిశ్రమకు యజమాని. తన కుమారుడు పారిశ్రామికవేత్త కావాలని ఆశించాడు. తండ్రి కోరికకు విరుద్ధంగా ఎంగెల్స్ పరిశ్రమలు, పారిశ్రామిక వేత్తలు, పెట్టుబడిదారుల పుట్టుక, ఎదుగుదల, వారి సంపద వెనుక నలిగిపోతున్న కార్మికుల జీవితాలను అధ్యయనం చేసి ప్రపంచ శ్రామిక వర్గానికి తమ జీవితాలను మార్చుకునే మహత్తరమైన సిద్ధాంత ఆయుధాలను అందించాడు.

1842లో ఇంగ్లండ్‌లోని పారిశ్రామికాభివృద్ధి దానికి పూర్వ రంగంలో ఉన్న కార్మికవర్గ స్థితిగతులపై 21 నెలల పాటు అధ్యయనం చేశాడు. కార్మిక వాడల్లో పర్యటించి, కార్మిక కుటుంబాలతో కలిసి ఆనాటి దుర్భర పరిస్థితులను స్వయంగా పరిశీలించి అధికార రికార్డులు, వార్తా పత్రికల్లోని సమాచారాన్ని విశ్లేషించి 24 ఏళ్ల వయస్సులోనే 'ఇంగ్లండులో కార్మికవర్గ స్థితిగతులు' అనే గ్రంథాన్ని 1845లో జర్మన్ భాషలో రాశాడు. ఈ గ్రంథం అప్పటి అనేక రాజకీయ తాత్విక ఆలోచనల్లోని డొల్లతనాన్ని బయట పెట్టింది. ఇది తరువాత 1848లో వెలువడిన కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికను మార్క్స్‌తో పాటు కలిసి రాయడానికి పిండ రూపంలో ఉపయోగపడింది. ఇప్పుడు మనం గమనిస్తున్న ఆర్థిక మాంద్యం గురించి దాని మూలాలను ఈ గ్రంథంలో ఎంగెల్స్ 175 ఏళ్ల క్రితమే వివరించాడు. పెట్టుబడిదారులకు లాభాలు కావాలి. ఇష్టమొచ్చిన రీతిలో ఉత్పత్తి పెంచడమే కావాలి. ఆ ఉత్పత్తులను అమ్ముకోవాలి. అవి సమాజానికి అవసరమా, అనవసరమా అనేకంటే వాటి ద్వారా సొమ్ము చేసుకోవడమే కావాల్సింది. వాటిని ఉత్పత్తి చేయడానికి పెట్టుబడిదారుల మధ్య పోటీ ఉంటుంది. ఆ పోటీలో శ్రామికుల శ్రమను చవకగా కొల్లగొట్టడానికి పెట్టుబడిదారులు ఎన్నో దారుణాలకు ఒడిగడతారు. కార్మికులకు హుందా అయిన, గౌరవప్రదమైన జీవితం గురించి వారికి అవసరం లేదు. డిమాండ్ కంటే సప్లయ్ అధికమవడం, మితిమీరిన ఉత్పత్తి పోగుపడడం, మార్కెట్ సరుకులతో నిండిపోవడం, ప్రతి పదేండ్లకూ సంక్షోభాలు దాపురించడం ఈ విధంగా ఒక విష చక్రం ప్రత్యక్షమవుతుంది. ఒకవైపు ఉత్పత్తి సాధనాలు, ఉత్పాదిత వస్తువులు మితిమీరి నిల్వ ఉండిపోతాయి. మరోవైపు కార్మికులు మితిమీరి నిరుద్యోగులై జీవితావసరాలు పొందలేక పోతారని ఎంగెల్స్ వివరించాడు.

శ్రామికుల పిల్లలు, వారి విద్య, ఆరోగ్య పరిస్థితులు, జీవన ప్రమాణ స్థితిగతులు ఇంగ్లండులో ఎంత దుర్భరంగా ఉండేవో వివరిస్తూ కార్మికుల శ్రమ పునాదులపై నిలుచుని విపరీతమైన సంపదను ఆర్జించి కార్మికులను దుర్భరమైన, నికృష్టమైన పరిస్థితుల్లోకి నెట్టివేసిన తీరును, సమాజంలోని కార్మికుల శ్రమను దోచుకుంటున్న పరిశ్రమల అధిపతుల వ్యవస్థ వికృత రూపాన్ని ఎంగెల్స్ బట్టబయలు చేశాడు. సోషలిజం స్థాపించబడడమే ఈ సమస్యకు పరిష్కారమని తెలిపాడు. అప్పటికే ప్రచారంలో ఉన్న ఊహాజనిత సోషలిజం, ఇతర అపసవ్య సోషలిస్టు భావనలను ఖండిస్తూ మార్క్స్ ఆవిష్కరించిన చరిత్రంతా వర్గ పోరాటాల చరిత్రే, పెట్టుబడికి శ్రమకు మధ్య ఉన్న సంబంధం అదనపు విలువల ఆధారంగా శాస్త్రీయ సోషలిజాన్ని వివరిస్తూ 1880లో 'సోషలిజం: ఊహాజనితం, శాస్త్రీయం'ను రచించాడు.

వానరుడు నరుడుగా మారే క్రమంలో శ్రమ నిర్వహించిన పాత్ర అనే వ్యాసాన్ని 1876లో ఎంగెల్స్ రచించాడు. ఇది మొదటి సారిగా Die Neue Zeit పత్రికలో 1895-96లో ప్రచురించబడింది. ఇందులో శ్రమ అద్భుతమైన పాత్రను, వ్యక్తిగత, అలాగే సామూహిక మానవ శ్రమ ప్రకృతిపై వేసిన ప్రభావం దాని ఫలితంగా మానవుల్లో కలిగిన మార్పులు ఎలా పరస్పరం ఒకదానికొకటి మార్చుకుంటున్నాయో వివరించాడు. ఒక రకంగా శ్రమయే మానవున్ని సృష్టించిందని స్పష్టం చేశాడు. ఈ వ్యాసం మానవ శారీరక, మేధో వికాసానికి కారణమైన జీవ భౌతిక కారకాలను విశదీకరించి శాస్త్రీయ ఆలోచనలను కలిగించింది. జంతువు బాహ్య ప్రకృతిని కేవలం వినియోగించుకుంటుందని, కేవలం తన ఉనికి ద్వారా దానిలో మార్పులు తెస్తుందని, కాని మనిషి తన చర్యల ద్వారా తన ప్రయోజనాలను ప్రకృతి నెరవేర్చేలాగా చేసి, దాని పైన ఆధిపత్యం చెలాయిస్తాడు. ఇలా మనిషికి, ఇతర జంతువులకు తేడాను వివరిస్తాడు. అయితే ప్రకృతిపై సాధించిన విజయాలు భవిష్యత్‌లో మానవులపై వ్యతిరేక ప్రభావాలను చూపుతుందని చెబుతాడు. ప్రకృతి నియమాలను అర్థం చేసుకుని వాటిని సరిగ్గా అమలు పరచడంలోనే మానవాభ్యుదయం ఆధారపడి ఉందని, ప్రకృతితో తమ ఏకత్వాన్ని అనుభూతి చెందడంతో పాటు దానిని గ్రహిస్తారని ఎంగెల్స్ వివరిస్తాడు.

నూలు వడికే యంత్రాలు, మారమగ్గాలు, స్టీమ్ ఇంజన్ వంటి శాస్త్ర, సాంకేతిక ఆవిష్కరణలు అప్పటి సమాజాల్లో తెచ్చిన ముఖ్యమైన మౌలిక మార్పులను వివరిస్తూ అవి ఆధిపత్య శక్తులకు, పారిశ్రామిక అధిపతుల చేతుల్లో చేరి కార్మికుల శ్రమను దోచుకోవడానికి దోహదపడిన తీరును సామాజిక సంబంధాల్లో వస్తున్న మార్పులను సృజనాత్మకంగా వివరించాడు. మానవుని జీవితాన్ని పెంచి పోషించే వస్తువుల ఉత్పత్తి,

తరువాత వాటి మారకం, ఇదే మొత్తం సామాజిక వ్యవస్థకంతకూ పునాది అని, చరిత్రలో ఆవరించిన ప్రతి సమాజంలోనూ సంపద ఏ విధంగా విభజింపబడుతుందో, ఏయే వర్గాలుగా లేదా తరగతులుగా సమాజం విభజించబడుతుందో, ఏవేవి ఉత్పత్తి చేయబడుతున్నాయో, అవెలా ఉత్పత్తి చేయబడుతున్నాయో, ఎలా మార్పిడి చేయబడుతున్నాయో అనేవాటి మీద సామాజిక వ్యవస్థ ఆధారపడి ఉంటుంది. ఇలా సమాజంలో జరిగే మార్పులన్నింటికీ, రాజకీయ విప్లవాలన్నిటికీ అంతిమ కారణాలు మనుషుల మెదడుల్లో కాక, శాశ్వత సత్యం, శాశ్వత ధర్మం అనే భావాలకు సంబంధించిన వారి గాఢ అవగాహనల్లో కాకుండా ఉత్పత్తి పద్ధతులలోను, మారకపు పద్ధతుల్లోనూ వచ్చే మార్పుల్లో గోచరిస్తాయని ఎంగెల్స్ చెబుతాడు.

చారిత్రక పరిణామాలకంతకు మూల కారణం, ముఖ్యమైన చారిత్రక ఘటనలన్నింటికీ చోదకశక్తి సమాజపు ఆర్థిక పురోగతి అని ఉత్పత్తి పద్ధతుల్లో, మారకపు పద్ధతుల్లో వచ్చే మార్పులేనని, తత్ఫలితంగా సమాజం విభిన్న వర్గాలుగా విభజన చెందడమేనని, ఆ వర్గాల మధ్య జరిగే పోరాటాలేనని చెప్పేది చారిత్రక భౌతికవాదం అని చెబుతాడు. కమ్యూనిస్టు సిద్ధాంతానికి తాత్విక ప్రాతిపదిక అయిన చారిత్రక భౌతికవాద దృక్పథాన్ని 1844లో 'జర్మన్ ఐడియాలజీ' అనే గ్రంథంలో మార్క్స్‌తో కలిసి ఎంగెల్స్ వివరిస్తాడు. సామాజిక మార్పుకు చోదక శక్తులుగా కార్మిక వర్గాన్ని గుర్తించి వర్గాలుగా ఉన్న సమాజాన్ని మౌలికంగా మార్చడానికి కావల్సిన సిద్ధాంతాన్ని ప్రాతిపాదించి కార్మిక వర్గానికి అసలు సిసలు మిత్రునిగా ఎంగెల్స్ నిలిచాడు.

జీవ శాస్త్రానికి డార్విన్ పరిణామవాద సిద్ధాంతం ఎంత ముఖ్యమో, ఆర్థిక శాస్త్రానికి మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతం ఎంత ముఖ్యమో నాగరిక ప్రజలలో కనిపించే తండ్రి హక్కు గణాలకు పూర్వం తల్లి హక్కు గణాలు ఉండేవని మోర్గన్ కనిపెట్టిన అంశం అంతే ముఖ్యమని, కుటుంబ వ్యవస్థ చరిత్రను మొట్టమొదటిసారిగా లూయిస్.ఎచ్. మోర్గన్ బయట పెట్టాడని ఎంగెల్స్ చెబుతాడు. 'ప్రాచీన సమాజం' అనే గ్రంథాన్ని రాసిన ఇతని గురించి చెబుతూ లిఖిత చరిత్రకు వెనుక ఉన్న ఆదిమ చరిత్రలోని ప్రధానాంశాలను కనిపెట్టి వాటిని క్రమ రూపంలో పెట్టడం ద్వారా మోర్గన్ గొప్ప సేవ చేశాడని, ప్రాచీన గ్రీకు, జర్మన్ చరిత్రలో అపరిష్కృతంగా మిగిలిపోయిన అతి ముఖ్యమైన సమస్యలకు సమాధానాన్ని ఆయన ఉత్తర అమెరికన్ ఇండియన్ ప్రజా సమూహాల్లో లైంగిక సంబంధాల ప్రాతిపదికన ఏర్పడిన జీవన పద్ధతుల్లో కనుక్కున్నాడు. అదే ఆయన గొప్పతనంలోని విశేషం అని అంటాడు ఎంగెల్స్. ఆయన ఒక్క రోజు పాటు కూర్చుని రాసేసిన పుస్తకం కాదని, దాదాపు నలభై ఏళ్ల పాటు కుస్తీపట్టి, విషయాలన్నీ కరతలామలకం చేసుకుని రాసిన పుస్తకం 'ప్రాచీన సమాజం' అనీ, అది మన రోజుల్లో వెలువడిన యుగపరివర్తక ప్రభావం కలిగిన పుస్తకాలలో అదొకటనీ ఎంగెల్స్ అభిప్రాయ పడ్డాడు.

జీవ పరిణామ సిద్ధాంతాన్ని చార్లెస్ డార్విన్ శాస్త్రీయ ఆధారాలతో అందించినట్లుగానే ఎంగెల్స్ సమాజ పరిణామ క్రమాన్ని 'కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక' అనే గ్రంథంలో వివరించాడు. ఈ గ్రంథాన్ని లూయిస్.హెచ్. మోర్గన్ పరిశోధనలను దృష్టిలో పెట్టుకుని ఎంగెల్స్ రాశాడు. ఇది మానవ సమాజ పరిణామ క్రమాన్ని ఆధారాలతో వివరించిన మార్క్సిస్టు సైద్ధాంతిక, ప్రామాణిక గ్రంథం.

మార్క్స్, ఎంగెల్స్‌ల పరస్పర మేధో వికాసానికి వారి మధ్య జరిగిన చర్చలు, ఆలోచనల ఘర్షణలు ఎంతో దోహదపడి శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతానికి పునాదులు వేశాయి. శ్రామిక వర్గానికి సిద్ధాంత ఆయుధాన్ని, ఆచరణాత్మక మార్గాన్ని నిర్దేశించాయి. మార్క్స్, ఎంగెల్స్‌ల సమ్మిళిత ఆలోచనా ధారల ప్రభావం అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘం ఏర్పడడానికి దోహదపడింది. వీరిద్దరి ఉమ్మడి అవగాహనతో ఎంగెల్స్ తయారు చేసిన దానికి చిన్న చిన్న మార్పులు మార్క్స్ చేయగా 'కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక' రూపుదిద్దుకుంది. ఈ ప్రణాళిక వర్గరహిత సమాజం రూపొందడానికి తద్వారా ప్రపంచ వ్యాప్తంగా దోపిడీ పీడనలు లేని నూతన సమాజం, నూతన ఉన్నత మానవుడుగా రూపొందడానికి కావల్సిన మార్గాన్ని చూపింది.

అసమానతల సమాజాలు ఎక్కడున్నా అక్కడ ఎంగెల్స్ ఆలోచనలు ఉంటాయనడంలో సందేహ పడాల్సింది లేదు. అశాస్త్రీయమైన మతాలను, వాటి పునాదులను, దోపిడీ పీడనల మూలాలను అవగాహన చేసుకోవడానికి, వాటిని ఎదుర్కోవడానికి సైద్ధాంతిక పరికరాలను అందించి శ్రామికవర్గం చేతుల్లో ఆయుధం అయ్యాడు. శ్రామికవర్గం రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుని, తద్వారా పెట్టుబడిదారుల చేతుల్లోని సామాజిక ఉత్పత్తి సాధనాలను యావత్తు సమాజపు ఆస్తిగా మార్చి వేస్తుంది. ఈ చర్య ద్వారా శ్రామికవర్గం ఉత్పత్తి సాధనాలన్నింటినీ వాటి పెట్టుబడిదారీ స్వభావం నుండి విముక్తం చేసి వాటి సామాజిక స్వభావం సంపూర్ణంగా వికసించేందుకు స్వేచ్ఛను కల్పిస్తుంది. అలా శ్రామికవర్గ విప్లవం వర్గాల అస్థిత్వాన్ని రద్దు చేస్తుందని, అటువంటి విప్లవ ఆవశ్యకతను ఎంగెల్స్ తాను 1880లో రాసిన 'శాస్త్రీయ సోషలిజం'లో వివరిస్తాడు.

ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద శక్తులు విస్తరిస్తున్న నేపథ్యంలో మనదేశంలో హిందూ ఫండమెంటలిజం ఫాసిజంగా వికృత పోకడలు పోతున్న సందర్భంలో ఎంగెల్స్ ఆలోచనలు, సిద్ధాంతాలు, ఆచరణలకు ఎంతో ప్రాధాన్యత ఉన్నది. మార్క్స్‌తో కలిసి ఆయన రూపొందించిన శాస్త్రీయ సోషలిజం ఆవశ్యకత ఎంతగా ఉన్నదో అర్థం చేసుకోవచ్చు. ఎంగెల్స్ జన్మించి 2019 నవంబర్ 28 నాటికి రెండు వందల ఏళ్లు అవుతున్న సందర్భంలో ఆయన్ను స్మరించుకోవడం, ఆయన అందించిన ఆలోచనాధారాలను గుర్తుకు తెచ్చుకోవడం అంటే ఆయన కాంక్షించిన వర్గరహిత సమాజం కోసం జరుగుతున్న కృషిలో పాలుపంచుకోవడం కూడా.

మార్క్సిజంను రష్యాలో లెనిన్ అన్వయించి, దాన్ని మరింతగా ముందుకు తీసుకెళ్లాడు. అటు తర్వాత చైనాలో మావో మార్క్సిజానికి మరిన్ని ఆచరణా మార్గాలను, సిద్ధాంతాలను జోడించి దానికి మెరుగులు దిద్దాడు. రష్యా, చైనాల్లో విప్లవాలు విజయవంతం కావడం, ఆ తర్వాత వాటి వైఫల్యాల నేపథ్యంలో ప్రపంచంలో అనేక ప్రాంతాలలో జరుగుతున్న సోషలిస్టు ఉద్యమాలు వాటి అనుభవాలను గమనంలో పెట్టుకుని భారతదేశంలోని భౌతిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితులకు అనుగుణంగా ఎంగెల్స్ మార్క్స్‌తో కలిసి అందించిన సిద్ధాంతాల వెలుగులో మార్క్సిజాన్ని మరింత ముందుకు తీసుకుపోతూ, సృజనాత్మకంగా అన్వయించవల్సిన చారిత్రక అవసరం నేడుతున్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# డేవిడ్ హార్వే: పెట్టుబడి - 7 ప్రధాన వైరుధ్యాలు

*పెట్టుబడిదారీ వ్యవస్థ తనలోని పదిహేడు అంతర్ వైరుధ్యాల వల్ల పతనం దిశగా పయనిస్తుందని డేవిడ్ హార్వే చేసిన విశ్లేషణలోని ఏడు ప్రాథమిక వైరుధ్యాలను వివరిస్తున్నారు* **రమేష్ పట్నాయక్**

(...గత సంచిక తరువాయి భాగం)

**ఉత్పత్తి అయిన సరుకు, అమ్మకం ద్వారా దాని విలువను పొందడం అనేవాటి మధ్య ఉన్న వైరుధ్యపూరితమైన ఐక్యత**

ఈ అధ్యాయం శీర్షికలో డేవిడ్ హార్వే 'వైరుధ్యపూరితమైన ఐక్యత' అన్న పదబంధాన్ని ఉపయోగించాడు. నిజానికి వైరుధ్యం అన్నా లేక వైరుధ్యపూరిత ఐక్యత అన్నా మార్క్సిస్టు పదజాలంలో ఒకటే. మార్క్సిజం ప్రకారం వైరుధ్యం అన్న మాటలోనే విరుద్ధ శక్తుల మధ్య ఐక్యత అన్న భావన ఉంది. తత్వశాస్త్ర పరిభాషలో వైరుధ్యం అన్న పదాన్ని విరుద్ధ శక్తుల మధ్య ఐక్యత అన్న అర్థంలోనే వాడతారు. మరొక విధంగా చెప్పాలంటే ఘర్షణపడుతూనే కలసి ఉండడం, ఆ క్రమంలో గుణాత్మక మార్పుకు దారితీయడం అన్న భావన ఉంది. ఈ గతితార్కిక భావనను డేవిడ్ హార్వే మొదటి అధ్యాయంలోనే వివరించాడు. మనం కూడా ఈ భావనను సోదాహరణంగా పరిశీలించాము. కాబట్టి వైరుధ్యపూరిత ఐక్యత అన్న పదబంధాన్ని వైరుధ్యం అన్న అర్థంలోనే పరిశీలిద్దాం.

ఈ అధ్యాయంలో ప్రధానంగా చర్చిస్తున్న సమస్య బాగా పరిచయం ఉన్నదే. సహాయ సరకులతోపాటు ముడిసరుకుల విలువ + భవనాలు, యంత్రాల తరుగుదల విలువ + కార్మికుల శ్రమశక్తి విలువ లేదా అవసర శ్రమ విలువ + కార్మికుల జోడించిన అదనపు శ్రమ విలువ = తయారైన సరుకు విలువ అని మనకు తెలుసు. క్లుప్తంగా ఇదే మార్క్స్ చెప్పిన విలువ సిద్ధాంతం. తయారైన సరుకు అమ్ముడు కాకపోతే లాభం కాదుకదా అసలు కూడా రాదు. ఉత్పత్తి అయిన సరుకు అమ్ముడు పోవడం లాభం పొందడానికి మరల పెట్టుబడి పెట్టడానికి మరల సరుకుల ఉత్పత్తి చేయడానికి ముందస్తు షరతు అన్న విషయం తెలిసిందే. సరుకు ఉత్పత్తి అవడానికి, సరుకు అందులో ఉన్న విలువకు అమ్ముడు పోవడానికి మధ్య వైరుధ్యాన్నే ఈ అధ్యాయంలో డేవిడ్ హార్వే పరిశీలిస్తున్నాడు.

డబ్బు – సరుకు – డబ్బుః అనే పెట్టుబడి వృత్త చలనంలో (సర్క్యులేషన్‌లో) డబ్బు నుండి డబ్బుఃకు పెట్టుబడి పరిమాణాత్మక పెరుగుదల అనేది పెట్టుబడి ప్రయాణంలో రెండు చెక్ పాయింట్స్ వద్ద నమోదు అవుతుంది అంటాడు డేవిడ్ హార్వే. మొదటి చెక్ పాయింట్ ఉత్పత్తి ప్రక్రియలో పని స్థలంలో (ముందుగా ఉన్న విలువలకు అదనపు విలువ కలవడం ఇక్కడే జరుగుతుంది కదా), రెండవ చెక్ పాయింట్ సరుకు బజారులో అమ్ముడు పోయిన దగ్గర అని హార్వే వివరిస్తాడు. మొదటి చెక్ పాయింట్ వద్ద లాభానికి కారణమైన అదనపు విలువ కలుస్తుంది కాని, అది గర్భితంగానే ఉంటుంది. అయితే అది రెండవ చెక్ పాయింట్ వద్ద మాత్రమే అంటే మార్కెట్‌లో అమ్ముడుపోయిన దగ్గర మాత్రమే బయట పడుతుంది, చేతికి వస్తుంది. పై విషయాలను నమోదుచేసిన తరువాత డేవిడ్ హార్వే 'పెట్టుబడి వృత్త చలనంలో ఉత్పత్తి, సరుకు అమ్మకాల మధ్య ఐక్యత వైరుధ్యభరితమైనది అంటాడు, ఈ వైరుధ్యం తీసుకునే ప్రధాన రూపాలను పరిశీలిస్తాడు,

'మార్క్స్ తన పెట్టుబడి మొదటి సంపుటిలో లాభం అనేది అదనపు విలువ నుంచే పుడుతుందని స్పష్టంచేయడంపై దృష్టిపెట్టాడు. అందుకే సరుకులు అమ్ముడు పోవడం, లాభం చేతికి రావడం (రియలైజేషన్) అన్న విషయాలను పక్కన పెట్టాడు. .....' అని డేవిడ్ హార్వే అంటాడు. అలాగే డేవిడ్ హార్వే తన విశ్లేషణను కొనసాగిస్తూ పెట్టుబడిదారుడు కార్మికునికి వీలయినంత తక్కువ వేతనం ఇస్తూ, వీలైనంత ఎక్కువ పనిచేయించుకోవడానికి ప్రయత్నిస్తాడని, అందుకై కార్ల్‌మార్క్స్ చెప్పినట్లు పనిచేస్తున్న కార్మికులకు పనిదొరకని నిరుద్యోగ కార్మికుల రిజర్వ్ సైన్యం ఎప్పుడూ పోటీలో ఉండేటట్లు చూసుకుంటాడని, అవసరమైతే కార్మికులను నిరుద్యోగులుగా మార్చడానికి ఉత్పత్తి సాంకేతిక స్థాయిని పెంచుతాడని లేదా స్వంత దేశంలో కార్మికులను నిరుద్యోగులుగా ఉంచుతూ ఇతర దేశాలలో ఉన్న చౌకైన కార్మిక శక్తిని దోపిడీ చేస్తాడని చెప్తాడు. అలాగే రాజ్యాన్ని, పాలక వర్గ రాజకీయ శక్తులను ఉపయోగించి కార్మికుల సమిష్టి పోరాటాలను, వారి సమిష్టి బేరమాడే శక్తిని దెబ్బతీస్తాడని చెప్తాడు. అదేవిధంగా ఈ మొత్తం చర్యల ఫలితంగా ఒకవైపు సంపద పోగుపడుతుందని, రెండవ వైపు కార్మికులలో పేదరికం పెరగడమే కాక వారి ఆత్మాభిమానం క్షీణించడం, వారి సామాజిక శక్తి క్షీణించడం మనకు కనిపిస్తాయని చెప్తాడు. ఈ విషయాలు ఒక వామ పక్ష కార్యకర్తలకు కొత్తవి కావు.

కార్ల్‌మార్క్స్ తన పెట్టుబడి రెండవ సంపుటిలో అనేకమైన ఇబ్బంది కలిగించేవి అయినా సుమారుగా సరియైనవి అయిన సూత్రీకరణలు చేసాడని డేవిడ్ హార్వే రాస్తాడు. పెట్టుబడి మొదటి సంపుటిలో అదనపు విలువ, శ్రమ దోపిడీ, లాభం మూలాలపై కేంద్రీకరించిన మార్క్స్ రెండవ సంపుటిలో ఉత్పత్తి అయిన సరుకులు అమ్ముడుపోవడం విషయమై ఉత్పత్తి ప్రక్రియలో పుట్టిన అదనపు విలువ లాభంగా చేతికి రావడంపై (వాస్తవీకరణ – రియలైజేషన్) ఎక్కువ కేంద్రీకరించాడని ....మొదటి సంపుటిలో ఉత్పత్తి ప్రక్రియను చర్చించినప్పుడు మార్క్స్ సరుకులు అమ్మడం సమస్య కాదన్నట్లు, రెండవ సంపుటిలో వాస్తవీకరణ సమస్యను విశ్లేషించినప్పుడు ఉత్పత్తి ప్రక్రియలో ఏ సమస్య లేనట్లు మార్క్స్ భావిస్తాడని డేవిడ్ హార్వే రాస్తాడు. మార్క్స్ అలా చేయడం తప్పని డేవిడ్ హార్వే రాయలేదుకాని, అటువంటి ధ్వని అయితే కనిపిస్తుంది. ఏ శాస్త్ర రంగంలోనైనా ఒక విషయాన్ని విశ్లేషించడానికి మిగిలిన విషయాలను స్థిరంగా తీసుకోవడం జరుగుతుంది. 'స్థిర ఉష్ణోగ్రత పీడనాల వద్ద' అని భౌతిక శాస్త్రంలో చెప్పిన పద్ధతిలో సామాజిక శాస్త్రాలలో ప్రయోగాలు చేయడం సాధ్యం కాదుగాని, అనేక పరిమితులున్నప్పటికి. సామాజిక శాస్త్రాలలో కూడా ఒక దృగ్విషయాన్నిగాని లేదా ఒక ప్రక్రియను గాని విశ్లేషించడానికి అంశాలవారీ పరిశీలన చేయడం, ఒక అంశాన్ని పరిశీలించినప్పుడు మిగిలినవి స్థిరంగా ఉన్నాయని భావించడం జరుగుతుంది. మార్క్స్ ఉత్పత్తి ప్రక్రియను పరిశీలించినప్పుడు అలాగే

సరుకుల అమ్మకం గురించి పరిశీలించినప్పుడు ఉత్పత్తి ప్రక్రియ గురించి చర్చించకపోవడంలో తప్పు పట్టవలసింది ఏమీలేదు. రెండు విశ్లేషణల మధ్య పొసగని పరిస్థితి ఉంటేనే ఎత్తి చూపవలసి ఉంటుంది. మార్క్సులో ఒక అసంబద్ధతను చూపించడానికి డేవిడ్ హార్వే ప్రయత్నించినట్లు కనిపిస్తుంది. అందుకే ఇంత దూరం రాయవలసి వచ్చింది. మరొక్క విషయం కింద చూద్దాం.

ఉత్పత్తి అయిన సరుకు మార్కెట్‌లో అమ్ముడు పోయినా అమ్ముడు కాకపోయినా ఉత్పత్తి ప్రక్రియలో అదనపు విలువ ఉత్పత్తి అయిన మాట వాస్తవమే. అయితే ఆ సరుకు మార్కెట్‌లో అమ్ముడు పోలేదంటే దాని అర్థం ఆ సరుకు కొరకు జరిగిన శ్రమ "సామాజిక శ్రమ విభజనకు లోబడిన శ్రమ కాదని అంటే సామాజిక శ్రమ కాదని' తెలుస్తున్నది. ఆ శ్రమ సామాజిక శ్రమ కానప్పుడు ఆ ఉత్పత్తి ప్రక్రియయే ప్రశ్నార్థకమవుతుంది. ఈ వివరణ పరంగా మాత్రమే ఉత్పత్తి అయిన సరుకులకు అమ్మకానికి , వాటి ఉత్పత్తి ప్రక్రియకు సంబంధం ఉంది. పెట్టుబడిదారులు సరుకులు అమ్ముకోలేకపోయేది సంక్షోభ సమయాలలోనే. సంక్షోభ సమయాలలో సర్వం తల్లక్రిందులవుతుంది. సంక్షోభ సందర్భాన్ని మార్క్సు ఏంగెల్స్‌తో కలసి రచించిన కమ్యూనిస్టు మ్యానిఫెస్టోలో అద్భుతంగా చిత్రించాడు. ధరలు విపరీతంగా పడిపోతాయంటాడు, పరిశ్రమలు మూతపడతాయంటాడు. మొత్తం సమాజం ఒక ఆటవిక దశలోనికి ప్రవేశిస్తుందంటాడు. ఇక్కడ డేవిడ్ హార్వేగాని, మనంగాని సంక్షోభ సందర్భాన్ని వివరించడం లేదు, సంక్షోభ కారణాలను మాత్రమే పరిశీలిస్తున్నాం. సంక్షోభ సందర్భంలోకాక సాధారణ సందర్భాలలో మనం ఉత్పత్తి ప్రక్రియను, రియలైజేషన్ ప్రక్రియను వేరువేరుగా పరిశీలించడంలో ఇబ్బంది ఏమీ లేదు. పెట్టుబడిదారీ వ్యవస్థకు అభివృద్ధి దశ, సంక్షోభ దశ అనే రెండు దశలున్నాయన్న విషయం మనం విస్మరించరాదు. సంక్షోభం ఎప్పుడు వస్తుందన్న విషయాన్ని తరువాత పంక్తులలో పరిశీలిద్దాం.

మార్క్సు పెట్టుబడి మొదటి సంపుటిలో చెప్పినట్లు కార్మికులు ఉత్పత్తి చేసిన అదనపు విలువ దోపిడీ చేయడానికి పెట్టుబడిదారులు వివిధ మార్గాలుపయోగిస్తే కార్మికుల కొనుగోలు శక్తి తగ్గిపోతుంది. అప్పుడు పెట్టుబడిదారుడు ఉత్పత్తి అయిన సరుకులను అమ్ముకోవడంలో సమస్యనెదుర్కొంటాడని అంటాడు డేవిడ్ హార్వే. దీనినే ఒక అసంబద్ధంగా డేవిడ్ హార్వే చూపిస్తాడు. కార్ల్‌మార్క్సు ఈ విషయాన్ని పరిశీలించకపోయిందేమీ లేదు. ఈ విషయాన్ని పరిశీలించకపోతే పెట్టుబడి మార్కెట్ సంక్షోభాలను ఎదుర్కొంటుందని మార్క్సు చెప్పడానికే లేదు. ఈ విషయాలను నేను పెట్టుబడిదారీ వ్యవస్థ – శ్రమ దోపిడీ – మార్కెట్ సంక్షోభం అన్న నా మరొక రచనలో వివరించాను. ఇక్కడ క్లుప్తంగా చెప్పుకుందాం. ఒక దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రారంభమైనప్పుడు (ఇంగ్లండునే ఉదాహరణగా తీసుకుందాం) పెట్టుబడిదారులు, కార్మికులే కాక భూస్వాములు ఇతర పాత పాలక వర్గాలు, అలాగే, అస్వతంత్ర రైతులు, గిల్డు యజమానులు ఉంటారు. వారు పరిశ్రమలలో తయారైన వస్తువులను కొనుగోలుచేస్తూ ఉంటారు. దీర్ఘకాలంపాటు వారు పెట్టుబడిదారీ పరిశ్రమలకు మార్కెట్ అందిస్తారు. అందుకే సరుకులు అమ్ముడు పోకపోవడం అనే సంక్షోభం ప్రారంభంలో రాదు. అయితే, పైన సూచించిన పాత పాలక, పీడిత వర్గాలన్నీ క్రమంగా దివాళా తీస్తాయి. ఆ వర్గాల వారిలో అత్యధికులు దివాలా తీసి కార్మికులు అయిపోతారు. కొద్దిమంది పెట్టుబడిదారులుగా 'ఎదుగుతారు'. ఈ మొత్తం క్రమంలో పరిశ్రమలు చాలా విస్తరించి ఉంటాయి. ఈ క్రమం ఒక కొలిక్కి వచ్చిన తరువాత సదరు దేశంలో కార్మికులు, పెట్టుబడిదారులు తప్ప మరొక వర్గం ఉండదు. కార్మికులు కనీస వేతనాలు మాత్రమే పొందతారు. కాబట్టి వారు ఉత్పత్తిచేసిన సరుకులను వారు కొనుగోలు చేయలేరు. పెట్టుబడిదారులు ఒక పరిమితికి మించి సరుకులు వాడలేరు. కార్మికులు కొనలేక తినలేరు. పెట్టుబడిదారులు తినలేక కొనలేరు. అందుకే అభివృద్ధిచెందిన దేశాలలో సరుకులు అమ్ముడుపోని పరిస్థితి ఏర్పడుతుంది. దీనినే మనం మార్కెట్ సంక్షోభం అంటాము. ఒక దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థ తొలి దశలో ఉన్నప్పుడు ఈ సమస్య రాదు. దీర్ఘకాలం అభివృద్ధిచెందిన తరువాత మార్కెట్ లేకపోవడం అనే ఈ సమస్య వస్తుంది. ఈ సమస్యను ఎదుర్కొనే దేశాలు అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలు. ఈ సమస్యను ఎదుర్కొన్న తొలితరం పెట్టుబడిదారీ దేశాలు మొదటి శతాబ్దాలలో సరుకులు ఎగుమతి చేయడం ద్వారా, తరువాత శతాబ్దాలలో ఫైనాన్స్ పెట్టుబడిని ఎగుమతి చేయడం ద్వారా అలాగే ఇతర దేశాలపై యుద్ధాలను రుద్ది తమ ఆయుధ ఉత్పత్తులకు మార్కెట్ సంపాదించుకోవడం ద్వారా తమ మార్కెట్ సంక్షోభాన్ని పరిష్కరించుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. ఈ చర్యలలో వేటికీ అవకాశం లేనప్పుడు లేదా తగినంత అవకాశం లేనప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభంలో పడుతుంది. ఎన్ని సంక్షోభాలు వచ్చినా శ్రమ దోపిడీ తగ్గించి కార్మికుల వేతనాలను పెంచి వారికి తన సరుకులను అమ్ముకుందాం అని పెట్టుబడిదారులు భావించరు. మార్క్సు చెప్పినా చెప్పకపోయినా, డేవిడ్ హార్వే అంగీకరించినా అంగీకరించకపోయినా పెట్టుబడిదారులు కార్మికులకు వీలయినంత తక్కువ చెల్లించడానికి వారితో వీలయినంత ఎక్కువ పనిచేయించుకోవడానికి ప్రయత్నిస్తారు. ఫలితంగా కార్మికుల కొనుగోలు శక్తి పరిమితంగానే ఉంటుంది. పెట్టుబడిదారులు తమ సరుకులను కార్మికేతరులకు, ఇతర దేశాలకు అమ్మడానికి ప్రయత్నిస్తారు. సాఫల్య, వైఫల్యాలు అనేక అంశాలపై అధారపడి ఉంటాయి. కీన్స్ యుగంలో అమెరికాలో, ఇప్పటికీ స్కాండినేవియన్ దేశాలలో శ్రమదోపిడీ తక్కువగా ఉండడానికి పెట్టుబడిదారులు జ్ఞానోదయం పొందడం ఎంతమాత్రం కారణం కాదు. (డేవిడ్ హార్వే అలా అనలేదనుకోండి) అందుకు ఆర్థిక కారణాలతో పాటు అనేక రాజకీయ కారణాలు పనిచేసాయి, పనిచేస్తున్నాయి.

డేవిడ్ హార్వే తన విశ్లేషణలో భాగంగా ఒక చోట రాసింది ఎలా ఉందంటే మార్క్సు పరస్పర విరుద్ధమైన వాదనలు చేసాడని చెప్పినట్లు ఉంది. పెట్టుబడి మొదటి సంచికలో చెప్పిన వాదనలకు వ్యతిరేకమైన వాదనలను రెండవ సంపుటిలో చేసాడని చెప్పినట్లు ఉంది. మార్క్సు పెట్టుబడి రెండవ సంపుటిని, మూడవ సంపుటిని స్వయంగా సంస్కరించలేకపోయాడు. ఆ పని ఏంగెల్స్ చేసిన విషయం తెలిసిందే. ఏంగెల్స్ పూర్తి స్వాతంత్ర్యాన్ని తీసుకోలేదు కదా. ఆ కారణంగా వివిధ సందర్భాలలో కొన్ని అసంబద్ధతలు మిగిలి ఉండవచ్చు. అది వేరే విషయం. మార్క్సు రచనలో మిగిలిపోయిన అసంబద్ధతలు మౌలికమైనవి కావని వివరిస్తూ ఎన్నో విశ్లేషణలు ప్రచురితమైనాయి. ప్రస్తుత విషయానికి వస్తే, 'పెట్టుబడిదారులు సరుకులు అమ్ముకోలేకపోవడం' అనే సమస్య పెట్టుబడిదారీ వ్యవస్థ మౌలిక సమస్య అని మనకు తెలుసు. అటువంటి విషయంలో మార్క్స అసంబద్ధంగా రాయడం ఎలా సాధ్యమవుతుంది. తానే తన గ్రంథాన్ని సంస్కరించి ఉంటే విషయం మరింత సరళంగా, అసంబద్ధతలు లేనిదిగా ఉండేది. అంతకంటే మరేమీ కాదు. ఒక దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థ, ప్రధానంగా తన అభివృద్ధికర దశను దాటిన తరువాత, అంటే దేశ జనాభానంతా కార్మికులు, పెట్టుబడిదారులు అనే రెండు వర్గాలుగా మార్చిన తరువాత, ఉత్పత్తి శక్తులనన్నింటినీ కేంద్రీకరించిన తరువాత ఒక అసంబద్ధతలోనికి ప్రవేశిస్తుంది. రెండవ

# డిసెంబరిస్ట్ సైనిక తిరుగుబాటు పరిణామాలు - 2

***జారిజం మీద 1825 డిసెంబర్‌లో జరిగిన తిరుగుబాటు రెండు వందల సంవత్సరాల తర్వాత కూడా ప్రభావం చూపుతున్నదంటున్నారు ఎన్.వి.యస్. నాగభూషణ్***

*(...గత సంచిక తరువాయి భాగం)*

ఎంతకీ తిరుగుబాటు దారులనుంచి చర్చలకు సిద్ధపడే సంకేతాలు వెలువడనందున, నీకొలస్1 తన తరపున తిరుగుబాటు దారులతో సంభాషణలు జరపడం కోసం సెయింట్‌పీటర్స్‌బర్గ్ నగర గవర్నరైన జనరల్ మిహాయిల్ మిలోరదోవిచ్‌ని పంపించాడు. వారు ప్రతిజ్ఞ చేయడానికి అంగీకరిస్తారేమోనని ఒప్పించడానికి. అయితే పీటర్ ది గ్రేట్ విగ్రహం పక్కనే ఉన్న డిసెంబరిస్ట్ సభ్యుడైన ప్యోత్ర్ కఖోవ్‌స్కీ రాజీచర్చలను మొగ్గలోనే తుంచెయ్యాలని నిర్ణయించుకుని, మిలోరదోవిచ్‌ని అల్లంత దూరంలో ఉండగానే కాల్చివేశాడు. మిలోరదోవిచ్ అక్కడికక్కడే చనిపోయాడు. దాంతో నీకొలస్ తిరుగుబాటు దారులపై కాల్పులు జరపాల్సిందిగా ప్రభుత్వానుకూల దళాలకు ఆజ్ఞలు జారీచేశాడు స్వయంగా. మొదట గుర్రపు దళాలు కాల్పులకు సిద్ధపడినప్పుడు, తిరుగుబాటు దళాలు 3,000 మంది తప్పించుకు పారిపోయేందుకు ప్రయత్నించారు. వారి వెంటపడిన గుర్రపు దళాలు మంచులో ముందుకు వెళ్లేందుకు శాయశక్తులా ప్రయత్నించాయి గానీ, మంచులో గుర్రాల కాళ్లు జారి పడిపోతుండడంతో ఆ దళాలు తమ ప్రయత్నాన్ని విరమించి వెనక్కు వచ్చాయి. దాంతో నీకొలస్ ఫిరంగి దళానికి చెందిన రెండు యూనిట్లను పురమాయించాడు. ఇంకేముంది భారీ ఫిరంగులు ప్రయోగించిన అగ్నిగోళాలకు తిరుగుబాటు దారుల శరీరాలు ముక్కలు ముక్కలుగా వెదజల్లబడి, రక్తం ఏరులై ప్రవహించింది. అధికారిక లెక్కల ప్రకారమే 1200 మందికి పైగా తిరుగుబాటు దారులు చనిపోయారు. వారితో పాటు తిరుగుబాటు జరుగుతున్న సమయంలో ఏం జరుగుతుందో చూద్దామన్న కుతూహలంతో అల్లంత దూరాన ఉండి జరిగే తతంగాన్ని ఆసక్తితో వీక్షిస్తున్న జనంలో కొందరు కూడా మరణించడం జరిగింది. ఈ విధంగా సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో గల ఉత్తరాది సొసైటీ జరిపిన తిరుగుబాటు వార్త, దక్షిణాది సొసైటీకి చేరడానికి కొంత సమయం పట్టింది. చెర్నిగోవ్ దళాలు 'సెర్గీ ఇవనోవిచ్', 'మురావియేవ్ – అపోస్తోల్'ల నాయకత్వంలో డిసెంబర్ 29న తిరుగుబాటుకి సమకట్టి, 1826 జనవరి 3న వాసిల్కోవ్ గ్రామీణ ప్రాంతాల నుంచి అస్తవ్యస్తంగా ముందుకు సాగి, 'మొతోవిలోవ్కా', 'బెలయ్యా జెర్కోవ్'ల మీదుగా 'ఝితోమిర్' చేరగానే వారిని విధేయ దళాలు చుట్టుముట్టి, 'త్రిలేసీ' అనే చోట కాల్పులు సాగించాయి. 1826

చెక్ పోస్టువద్ద (మార్కెట్) ఎవరికైతే తన సరుకులు అమ్ముకోవాలో వారిపై మొదటి చెక్‌పోస్టు వద్ద (పరిశ్రమలో) తీవ్రమైన శ్రమ దోపిడీని రుద్ది కొనుగోలు శక్తి లేనివారిగా చేసేస్తుంది. ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ అసంబద్ధత లేదా వైరుధ్యం. ఒక పెట్టుబడిదారీ దేశంలో కార్మిక వర్గం, వేతన మధ్యతరగతి జీవుల కాని ఇతర పాత సమాజపు వర్గాలు ఉన్నన్నాళ్లూ ఇది మార్కెట్ సంక్షోభంగా ఘనీభవించదు. ఇతర దేశాలలో సరుకులు అమ్ముకోగలిగినన్నాళ్లూ కూడా ఇది సంక్షోభంగా ఘనీభవించదు. ఈ రెండూ సాధ్యం కానప్పుడు మొదటి చెక్ పోస్టు (పరిశ్రమ) వద్ద దోపిడీ రెండవ చెక్‌పోస్టు (మార్కెట్) వద్ద సంక్షోభంగా పరిణమిస్తుంది. డేవిడ్ హార్వే పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉన్న వైరుధ్యాన్ని మార్క్స్ వాదనలలో ఉన్నట్లు చెప్పాడా అనిపిస్తుంది. డేవిడ్ హార్వే పెట్టుబడి వ్యవస్థ మొత్తం ప్రయాణాన్ని దాని అన్ని దశలను కాక అభివృద్ధిచెందిన దేశాలలో పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రస్తుత పరిస్థితిని పరిశీలిస్తున్నట్లైతే, ప్రధానంగా ఇతర దేశాలకు సరుకులనుగాని లేదా పెట్టుబడిని గానీ ఎగుమతి చేయడానికి అనుకూలమైన పరిస్థితులులేని అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ వ్యవస్థను పరిశీలిస్తున్నట్లైతే, వస్తుగతంగా తన మొదటి చెక్ పోస్టు – రెండవ చెక్‌పోస్టు వాదన మార్క్స్ వాదనతో సరిపోలుతుంది. అయితే మార్క్స్ పైన సూచించిన నిర్దిష్ట సందర్భంతో సహా పెట్టుబడిదారీ వ్యవస్థ అన్ని దశలకు వర్తించే సిద్ధాంతాన్ని రూపొందించాడు.

అమెరికా, పశ్చిమ ఐరోపా, ఆస్ట్రేలియా, జపాన్ వంటి అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలు, ఎక్కడైతే పెట్టుబడి పూర్వ వర్గాలన్నీ (భూస్వాములు, అస్వతంత్ర రైతులు, వృత్తికారులు వంటి భూస్వామ్య వ్యవస్థలో ఉండిన వర్గాలు) నశించిపోయాయో ఆ దేశాలు, ఇప్పుడు సరుకులు అమ్ముకోలేని సమస్యను ఎదుర్కొంటున్నాయి. అంటే మార్కెట్ సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నాయి. ఎంతగానో అభివృద్ధిచెందిన అమెరికా 2008లో అంత పెద్ద సంక్షోభాన్ని ఎదుర్కొంది. ఆ సంక్షోభం ఇప్పటికీ కొనసాగుతున్నది. ఇక్కడ ప్రధానంగా గుర్తించవలసిన విషయం ఏమంటే పెట్టుబడి శ్రమ దోపిడీ లేకుండా విస్తరించదు, బలపడదు. అయితే అదే పెట్టుబడి ఒక స్థాయికి ఎదిగిన తరువాత మార్కెట్ సంక్షోభానికి, ఇంకా అనేక సంక్షోభాలకు శ్రమదోపిడీయే కారణమవుతుంది. పెట్టుబడి ఆర్థిక వ్యవస్థ పుట్టుకతోనే సంక్షోభంలో పడదు. పెట్టుబడి మానవ సమాజ అభివృద్ధి క్రమంలో దీర్ఘకాలం అభివృద్ధికర పాత్ర పోషిస్తుందని, ఒకానొక అభివృద్ధి దశకు చేరిన తరువాత మాత్రమే అభివృద్ధి నిరోధకంగా తయారవుతుందనేది మార్క్స్‌చెప్పిన గతితర్కం. డేవిడ్ హార్వే వ్రాసిన దాంట్లో పెట్టుబడి తన పుట్టుక నుండి మార్కెట్‌లో సరుకులు అమ్ముకోలేని సంక్షోభం ఎదుర్కొంటుందనే అర్థం వస్తుంది. పెట్టుబడి యొక్క దీర్ఘ అభివృద్ధి దశను డేవిడ్ హార్వే పరిగణించినట్లు కనిపించదు. పెట్టుబడి మార్కెట్ సంక్షోభాన్ని మొదటినుండి ఎదుర్కోదు. అలా అయి ఉంటే అది ఇంత ఆర్థికాభివృద్ధి సాధించి ఉండేది కాదు. పెట్టుబడి వ్యవస్థ తన చారిత్రక పాత్ర పూర్తిచేసిన తరువాత మాత్రమే సంక్షోభాలను ఎదుర్కొంటుంది. డేవిడ్ వ్యాసంలో మనకు పెట్టుబడికి అభివృద్ధికర దశ, అభివృద్ధినిరోధక దశ ఉన్నట్లు అవగాహన ఏర్పడదు. (తదుపరి సంచికలో ఏడవ వైరుధ్యంపై విశ్లేషణ కొనసాగుతుంది)

*(రచయిత కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* వీ

జనవరి 15 నాటి ఈ యుద్ధంలో కేవలం 400 మంది విధేయ దళాలు ఫిరంగి కాల్పులకు తెగబడి, 800 మంది విప్లవ సైనికుల్ని పొట్టన బెట్టుకున్నారు. అటువైపు ఏ నష్టమూ లేదు. ప్రాణాలతో ఉన్న కొందరిని అరెస్టు చేసి పీటర్స్‌బర్గ్‌కు పంపారు. అక్కడ ఉత్తరాది సొసైటీ నాయకులతో పాటు విచారణను ఎదుర్కొన్నారు.

అసలు దక్షిణాది సొసైటీకి మొదటి దెబ్బే, డిసెంబరిస్ట్ విప్లవాన్ని మొదలెట్టడానికి ఒకరోజు ముందే తగిలింది. అంటే డిసెంబర్ 13నే. సొసైటీ ముఖ్య నాయకుడు, వ్యూహకర్త అయిన పావెల్ పెస్తెల్‌ని అరెస్టు చేశారు. ఆ తర్వాత మరికొందరు ముఖ్య నాయకుల్ని అరెస్టు చేశారు. దాంతో నివ్వెరపోయిన దక్షిణాది సొసైటీ అసలు తిరుగుబాటునే జరపలేకపోయి ఉండేది. కానీ దక్షిణాది సొసైటీలో సంయుక్త విప్లవ కార్యాచరణ గురించి 'స్లావుల ఐక్యతా సొసైటీ' (సొసైటీ ఆఫ్ యునైటెడ్ స్లేవ్స్) అనే ఒక స్లావ్ జాతీయవాద గ్రూపు, దక్షిణాది సొసైటీలోని కొందరిని ఎక్కడ ఉంచిందీ పసిగట్టి, ఆ ప్రాంతంపై దాడిచేసి, వారిని విడిపించింది. అయితే ఆ విడిపించిన వారిలో దురదృష్టవశాత్తు పావెల్ పెస్తెల్ లేడు. ఇలా విడుదల పొందిన వారిలో ఒకడైన 'సెర్గీ మురావ్యోవ్ – అపోస్తోల్' అనే అతడు తమ సొసైటీ జరపబోయే తిరుగుబాటుకి నాయకత్వం వహించేందుకు అంగీకరించాడు. తద్వారా దక్షిణాది సొసైటీ తిరుగుబాటులో తన వంతు పాత్రను నిర్వహించే అవకాశాన్ని దక్కించు కుందని చెప్పవచ్చు. నిజానికి ఈ దక్షిణాది సొసైటీ తిరుగుబాటులో ప్రధానంగా పాల్గొన్నది చెర్నిగోవ్ దళాలే. ఈ చెర్నిగోవ్ దళాలు స్లావుల ఐక్యతా సొసైటీకి చెందినవే. ఈ స్లావుల ఐక్యతా సొసైటీ, దక్షిణాది సొసైటీతో కేవలం నాలుగు నెలల ముందే 1825 సెప్టెంబర్‌లోనే ఐక్యతా కార్యక్రమం గురించి చర్చించి, అదే నెలలో దక్షిణాది సొసైటీతో విలీనమైంది. పోరాట సమయంలో తొలుత దక్షిణాది సొసైటీ 'వాసిల్కోవ్' సైనిక స్థావరాన్ని స్వాధీనం చేసుకోవడంలోనూ, ఆ తర్వాత విధేయ దళాలతో జరిగిన యుద్ధంలోనూ ఈ చెర్నిగోవ్ దళాలే అత్యంత క్రియాశీలంగా వ్యవహరించాయి. (ఈ దళానికి చెందినవారే యుద్ధా నంతరం పట్టుబడగా, వీరిలో ఎక్కువ మందికి సైబీరియా ప్రవాసంతో పాటు, కఠిన శ్రమ శిక్షను విధించారు). పట్టుబడ్డ వారిపై 1826 మే నెల దాకా విచారణ ప్రక్రియ సాగింది. విచారణలో ప్రతి ఒక్క ఖైదీనీ జార్ నీకొలస్1 స్వయంగా విచారించాడు. దాని ముఖ్య నాయకులు అయిదుగురిని–పావెల్ పెస్తెల్, కోంద్రాతి రిలేయేవ్ పోత్ర్ కఖోవ్‌స్కీ సెర్గీ మురావియేవ్–అపోస్తోల్ మిహాయిల్ బెస్తూఝెవ్–ర్యూమిన్‌లను నాలుగు ముక్కలుగా ఖండించడం ద్వారా మరణ శిక్షను అమలు చేయమని న్యాయ స్థానం ఆదేశించింది. అయితే జార్ నీకొలస్1 జోక్యం చేసుకొని, ఉరిశిక్ష ద్వారా మరణ శిక్షను అమలు చేయాల్సిందిగా ఆ ఆదేశానికి సవరణ చేశాడు. ఈ ఉరిశిక్షను సెయింట్ పీటర్‌బర్గ్‌లోని పీటర్ అండ్ పాల్ కోటలో 1826, జూలై 13న అమలు చేశారు.

తిరుగుబాటు సందర్భంగా ఒక అభిప్రాయం ప్రకారం 500కు పైగా డిసెంబరిస్ట్‌ల్ని అరెస్టు చేశారు. వారిలో కుట్రదారులు 121 మంది అని నిర్ధారించి, వారి ప్రభువంశ హోదాల్ని తీసివేసి, వారందరినీ సైబీరియాలోని వేర్వేరు ప్రాంతాల్లో గ్రూపులుగా విభజించి ప్రవాస శిక్షను యావజ్జీవితం విధించారు. వారందరికీ వివిధ సంవత్సరాల కఠిన శ్రమ శిక్షను విధించారు. వీరిలో పలువురికి మొదట మరణ శిక్షను విధించారు. కానీ నీకొలస్ కలిగించుకొని 20 సంవత్సరాల కఠిన ప్రవాస శిక్షను, సైబీరియా యావజ్జీవిత ప్రవాసంతో పాటు అనుభవించాల్సిందిగా మార్చాడు. (ఇలా మార్చడంలో పలు ఒత్తిళ్లు సన్నిహితులైనవారి నుంచీ, వివిధ ప్రభు వంశాల ప్రముఖుల నుంచీ వచ్చిన కారణంగా. అలా వీరు ఒత్తిడి చేయడానికి కారణం – శిక్షకు గురైన వారు తమ కుటుంబాల పిల్లలే అవడం వల్ల). సైబీరియాలో కఠిన శ్రమ శిక్ష అంటే ఖైదీల కాళ్లకూ, చేతులకూ సంకెళ్లతో సైబీరియా అతి శీతల ప్రాంతాల్లోని లోతైన బొగ్గు, లెడ్, వెండి, ఉప్పురాతి గనుల్లో పనిచేయాల్సి ఉండడం! వారికి అతి తక్కువ వేతనాలు చెల్లించి, భానిన కూలీలుగా ఉపయోగించుకుంటారు. ఇక అరెస్టు చేసిన మిగిలినవారిని సైబీరియాలోని వివిధ ప్రాంతాలలో వారి సైనిక హోదాల్ని తగ్గించేసి, ప్రైవేట్ సైనికులుగా పనిచేయాలని ఆదేశించారు.

ఇక మరొక అభిప్రాయం ప్రకారం దాదాపు 2500 మంది సైనికుల్ని అనుమానం మీద అరెస్టు చేశారు. సైబీరియా కఠిన ప్రవాసశిక్ష, యావజ్జీవిత ప్రవాసశిక్ష వరకూ పైన చెప్పినట్లే 124 మందికి విధించారు. ఇక మిగిలిన వారిలో పలువురిని జైళ్లల్లో పెట్టి తీవ్రంగా శిక్షించారు. పలువుర్ని చనిపోయేదాకా శిక్షించారు. మిగిలిన వారిని (వీరంతా దిగువ స్థాయి ప్రైవేట్ సైనికులు) సైబీరియా దాకా నడిపించుకుంటూ తీసుకెళ్లి (సెయింట్ పీటర్స్‌బర్గ్ నుంచి మాస్కోకు దాదాపు 5,500 మైళ్ల దూరం. అది కూడా సైబీరియా ముఖద్వారంగా చెప్పబడే ఇర్‌కుత్స్క్ వరకే. ఇంకా లోపలికి వెళితే మరికొన్ని వేల మైళ్లు ఉంటుంది. ఎందుకంటే సైబీరియా అత్యంత విశాల ప్రాంతం. అది ఎంతటి విశాల ప్రాంతం అంటే, ఆధునిక రష్యా మొత్తం విస్తీర్ణం 1,70,75,200 చదరపు కిలోమీటర్లు కాగా, రష్యన్ ప్రాంతాలు వదిలేసి కేవలం సైబీరియా విస్తీర్ణమే 1,31,000,00 చదరపు కిలోమీటర్లు. ఇది మన భారత విస్తీర్ణం కన్నా దాదాపు నాలుగు రెట్లుంటుంది – రచ). అక్కడ వీరిని వేర్వేరు ప్రాంతాల్లో పనిచేయించారు.

సైబీరియా కఠిన ప్రవాస శిక్షకు గురైన వారిలో పలువురు, ముందే చెప్పుకున్నట్లు ఉన్నత వంశాలవారూ, సైన్యంలో ఉన్నత హోదాల్లో ఉన్నవారూ. వీరిలో కొందరు వివిధ ప్రసిద్ధ రాజవంశాల వారున్నారు. చాలా మందికి పెద్ద పెట్టున ఆస్తులు కూడా ఉన్నాయి. కానీ శిక్ష కారణంగా వారందరి హక్కులూ రద్దయ్యాయి. ప్రవాస జీవితంలో వారంతా దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించారు. మనుషులే లేని ఒంటరి మంచు ప్రాంతాల్లో జీవించడానికి ఏమాత్రం అనువుకానిచోట ఆ ఖైదీలు పడ్డ బాధలు వర్ణించడానికి మాటలు చాలవు. ఆ ఖైదీల చేత కఠిన శ్రమ చేయిస్తూ కూడా వారికి చాలినంత తిండి పెట్టేవారు కాదు. కొన్ని ప్రాంతాల్లో మైనస్ 20 సెంట్రిగ్రేడ్ నుండి మైనస్ 40 సెంటిగ్రేడ్ దాకా సంవత్సరంలో దాదాపు 7 నుండి 8 నెలల దాకా ఉండే దుర్భర చలికి తట్టుకునే దుస్తులు కూడా వారికి ఇచ్చేవారు కాదు. పరమ క్రూరునిగా పేరొందిన జార్ నీకొలస్1 బండరాతి హృదయానికి ఈ కఠిన ప్రవాస శిక్షపడిన ఖైదీల పట్ల వ్యవహరించిన తీరే అందుకు నిదర్శనం.

**(3) ఖైదీల భార్యల ప్రశంసనీయ కృషి :** జారే పరమ క్రూరుడంటే, ప్రవాస శిక్ష పాలైన ఖైదీల భార్యలపట్ల చర్చి కూడా అలాగే వ్యవహరించింది. జీవితకాల ప్రవాస శిక్ష అనుభవించాలి కాబట్టి, వారు ఇక తిరిగివచ్చే అవకాశం లేనందున, వారి భార్యలంతా విధవరాళ్లయినట్లే నీ, అందువల్ల వారి భర్తలు బతికుండగానే వారు చట్ట ప్రకారం విడాకులు తీసుకోకపోయినా, వారు మరో వివాహం చేసుకోవచ్చుననీ ప్రభుత్వ అధికారిక మతచర్చి అయిన ప్రాచీన ఆర్థడాక్స్ చర్చి ప్రకటిస్తూ ఒక చట్టాన్ని జారీ చేసింది. కాని ఆ చట్టాన్ని అనుసరించడానికి డిసెంబరిస్ట్‌ల భార్యలంతా తిరస్కరించారు. నిజానికి వారంతా యువతులే. అంతా నవయవ్వనంలో ఉన్నవారు. ఒకామెకైతే పెళ్లయి ఒక సంవత్సరమే గడిచింది. ఒకామెకైతే ఇంకా వివాహమే కాలేదు. తన ప్రేమికునితో వివాహం జరిగేందుకు కేవలం నిశ్చితార్థం జరిగిందంతే. వీరంతా భర్తల్ని అనుసరించి ప్రవాసం వచ్చేందుకు జార్ అనుమతి కోరారి.

నాటి జార్ యొక్క పాషాణ హృదయానికి ఒక చిన్న ఉదాహరణ చూడండి. సైబీరియా వెళ్లేందుకు అనుమతి కోరిన డిసెంబరిస్ట్‌ల భార్యలకు అనుమతి ఇచ్చేందుకు జార్ పెట్టిన షరతులు ఒకటి కాదు, చాలా ఉన్నాయి. ఎవరైతే భర్తల్ని చూసేందుకు, అక్కడ ఉండేదుకు వెళతారో వారంతా ఇక వెనక్కి, రష్యన్ ప్రాంతాలకు తిరిగి రాకూడదు. ఇక పిల్లలు గనుక ఉంటే ఆ పిల్లల్ని ఇంటివద్దే వదిలేసి వెళ్లాలి. అలాగే అక్కడికి వెళ్లిన వారంతా తమ ప్రభువంశ హోదాల్ని కోల్పోవడమే గాక, ఆస్తి హక్కునీ కోల్పోతారు. సైబీరియాలో వారి కదలికలన్నీ అధికారుల అనుమతితోనే జరగాలి. బంధుమిత్రులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినా అవన్నీ అధికారుల అనుమతితోనే జరపాలి, వైగరాలు.

ఇలా జార్ తనుకూడా ఒక మానవుడేనన్న విషయాన్ని మరిచి, ఏ తప్పు చేయని ఆ స్త్రీల పట్ల (చంటి పిల్లలున్న స్త్రీలు కూడా ఉన్నారు.) ఎన్ని కఠినమైన ఆంక్షలు పెట్టినప్పటికీ, వారు అందుకు అంగీకరించి (అంగీకార పత్రాల మీద సంతకాలు పెట్టాలి.) సైబీరియా వెళ్లారు. అలా వెళ్లడం ద్వారా ఆ డిసెంబరిస్ట్ భార్య, తన భర్తకు విధేయంగా ఉండే భార్యే రష్యన్ మహిళకు నిజమైన ప్రతీక అనిపించేలా, తమ పిల్లల్ని ఇంటివద్దే వదిలేసి, వేలాది మైళ్లు మంచు భూముల్లో పడి భర్తల్ని వెతుక్కుంటూ సైబీరియా లోతట్టు ప్రాంతాలలో గల తమ భర్తలుండే సెటిల్‌మెంట్ ప్రాంతాలకు వెళ్లారు. (ఒకామె 1 సంవత్సరం వయసుగల తన చిన్నారి కొడుకుని ఇంటివద్ద వదిలి రావడంతో ఆ చిన్నారి బాలుడు తల్లి ఎడబాటును సహించలేక మరణించాడు).

ఎన్నో అమానవీయ షరతుల్ని అంగీకరించి సైబీరియా వెళ్లిన ఈ రష్యన్ ఉత్తమ మహిళా మణులు, అక్కడికి వెళ్లాక కూడా భర్తల్ని కలుసుకోవడానికి సరిగా అనుమంతించేవారు కాదు. వారు వెళ్లేసరికి వారి భర్తల పరిస్థితి దయనీయంగా కనిపించింది. పలువురు సరైన తిండిలేక అర్ధాకలితో, కఠిన శ్రమతో బక్కచిక్కి, కళ్లు లోతుకుపోయి మరణావస్థలో ఉన్నట్టు కనిపించారు. కొందరు జబ్బు పడ్డారు. వారి జబ్బుకు సరైన మందులు ఇచ్చే పరిస్థితి కూడా అక్కడ లేదు. అంతేగాక, అక్కడగల దుర్భర మంచు గాలులను తట్టుకునే దుస్తుల్ని కూడా ఇవ్వకుండా పెడుతున్న ఇబ్బందులు కూడా వారుకళ్లారా చూశారు.

ఆ మహిళలు భర్తల దయనీయ స్థితిని చూసి చలించిపోయారు. నీకొలస్ అధికారుల కఠిన ప్రవర్తన గురించి ఊరక చింతిస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదనీ, తాముపడే ఇబ్బందుల్ని అధిగమిస్తూనే, తమ వారిని రక్షించుకోవాలని నిశ్చయించారు. తమలో తాము ఐకమత్యంగా ఉంటూనే తమకు చేతనైన కృషిని నిర్మాణాత్మకంగా చేయడానికి నడుంకట్టారు.

మొత్తం సైబీరియా జీవిత ప్రవాస శిక్షతో పాటు కఠిన శ్రమ నరకాన్ని విధించబడిన ఖైదీలు 124 మంది ఉండగా, వీరిలో 23 మందికి మాత్రమే వివాహాలయ్యాయి. అలా వివాహాలైన వారి భార్యలు 11 మంది తమ భర్తల్ని అనుసరించి సైబీరియాకు వచ్చారు. ఈ భార్యలు 11 మంది గాక, ఇతర ఖైదీల బంధువులు ఏడు మంది మహిళలు – వీరు ఆ ఖైదీల తల్లులు కొందరూ, తోడబుట్టినవారు కొందరూ కలిసి మొత్తం అలా వచ్చినవారు 18 మందీ కలిసి ఏకతాటిపై ఉంటూనే, ఆ ఖైదీల సంక్షేమానికి కృషి చేశారు. ఆ మహిళలు స్వయంగానే దుర్భర దారిద్ర్యంతో పొదుపుగా జీవిస్తూనే, ధైర్యంగా ముందడుగు వేశారు. వారు తమకుగల ఆస్తి హక్కు కోల్పోవడంతో, తమ బంధువుల్ని, మిత్రుల్ని వివిధ రూపాల్లో విరాలాలు అడిగి, వారు పంపిన డబ్బునీ, పాత దుస్తుల్నీ ఇతర అవసరాల్నీ, మందుల్నీ తెప్పించుకుంటూ, వాటి అన్నింటినీ ఉమ్మడి నిధిగా ఉపయోగించుకుంటూ తమ స్వంత అవసరాలు తీర్చుకుంటూ, తమ బంధువులైన ఖైదీల అవసరాల్ని తీర్చసాగారు. ఈ మహిళల్లో కొందరు పేదలున్నారు. ధనికులైనవారు చొరవ చూపించి తమ బంధుమిత్రుల నుండి వీలయినన్ని అధిక మొత్తంలో విరాళాల రూపంలో సేకరించేవారు. వాటిని ఉమ్మడిగా వినియోగించేవారు. ఆ నిధి నుండి అవసరం వచ్చిన వారెవరైనా తీసుకోవచ్చున్నమాట! అలాగే ఉమ్మడిగా వంట చేసుకుంటూ, ఆ వండిన వంటను తాము ఉపయోగించుకోవడమే గాక, తమ భర్తలైన ఖైదీలకు కూడా తీసుకువెళ్లి పెట్టేవారు. ఆ రోజుల్లో ఖైదీలకు బయటి నుండి ఇంటివారు తెచ్చిన భోజనాన్ని తినే సౌకర్యం ఉండేది గనుక, ఆ విధంగా తమ భర్తల ఆరోగ్యాన్ని కాపాడేందుకు ప్రయత్నించారు.

ఆ మహిళలు ప్రతిరోజూ తమ భర్తలైన ఖైదీల్ని కలుసుకునేందుకు కళ్లు కాయలు కాచేలా ఎదురుచూస్తూనే (వారానికి రెండుసార్లు ఆ మహిళలు తమ భర్తల్ని కలుసుకునేందుకు అనుమతించేవారు – రచ), గొప్ప ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడిపారు. తమ బంధుమిత్రులు పంపిన విరాళాలతో తాము నిరాడంబరంగా బతుకుతూనే, తమ మిగిలిన కాలాన్ని ఊరక వృథాగా గడపకుండా, ఆ చుట్టుపక్కల గల ప్రజల అభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. విద్యకూ, వైద్యానికీ, సాంస్కృతిక అభివృద్ధికీ దూరంగా, విసిరికొట్టినట్లు దూర దూరంగా ఉండే సెటిల్‌మెంట్ ప్రాంతాల్లో నివసించే అక్కడి స్థానిక ప్రజలకు వీటిని అందించేందుకు పనిచేశారు. వారికి పాఠశాలలు నిర్మించారు. తామే స్వయంగా వారికి పాఠాలు చెప్పేవారు. ఆస్పత్రులు కట్టించారు. కావలసిన మందులు తెప్పించి ఇచ్చేవారు. వారి సాంస్కృతిక వికాసానికి బాల్‌రూం థియేటర్లు కట్టించారు. పత్రికలు తెప్పించి వారిని చదివించేవారు. రాత పత్రికల్ని నడిపేవారు. ఇలా ఆ ప్రాంత ప్రజల అభివృద్ధికి ఎంతో కృషి చేసిన ఆ రష్యన్ మహిళలు తమ భర్తలు చేసిన తిరుగుబాటు ద్వారా ఎలా చరిత్ర ప్రసిద్ధికెక్కారో, అలాగే తామూ ప్రసిద్ధికెక్కారు. ఈ ఖైదీల భార్యల్నీ, ఇతర బంధువుల్నీ రష్యన్లు 'దెకబ్రిస్త్‌కీ' అనే పేరుతో వారి విరోచిత త్యాగాల్ని గుర్తుంచుకో సాగారు. అలాగే డిసెంబరిస్ట్ తిరుగుబాటు దారులైన వీరి భర్తల్ని 'దెకంబ్రిస్త్' అని గౌరవంగా పిలుచుకో సాగారు. డిసెంబరిస్ట్‌ల భార్యల్లో రాకుమారుడు సెర్గీవోల్కోన్స్కీ భార్య అయిన రాకుమారి అయిన 'మరీయా వోల్కోన్స్కయా' ఆ మహిళలందర్లో మిక్కిలి ప్రసిద్ధికెక్కింది. గొప్ప సౌందర్యావతీ, గాయనీ, పియానో వాదకురాలైన ఈమె, నెపోలియన్ యుద్ధాల్లో ప్రసిద్ధి పొందిన జనరల్ రయేవ్‌స్కీ గారాల కుమార్తె. ప్రసిద్ధ ఉన్నత ప్రభువంశమైన వోల్కోన్స్కీల కుటుంబం నుంచి వచ్చివాడూ, నెపోలియానిక్ యుద్ధ వీరుడూ, తన అసమాన వీరత్వానికి గుర్తుగా బంగారు ఖడ్గాన్ని సర్వ సైన్యాధిపతి మార్షల్ కుటుజోవ్ నుంచి స్వీకరించినవాడూ, గొప్ప ధనికుడూ, రచయితా, స్టేజీ డైరెక్టరూ అయిన రాకుమారుడు సెర్గీవోల్కోన్స్కీ ప్రేమించి పెళ్లాడాడు. పెళ్లినాటికి మరియాకు 19 ఏళ్లు మాత్రమే. మరుసటి సంవత్సరానికే బిడ్డ జన్మించాడు. అయినా ఆ కొడుకు ముఖాన్ని తండ్రి చూడకముందే, ఆ తండ్రిని అరెస్టు చేశారు. మొదట ఉరిశిక్ష విధించి, ఆ పైదాన్ని మార్చి సైబీరియాలో యావజ్జీవిత ప్రవాసమూ, 20 సంవత్సరాల కఠిన శ్రమ నరకమూ విధించారు. ఖైదీలో ఉన్న భర్తను చూసేందుకు మరియాకు, తండ్రి రయేవ్‌స్కీ అనుమతించలేదు. అయినప్పటికీ తండ్రి అభీష్టానికి విరుద్ధంగా మరియా తన భర్తను జైలులో ఉండగా చూసి రావడమే గాక, అంతకుమించి, తన భర్తను అనుసరించి సైబీరియా వెళ్లాలనీ నిశ్చయించి, జార్ నీకొలస్‌ని కలిసి స్వయంగా అర్థించి, షరతులకు అంగీకరించి సైబీరియా వెళ్లింది. ఆమెకు మరో డిసెంబరిస్ట్ భార్య అయిన యెకతెరీనా త్రుబెత్స్కయా ఆదర్శం.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రష్యన్ విప్లవాల, లెనిన్ జీవిత చరిత్ర పరిశోధకుడు, సాహిత్యకారుడు, విమర్శకుడు)*

వీ

## జనసేన లాంగ్ మార్చ్

ఆంధ్రప్రదేశ్‌లో భవన నిర్మాణ కార్మికుల సమస్యలను పరిష్కరించాలని కోరుతూ జనసేన అధ్యక్షుడు పవన్ కల్యాణ్ విశాఖపట్నంలో నవంబర్ 3న లాంగ్ మార్చ్ చేసి బహిరంగ సభ నిర్వహించారు. పవన్ కల్యాణ్ ప్రజల సమస్యలను పరిష్కరించడంలో ప్రభుత్వాలు విఫలమవడంవల్లే ప్రజలు రోడ్లమీదకి వస్తారన్న విషయాన్ని గుర్తించాలన్నారు. గత ఐదు నెలలుగా ఇసుక కొరతవల్లే కార్మికులకు పనిదొరకలేదు. ఆ కారణంతోనే రాష్ట్రంలో ఇప్పటివరకు 36 మంది కార్మికులు మరణించారు. దీనికి ప్రభుత్వం బాధ్యత వహించి ప్రతి కార్మికుడికి రు. 50 వేలు, చనిపోయిన ప్రతి కార్మికుడి కుటుంబానికి రు. 5 లక్షలు చెల్లించాలన్నారు. 2 వారాల లోపు ఇసుక కొరతను నివారించి, కార్మికుల సమస్యలను పరిష్కరించకపోతే అమరావతిలో నడుస్తానని పవన్ కల్యాణ్ అన్నారు.

## ఆంధ్రప్రదేశ్‌లో మీడియా స్వేచ్ఛకు సంకెళ్లు

ఆంధ్రప్రదేశ్ వైఎస్ఆర్‌సిపి ప్రభుత్వం మీడియా స్వేచ్ఛకు సంకెళ్లు వేస్తూ తీసుకున్న నిర్ణయం ప్రకారం 'నిరాధార' వార్తలు రాసినా, ప్రచురించినా, ప్రసారం చేసినా మీడియా మీద కేసులు పెట్టే అధికారాలను ఆయా శాఖల కార్యదర్శులకు కట్టబెడుతూ అక్టోబర్ 30న జి.ఓ. జారీచేసింది. ప్రింట్, ఎలాక్ట్రానిక్ మీడియాతో పాటు సోషల్ మీడియాను కూడా అదుపులో పెట్టేందుకు ఉద్దేశించిన జిఓ 2430ని ప్రాంతీయ, జాతీయ మీడియా సంస్థలు, సంఘాలు, ప్రజాస్వామ్య వాదులు తీవ్రంగా ఖండిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నిర్ణయంపై ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసింది. పత్రికలపై ఆంక్షలు విధిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జారీచేసిన జిఓ 2430ను ప్రెస్ కౌన్సిల్ తనంతట తాను పరిగణనలోకి తీసుకుని (సుమోటో) ఉత్తర్వులు జారీచేసింది.

## మావోయిస్టు సహచరుల అరెస్టు

మావోయిస్టు పార్టీ నాయకులు రవిశర్మ, అనురాధలను నవంబర్ 12న అరెస్టు చేసినట్లు రాచకొండ సిపి మహేష్ భగవత్ తెలిపారు. ప్రజా జీవితంలో ఉన్న రవిశర్మ తాజాగా విప్లవ కార్యక్రమాల్లో పాల్గొంటున్నట్లు తమకు సమాచారం ఉందన్నారు. దీంతో ఎల్‌బి నగర్‌లోని వారి ఇంటిపై స్పెషల్ పార్టీ పోలీసులు దాడిచేసి సోదాలు జరిపారు. ఈ సోదాల్లో విప్లవ సాహిత్యం, సిడిలు, ల్యాప్‌టాప్‌లు, మావోయిస్టుల పత్రాలు దొరికినట్లు సిపి వెల్లడించారు. వీరిపై ఇండియన్ పీనల్ కోడ్ (ఐపిసి), అన్ లాఫుల్ ఆక్టివిటీస్ ప్రివెన్షన్ ఆక్ట్ (యుఎపిఎ), తెలంగాణ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ సెక్షన్‌ల కేసులు నమోదు చేశారు. ఇదే కేసును మొత్తం పది మందిపై నమోదు చేశారు.

## చంద్రబాబు ఇసుక దీక్ష

ఆంధ్రప్రదేశ్‌లో ఉచిత ఇసుక పాలసీని తీసుకురావాలని, కృత్రిమ ఇసుక కొరత వల్ల కొనసాగుతున్న భవన నిర్మాణ కార్మికుల ఆత్మహత్యలకు నిరసనగా నవంబర్ 14న విజయవాడలోని ధర్నా చౌక్‌లో చంద్రబాబు నాయుడు 12 గంటల దీక్ష చేశారు. ఈ దీక్షకు మద్దతుగా రాజకీయ పార్టీలు, భవన నిర్మాణ కార్మికులు హాజరయ్యారు.

## తెలంగాణలో 12000 బడుల మూసివేత

కనీస స్థాయిలో విద్యార్థులు లేని ప్రభుత్వ పాఠశాలలను మూసివేయాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. అందులో భాగంగానే ఊరికి, పాఠశాలకు మధ్య దూరాన్ని ఐదు కిలోమీటర్లకు పెంచాలని నిర్ణయించింది. దీనిపై పరిశీలనకు ప్రత్యేక కమిటీని కూడా ఏర్పాటు చేసింది. విద్యా హక్కు చట్టం సవరణలపై పరిశీలన చేయాలని విద్యా శాఖ ఈ కమిటీని ఆదేశించింది. ప్రస్తుత నిబంధనల ప్రకారం ఒక కిలోమీటరు పరిధిలో ప్రాథమిక పాఠశాల, మూడు కిలోమీటర్ల పరిధిలో ప్రాథమికోన్నత పాఠశాల, ఐదు కిలోమీటర్ల పరిధిలో ఉన్నత పాఠశాల ఉండాలి. ఈ నిబంధనను ఐదు కిలోమీటర్ల మార్చాలని విద్యాశాఖ నిర్ణయించింది. దీంతో పెద్ద మొత్తంలో పాఠశాలలు మూతపడే అవకాశం ఉంది. దీనిపై ఉపాధ్యాయ సంఘాలు ఆగ్రహం వ్యక్తంచేస్తున్నాయి. దీనిపై నవంబర్ 22న సమావేశం నిర్వహించనున్నారు.

## భూపతి నారాయణ మూర్తి మృతి

తొలితరం కమ్యూనిస్టు ఉద్యమ నేత, స్వాతంత్ర సమరయోధుడు, దళిత బహుజన సాహితీవేత్త, నాస్తిక, హేతువాద ఉద్యమకారుడు భూపతి నారాయణ మూర్తి (99) మృతి చెందారు. భూపతి గత కొంత కాలంగా అనారోగ్యంతో బాధపడుతూ తూర్పుగోదావరి జిల్లా మలికిపురంలో నవంబర్ 21న మరణించారు. భూపతి 1921 సెప్టెంబర్ 17న మలికిపురంలో జన్మించారు. ఆయన చివరలో దళిత బహుజన వ్యవసాయ కార్మిక సంఘం రాష్ట్ర అధ్యక్షునిగా సేవలందించారు.

## యాదగిరిరెడ్డి మృతి

తెలంగాణ సాయుధ పోరాటంలో కీలక పాత్ర వహించిన సిపిఐ నేత గుర్రం యాదగిరిరెడ్డి (88) కన్నుమూశారు. ఆయన హైదరాబాద్‌లోని చంపాపేటలోని అద్దె ఇంట్లో నవంబర్ 22న గుండెపోటుతో మృతిచెందారు. యాదగిరిరెడ్డి భువనగిరి జిల్లా గుండాల మండలం సుద్దాల గ్రామంలో 1931 ఫిబ్రవరి 5న జన్మించారు. ఆయన తన 15వ ఏటనే ప్రజా పోరాటాల్లో పాల్గొన్నారు. నిజాంకు వ్యతిరేకంగా సాగిన తెలంగాణ సాయుధ పోరాటంలో కీలకపాత్ర పోషించారు. ఆయన వరుసగా మూడు సార్లు ఎంఎల్‌ఏగా చేశారు.

## విద్యుత్ మీటర్ రీడర్ల రిలే నిరాహార దీక్ష

ఉద్యోగ భద్రత కల్పించాలని, పీస్‌రేటు రద్దు చేయాలని, కనీస వేతనం అమలు చేయాలనే డిమాండ్లతో నవంబర్ 25న విద్యుత్ మీటర్ రీడర్లు విజయవాడలోని ధర్నా చౌక్‌లో రిలే నిరాహార దీక్షలు చేపట్టారు. ఆంధ్రప్రదేశ్ విద్యుత్ మీటర్స్ రీడర్స్ రాష్ట్ర కార్యాచరణ కమిటీ ఆధ్వర్యంలో చేపట్టిన ఈ దీక్షలను పిడిఎఫ్ ఎంఎల్‌సి కెఎస్ లక్ష్మణరావు ప్రారంభిస్తూ ఏళ్ల తరబడి పనిచేస్తున్న మీటర్ రీడర్లను తొలగించి కొత్తగా వచ్చిన గ్రేడ్–2 జూనియర్ లైన్‌మెన్లతో రీడింగులు తీయించుకుంటామని విద్యుత్ శాఖ ఉన్నతాధికారులు ప్రకటనలు చేయడం సరికాదన్నారు. రీడర్ల డిమాండ్లు న్యాయమైనవని తక్షణమే ప్రభుత్వం స్పందించి వారికి ఉద్యోగ భద్రత కల్పించాలని డిమాండ్ చేశారు.

## ఆర్‌టిసి కార్మికుల సమ్మె

సుదీర్ఘ కాలంగా కొనసాగిన ఆర్‌టిసి కార్మికుల సమ్మెను తప్పనిసరి పరిస్థితుల్లో విరమిస్తున్నట్టు ఆర్‌టిసి కార్మిక సంఘాల జెఏసి నవంబర్ 24న ప్రకటించింది. ఈ పిలుపుతో కార్మికులు విధుల్లో చేరుతామని వెళ్లినా డిపోలలోకి రాకుండా యాజమాన్యం పోలీసు బందోబస్తు ఏర్పాటు చేసింది. చట్టపరంగా కార్మికులను విధుల్లోకి తీసుకోవడం సాధ్యం కాదని ప్రభుత్వం చెప్పింది. సమ్మె విషయంలో లేబర్ కమిషనర్ చర్యలు తీసుకుంటారని, దానికి అనుగుణంగా ఆర్‌టిసి యాజమాన్యం స్పందిస్తుందని రవాణా శాఖ ముఖ్య కార్యదర్శి, ఆర్‌టిసి ఇన్‌చార్జి ఎండి సునీల్ శర్మ నవంబర్ 25న తెలిపారు. ప్రభుత్వం ఆర్‌టిసిని ప్రైవేటుపరం చేసే ప్రయత్నాలను ముమ్మరం చేసింది. ఈ దశలో ఆర్‌టిసిని పరిరక్షించడానికి, ప్రజా రవాణా వ్యవస్థను కాపాడుకోడానికి సమ్మెను విరమించి, విధుల్లో చేరాలని జెఎసి నిర్ణయించిందని, ప్రభుత్వం మాత్రం సమ్మెపై స్పందించకుండా రూట్లను ప్రైవేటుపరం చేస్తోందని కన్వీనర్ అశ్వత్థామరెడ్డి ఆరోపించారు. భవిష్యత్‌లోను దశల వారి పోరాటం కొనసాగుతుందని స్పష్టం చేశారు. అనేక నిర్బంధాలు, అరెస్టులు, లాఠీచార్జీల మధ్య 52 రోజులు కొనసాగిన సమ్మె ఆర్‌టిసిని పరిరక్షించుకోడానికి నాంది పలికిందన్నారు. వీ

### గురుదాస్ దాస్‌గుప్తా మృతి

ప్రముఖ కార్మికనేత గురుదాస్ దాస్‌గుప్తా(83) అక్టోబర్ 31న మృతిచెందారు. ఆయన ప్రస్తుత బంగ్లాదేశ్ జిల్లాలో 1936 నవంబర్ 3న జన్మించారు. దేశ విభజన తరువాత కుటుంబంతోపాటు పశ్చిమ బెంగాల్‌కు వచ్చి స్థిరపడ్డారు. గుప్తా ఏఐటియుసి నాయకునిగా దేశంలోని వేలాది పరిశ్రమల కార్మికుల సమస్యలను పరిష్కరించారు. బొగ్గుగని కార్మికులతో ఆయనకు అనుబంధం ఉంది. రెండుసార్లు ఏఐటియుసి జాతీయ అధ్యక్షునిగా, ఒకసారి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. సిపిఐ తరఫున పార్లమెంట్ సభ్యునిగా ఎన్నికయ్యారు. బొగ్గు గనుల ప్రైవేటీకరణను తీవ్రంగా వ్యతిరేకించారు. కూలీల పరిస్థితులపై, సెక్యూరిటీల కుంభకోణంపై, రిలయన్స్ ఇండస్ట్రీస్ ఒప్పందాన్ని రద్దుచేయాలని డిమాండ్ చేశారు.

### జార్ఖండ్ అసెంబ్లీ ఎన్నికలు

జార్ఖండ్ మొత్తం 81 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలను నవంబర్ 30 నుంచి డిసెంబర్ 20 తేదీ వరకు నిర్వహిస్తారు. మొత్తం ఐదు దశల్లో పోలింగ్ నిర్వహించి, డిసెంబర్ 23న ఫలితాలను వెల్లడిస్తామని కేంద్ర ఎన్నికల కమిషనర్ సునీల్ అరోరా నవంబర్ 1న ప్రకటించారు. తొలిసారిగా ఈ ఎన్నికల్లో దివ్యాంగులు, 80 ఏళ్లు పైబడిన వృద్ధుల కోసం పోస్టల్ బ్యాలెట్ సౌకర్యాన్ని కల్పించారు.

### అయోధ్య పై సుప్రీం కోర్టు తీర్పు

అయోధ్యలోని రామజన్మభూమి-బాబ్రీ మసీదు వివాదానికి సంబంధించిన కేసు పై సుప్రీం కోర్టు నవంబర్ 9న తీర్పు వెల్లడించింది. వివాదాస్పద 2.77 ఎకరాల భూమి మొత్తం, కేసులో ఒక కక్షిదారు అయిన 'రామ్ లల్లా'కు చెందుతుందని ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ రంజన్ గొగోయ్ నేతృత్వంలోని ఐదుగురు సభ్యుల రాజ్యాంగ ధర్మాసనం ఏకగ్రీవంగా తీర్పు చెప్పింది. మసీదు నిర్మాణానికి ప్రత్యామ్నాయంగా అయోధ్యలో ఐదు ఎకరాల స్థలాన్ని సున్నీ సెంట్రల్ వక్ఫ్ బోర్డుకు ఇవ్వాలని సూచించింది. ఈ రాజ్యాంగ ధర్మాసనంలో జస్టిస్ ఎస్.ఎ. బోబ్డే, జస్టిస్ డి.వై. చంద్రచూడ్, జస్టిస్ అశోక్ భూషణ్, జస్టిస్ ఎస్. అబ్దుల్ సభ్యులుగా ఉన్నారు.

### శబరిమలపై విస్తృత ధర్మాసనానికి సుప్రీం కోర్టు తీర్పు

శబరిమల ఆలయంలోకి మహిళల ప్రవేశంపై దాఖలైన రిట్‌పిటిషన్లను పూర్తిస్థాయి సమీక్ష కోసం ఏడుగురు న్యాయమూర్తుల విస్తృత ధర్మాసనానికి బదిలీచేయాలని సుప్రీంకోర్టు నిర్ణయించింది. ప్రధాన న్యాయమూర్తి రంజన్ గొగొయ్ నేతృత్వంలోని ఐదుగురు సభ్యుల ధర్మాసనం నవంబర్ 14న తీర్పునిచ్చింది. ధర్మాసనంలోని చీఫ్ జస్టిస్ గొగొయ్, జస్టిస్ ఖన్వీల్కర్, జస్టిస్ ఇందుమల్హోత్రాలు ఏడుగురు సభ్యుల విస్తృత ధర్మాసనానికి ఈ అంశాన్ని నివేదించాలని తీర్పులో పేర్కొనగా, జస్టిస్ చంద్రచూడ్, జస్టిస్ నారిమన్‌లు రిట్‌పిటిషన్లన్నింటిని తోసిపుచ్చి, మహిళల ప్రవేశానికి అనుకూలంగా గతంలో తాము ఇచ్చిన తీర్పునే కొనసాగించాలని తాజా తీర్పులో తెలిపారు. ఐదుగురు సభ్యులలో ముగ్గురు విస్తృత ధర్మాసనానికి నివేదించాలని చెప్పడంతో మెజార్టీ నిర్ణయంగా అదే అమలు కానుంది.

### రాఫెల్‌పై సమీక్ష అక్కర్లేదు - సుప్రీం కోర్టు

రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలుపై గతంలో ఇచ్చిన తీర్పును సమీక్షించాలని కోరుతూ దాఖలైన పిటిషన్లను తోసిపుచ్చుతూ.. ఈ కేసును పునఃపరిశీలించాల్సిన అవసరం లేదని న్యాయస్థానం నవంబర్ 14న పేర్కొంది. ఫ్రెంచ్‌కు చెందిన దసాల్ట్ ఏవియేషన్ నుంచి 36 రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలులో అవకతవకలు జరిగాయని సుప్రీంకోర్టు ధర్మాసనం 2018, డిసెంబర్ 14న ఇచ్చిన పిటిషన్లను కొట్టివేస్తూ కేంద్రానికి క్లీన్‌చిట్ ఇచ్చింది. ఈ తీర్పును పునఃపరిశీలించాలని కోరుతూ వ్యాజ్యాలు వేశారు. ప్రధాన న్యాయమూర్తి గొగొయ్ నేతృత్వంలోని ధర్మాసనం ఈ కేసులో కేంద్ర ప్రభుత్వానికి మరోసారి క్లీన్‌చిట్ ఇచ్చింది.

### జెఎన్‌యులో విద్యార్థుల ఆందోళన

జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ యాజమాన్యం పెంచిన ఫీజును వెనక్కు తీసుకోవాలని, జెఎన్‌యు విసి రాజీనామా చేయాలని జెఎన్‌యు టీచర్స్ అసోసియేషన్, జెఎన్‌యు స్టూడెంట్ యూనియన్లు డిమాండ్ చేస్తూ ఆందోళన చేశాయి. నవంబర్ 19న పెద్దఎత్తున ప్రదర్శన జరిపిన ప్రొఫెసర్లు, విద్యార్థులు గంగాదాబా వద్ద నిరసన కార్యక్రమం చేపట్టారు. ఈ నిరసన కార్యక్రమం నవంబర్ 19 నాటికి 23 రోజులకు చేరింది. విద్యార్థులపై, ప్రొఫెసర్లపై పోలీసుల దాడిని జెఎన్‌యుటిఎ ఖండించింది.

### బెంగాల్‌లో మూకదాడి

ఉత్తర బెంగాల్ కుచ్‌బెహార్ జిల్లాలో ఆవులను వ్యానులో తరలిస్తున్న ఇద్దరిపై సాయుధ మూకలు దాడిచేయడంతో వారు మృతి చెందారు. మాతాబంగా వద్ద వీరిద్దరూ రెండు ఆవులను వ్యాన్‌లో తరలిస్తుండగా, సాయుధ మూక వ్యాన్‌ను ఆపి ప్రశ్నించింది. అనంతరం వారిపై దాడికి పాల్పడడంతో ఇద్దరూ తీవ్రంగా గాయపడ్డారు. వీరిద్దరినీ పోలీసులు ఆసుపత్రిలో చేర్చగా, చికిత్స పొందుతూ నవంబర్ 23న మరణించారు. ఈ ఘటనలో 12 మందిని పోలీసులు అరెస్టు చేశారు.

### మావోయిస్టుల కాల్పుల్లో నలుగురు పోలీసుల మృతి

జార్ఖండ్‌లోని లాతేహర్ జిల్లాలో మావోయిస్టులు జరిపిన కాల్పుల్లో నలుగురు పోలీసులు మృతిచెందారు. చంద్వారడా పోలీస్ స్టేషన్ పరిధిలోని లుకియాతాండ్ గ్రామంలో పెట్రోలింగ్ వ్యాన్‌పై నవంబర్ 24న మావోయిస్టులు కాల్పులు జరపడంతో నలుగురు పోలీసులు మృతిచెందగా ఒకరు తప్పించుకున్నారని పోలీసు అధికారి తెలిపారు.

### నిర్బంధం నీడలోనే కశ్మీర్

మాజీ కేంద్ర మంత్రి యశ్వంత్ సిన్హా నేతృత్వంలోని ఐదుగురు సభ్యుల పౌరసమాజ బృందం నాలుగు రోజుల పాటు కశ్మీర్‌లో పర్యటించి అక్కడి పరిస్థితులను పరిశీలించింది. అక్కడ వారు పరిశీలించిన విషయాలను నవంబర్ 25న మీడియాతో పంచుకున్నారు. కేంద్రం చెబుతున్నట్లుగా ఆర్టికల్ 370 రద్దు తరువాత కశ్మీర్‌లో సాధారణ పరిస్థితులెక్కడా లేవు. కన్సర్న్ సిటిజన్స్ గ్రూప్ పేరిట కశ్మీర్‌లో పర్యటించిన తమ బృందం పోలీసులు విధించిన అనేక అడ్డంకులను ఎదుర్కొందన్నారు. కశ్మీర్‌లో వాస్తవ పరిస్థితులను దాచిపెడుతూ కేంద్రం కుట్ర పూరితంగా వ్యవహరిస్తుందని, కేంద్రం తన విధానాన్ని మార్చుకోకపోతే పరిస్థితి మరింత క్షీణిస్తుందని హెచ్చరించారు. లోయ అంతటా భయోత్పాతం నెలకొన్నదని వారు తెలిపారు.

### విఆర్‌ఎస్‌ను నిరసిస్తూ బిఎస్‌ఎన్‌ఎల్ ఉద్యోగుల దీక్ష

ప్రభుత్వ రంగ టెలికాం సంస్థ బిఎస్‌ఎన్‌ఎల్ మోడీ సర్కార్ ప్రతిపాదిస్తున్న స్వచ్ఛంద పదవీ విరమణ (విఆర్‌ఎస్)ను నిరసిస్తూ సంస్థ ఉద్యోగులు దేశవ్యాప్తంగా నవంబర్ 25న నిరాహార దీక్షలు చేపట్టారు. స్వచ్ఛందం అంటూనే తమను బలవంతంగా ఉద్యోగం నుంచి తప్పించేదుకు సంస్థ యాజమాన్యం, కేంద్ర ప్రభుత్వం కుట్ర చేస్తుందని ఆరోపిస్తున్నారు. ఆలిండియా యూనియన్స్ అండ్ అసోసియేషన్స్ ఆఫ్ భారత్ సంచార్ నిగామ్ లిమిటెడ్ కన్వీనర్ పి. అభిమన్యు విఆర్‌ఎస్‌ను ఒప్పుకోని ఉద్యోగుల పదవీ విరమణ కుదిస్తామని వారిని భయపెడుతున్నారని అన్నారు. దీనివల్ల ఉద్యోగులు పింఛను సదుపాయాలను కోల్పోయే ప్రమాదం ఉందన్నారు. కేంద్ర ఐటి మంత్రి ఉద్యోగులంతా స్వచ్ఛందంగా ఉద్యోగాల నుంచి వైదొలుగుతున్నారని చెప్పడం వాస్తవం కాదన్నారు. పదవీ విరమణ వయస్సును 58 ఏళ్లకు కుదిస్తామనీ, దూర ప్రాంతాలకు బదిలీ చేస్తామనీ సంస్థ యాజమాన్యం బెదిరిస్తుందని అభిమన్యు ఆరోపించారు. 4జీ సేవలను తక్షణమే ప్రారంభించాలనీ, సంస్థలో మూడవ వేతన సవరణను అమలుచేయాలనీ కోరారు. వీ

## బ్రెగ్జిట్ గడువు పొడిగింపు

యురోపియన్ యూనియన్ (ఇయు) నుంచి బ్రిటన్ వైదొలగేందుకు ఉన్న గడువును 2020 జనవరి 31కి పొడిగించారు. దీనికి ఇయులోని ఇరవై ఏడు దేశాలు అంగీకారం తెలిపాయి.ఇయు నుంచి వైదొలగేందుకు చేసుకోవాల్సిన ఒప్పందాలపై బ్రిటన్ పార్లమెంట్ ఆమోదాన్ని సాధ్యమైనంత త్వరగా పొందాలని బ్రిటన్‌కు ఇయు తెలిపింది.

## సిరియాపై టర్కీ రసాయన దాడి

సిరియాలోని కుర్దు తిరుగుబాటుదారులపై టర్కీ రసాయన దాడులకు పాల్పడింది. జనావాసాలపై జరిగిన ఈ దాడుల్లో సామాన్య ప్రజలు తీవ్రంగా గాయపడ్డారు. ముఖ్యంగా చిన్నపిల్లలపై దీని ప్రభావం తీవ్రంగా పడింది. తెల్లభాస్వరం రసాయన పొగ పీల్చడం వల్ల ఊపిరితిత్తుల వ్యవస్థ దెబ్బతినడం, కిడ్నీ, కాలేయం, గుండెపై తీవ్ర ప్రభావం చూపి ప్రాణాలు పోతున్నాయి. టర్కీ జరిపిన దాడుల వల్ల ఎంతో మంది సామాన్య ప్రజలు ప్రాణాలు పోగొట్టుకోగా, వందలాది మంది తీవ్ర గాయాల పాలై ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు.

## బొలీవియాలో రాజకీయ సంక్షోభం

బొలీవియాలో రాజకీయ సంక్షోభం నెలకొంది. అక్టోబర్‌లో జరిగిన ఎన్నికల్లో అవకతవకలు జరిగియాని ప్రతిపక్షాలు తీవ్ర ఆందోళన కార్యక్రమాలు చేపట్టాయి. పలు చోట్ల విధ్వంసానికి పాల్పడ్డాయి. మీడియా కార్యాలయాలపై దాడులు చేశాయి. దీంతో అధ్యక్షుడు ఎవో మొరేల్స్ మళ్లీ ఎన్నికలు నిర్వహించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉందని నవంబర్ 9న ప్రకటించారు. అక్టోబర్‌లో జరిగిన ఎన్నికల్లో వామపక్ష పార్టీ అభ్యర్థి అయిన మొరేల్స్ మితవాది పార్టీ అభ్యర్థి కార్లోస్ మెసాపై గెలుపొందారు. అయితే ఈ ఎన్నికల్లో అవతవకలు జరిగాయని అమెరికాకు చెందిన ఆర్గనైజేషన్ ఆఫ్ అమెరికన్ స్టేట్స్ నివేదిక విడుదల చేసింది. దీంతో ప్రతిపక్ష మితవాద పార్టీలు తీవ్ర హింసాత్మక ఆందోళనలకు పూనుకున్నాయి.

## జర్మనీలో రైతుల నిరసన

జర్మనీలో ప్రభుత్వం అనుసరిస్తున్న రైతు వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా రైతులు పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శలను చేశారు. నవంబర్ 15న బెర్లిన్‌లోని హామ్‌బర్గ్ నగరంలో నాలుగు వేల ట్రాక్టర్లతో రాస్తారోకో నిర్వహించారు. విత్తనాలు, యూరియా, పశుగ్రాసం కొనుగోలులో ప్రభుత్వం సబ్సిడీ ఇవ్వడం లేదనీ, నిత్యావసర ధరలు కూడా విపరీతంగా పెరిగిపోతున్నాయనీ నిరసన తెలిపారు. విత్తనాలు, యూరియా కొనుగోలు కోసం ప్రభుత్వం వెంటనే సబ్సిడీ ప్రకటించాలని డిమాండ్ చేశారు.

## శ్రీలంక అధ్యక్షుడిగా రాజపక్ష

శ్రీలంకలో నవంబర్ 16న అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో దాదాపు కోటి యాభై లక్షల మంది తమ ఓటును వినియోగించుకున్నారు. శ్రీలంక పోదుజన పెరమున (ఎస్ఎల్‌పిపి) నేత గోటబయ రాజపక్షకు 52.25 శాతం (69.244 లక్షల) ఓట్లు రాగా, ఆయన ప్రత్యర్థి గృహ నిర్మాణ శాఖ మంత్రి సజిత్ ప్రేమదాసకు 42 శాతం (55.64 లక్షల) ఓట్లు వచ్చాయి. దీంతో 13 లక్షల మెజారిటీతో గెలుపొందిన రాజపక్ష నవంబర్ 18న ఆయన శ్రీలంక అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేశారు.

## జూలియన్ అసాంజేకు ఊరట

వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియన్ అసాంజేపై చేపట్టిన విచారణను నిలిపివేస్తున్న స్వీడన్ ప్రభుత్వం ప్రకటించింది. అమెరికా రక్షణ శాఖకు సంబంధించిన కీలక రహస్య పత్రాలను బహిర్గతం చేసినందుకు అసాంజేను తమకు అప్పగించాలని అమెరికా కోరింది. 2012లో బెయిల్ పొందిన నాటి నుంచి అసాంజే ఈక్వేడార్ రాయబార కార్యాలయంలో ఆశ్రయం పొందుతున్నాడు. రెండు నెలల కిందట బ్రిటన్ కోర్టు అసాంజేకు 50 వారాల జైలు శిక్షను విధించింది. అయితే అసాంజేపై పెట్టిన నేరారోపణకు సంబంధించి సరైన సాక్ష్యాధారాలు సమర్పించకపోవడంతో స్వీడన్ కోర్టు అతన్ని విడుదల చేసింది.

## కొలంబియాలో విద్యార్థుల నిరసన

కొలంబియాలో ప్రభుత్వ విద్యా వ్యతిరేక విధానాలకు నిరసనగా విద్యార్థులు నిరసన ప్రదర్శన చేశారు. నవంబర్ 22న రాజధాని బొగోటా వీధుల్లో లక్ష మందికి పైగా విద్యార్థులు, అధ్యాపకులు, విశ్వవిద్యాలయ డైరెక్టర్లు భారీ నిరసన ప్రదర్శనను చేపట్టారు. దేశవ్యాప్తంగా విశ్వవిద్యాలయాలన్ని సమ్మె బాటపట్టాయి. విద్యారంగానికి నిధుల కేటాయింపులను పెంచాలని, విద్యారంగంలో మరింత పారదర్శకతతో కూడిన విధానాలను అమలు చేయాలని ఈ సందర్భంగా నిరసనకారులు డిమాండ్ చేశారు. కొలంబియా అధ్యక్షుడు ఇవాన్ డ్యూక్ తమ డిమాండ్లు ఆమోదించే వరకు ఆందోళన కొనసాగిస్తామని విద్యార్థులు తెలిపారు.

## చిలేలో కొనసాగుతున్న నిరసనలు

చిలేలో అధ్యక్షుడు సెబాస్టియన్ పినెరా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల నిరసనలు కొనసాగుతూనే ఉన్నాయి. సాంఘిక, ఆర్థిక అసమానతలకు వ్యతిరేకంగా సాగుతున్న ఈ నిరసనలు రోజురోజుకూ హింసాత్మకంగా మారుతున్నాయి. మరోవైపు ఈ ఆందోళనలను అణచడానికి ప్రభుత్వ బలగాలు ప్రయత్నిస్తున్నాయిత నవంబర్ 22న శాంటియాగోలో వేలాది మంది ప్రజలు నిరసన తెలుపుతున్న సందర్భంగా పోలీసులు తీవ్ర నిర్భంధాన్ని ప్రయోగించాయి. ఇప్పటి వరకు పోలీసుల కాల్పుల్లో ఇరవై మూడు మంది మరణించగా, రెండు వేల మందికి పైగా గాయాలపాలయ్యారు. ఇందులో దాదాపు మూడు వందల మందికి షాట్‌గన్‌లు, భాష్పవాయువు ప్రయోగం వల్ల కండ్లు దెబ్బతిన్నాయి.

## హాంకాంగ్‌లో ఎన్నికలు

హాంకాంగ్‌లో స్థానిక సంస్థలకు ఎన్నికలు జరిగాయి. నవంబర్ 25న మొత్తం 452 స్థానాలకు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో 388 ప్రజాస్వామ్య అనుకూలవాదులు గెలవగా, చైనా ప్రభుత్వానికి అనుకూలంగా ఉన్నవారు కేవలం 59 మంది మాత్రమే గెలిచారు. మరో ఐదుగురు స్వతంత్రులు గెలిచారు. దీంతో హాంకాంగ్‌లో గత ఎనిమిది నెలలుగా జరుగుతున్న ఆందోళనలకు ప్రతిఫలంగా ఎన్నికల ఫలితాలు వచ్చాయి. చైనాకు నేరస్తులను అప్పగించే బిల్లుకు వ్యతిరేకంగా హాంకాంగ్‌లో ప్రజలు పెద్ద ఎత్తున నిరసనలు జరుపుతున్నారు. స్వయం పరిపాలన కోసం అక్కడ జరుగుతున్న ఉద్యమం తీవ్రమవుతోంది. 20 ఏళ్ల క్రితం వరకూ బ్రిటిష్ వలస దేశంగా ఉన్న హాంకాంగ్‌ని చైనా మెయిన్‌ల్యాండ్‌లో కలపటాన్ని వ్యతిరేకిస్తూ హాంకాంగ్ విద్యార్థులు ఈ పోరు ప్రారంభించారు. ఉద్యమాన్ని అణచివేయాలని చైనా ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించినా ఉద్యమం చల్లారకపోగా తిరిగిపుంజుకుంది. ఇది మరింత విస్తృతమై పాత్రికేయులు, సామాజిక కార్యకర్తలు, సాధారణ ప్రజలు వీధుల్లోకొచ్చి నిరసన కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు. అరెస్టు చేసిన ఉద్యమకారులను విడుదల చేయాలని, పోలీసుల హింసాకాండపై స్వతంత్ర న్యాయవిచారణ జరిపించాలని, సార్వత్రిక ఓటు హక్కు కల్పించాలని డిమాండ్ చేస్తున్నారు. వీ

# వీక్షణం 2019 సూచిక

**మే 2019** — సంచిక : **214**



**జూన్ 2019** — సంచిక : **215**



**జూలై 2019** — సంచిక : **216**



**ఆగస్ట్ 2019** — సంచిక : **217**

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(అక్టోబర్ 1 నుండి అక్టోబర్ 31, 2019 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (971), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (948) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1919)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 16 | 14 | 5 | 6 | 5 | 2 | 2 | 3 | 2 | 1 | 1 | 21 | 24 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 9 | 17 | 4 | 12 | 5 | 3 | 9 | 6 | 8 | 4 | 4 | 24 | 17 | – | – | – | 1 | – |
| కరీంనగర్ | – | 3 | – | 6 | 11 | 3 | 8 | 2 | – | 2 | 1 | 2 | 2 | 8 | 13 | 16 | – | – | – | – | 2 |
| ఖమ్మం | – | 1 | – | 4 | 4 | 3 | 12 | 7 | – | – | – | 3 | 1 | 4 | 8 | 13 | – | – | – | – | 3 |
| మహబూబ్‌నగర్ | – | – | 1 | 3 | 1 | 3 | 3 | 2 | 2 | 1 | 3 | 4 | 1 | 6 | 39 | 1 | – | – | – | – | 1 |
| మెదక్ | 2 | 14 | 2 | 6 | 4 | 7 | 6 | 2 | 2 | 3 | 3 | 6 | 4 | 16 | 24 | 28 | – | – | – | 2 | 2 |
| నల్గొండ | – | – | – | 4 | 6 | 3 | 7 | 2 | 1 | 2 | 2 | 6 | 4 | 5 | 18 | 9 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | 4 | – | 5 | 12 | 4 | 6 | 2 | 1 | 2 | 2 | 3 | 1 | 4 | 22 | 9 | – | – | – | – | 4 |
| వరంగల్ | 1 | 9 | 6 | 8 | 6 | 3 | 2 | 3 | 4 | 4 | 8 | 5 | 6 | 19 | 22 | 36 | – | – | – | 3 | 2 |
| వికారాబాద్ | – | 2 | – | 3 | 6 | 3 | 5 | 4 | 3 | 5 | 5 | 6 | 4 | 7 | 24 | 17 | – | – | – | – | 3 |
| **తెలంగాణ** | **4** | **35** | **9** | **64** | **81** | **38** | **67** | **34** | **18** | **30** | **33** | **45** | **28** | **74** | **215** | **170** | **-** | **-** | **-** | **9** | **17** |
| అనంతపురం | – | 5 | – | 14 | 23 | 3 | 10 | 12 | 1 | 4 | 2 | 2 | 21 | 7 | 53 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | 2 | – | 2 | 4 | 6 | 12 | – | 1 | 2 | 4 | 6 | 5 | 2 | 21 | – | – | – | – | – | – |
| కడప | – | 5 | – | 3 | 3 | – | – | – | – | 1 | – | – | – | 1 | 8 | 13 | – | – | – | – | – |
| గుంటూరు | – | 3 | – | 4 | 9 | 3 | 6 | – | 1 | 3 | 2 | 3 | 4 | 2 | 14 | 11 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 4 | 3 | 2 | 6 | 2 | 1 | 2 | 1 | 2 | – | 3 | 13 | 11 | – | – | – | – | – |
| కర్నూలు | – | 7 | – | 8 | 9 | 2 | 4 | 3 | 1 | 2 | 3 | 2 | – | 5 | 22 | 12 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | – | 3 | 5 | 6 | 4 | 5 | – | 2 | 3 | 5 | 5 | 8 | 27 | 30 | – | – | – | 3 | – |
| ప్రకాశం | – | 2 | – | 5 | 7 | 3 | 4 | 2 | 2 | 4 | 2 | 3 | 2 | 5 | 19 | 16 | – | – | – | – | 3 |
| శ్రీకాకుళం | – | – | – | 2 | 4 | 2 | 3 | 3 | – | 1 | 1 | 3 | – | 2 | 11 | 13 | – | – | – | – | 2 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 2 | 4 | 2 | 7 | 2 | – | 1 | 2 | 3 | – | 2 | 15 | 10 | – | – | – | – | 1 |
| నెల్లూరు | – | 1 | – | 6 | 8 | 2 | 5 | 3 | 1 | 3 | 2 | 3 | 1 | 5 | 17 | 11 | – | – | – | – | 1 |
| విజయనగరం | – | – | – | 5 | 3 | 2 | 2 | 3 | – | 2 | 1 | 1 | – | 3 | 14 | 15 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | 1 | – | 11 | 13 | – | 1 | – | – | 7 | 3 | 1 | 1 | 5 | 16 | 25 | – | – | – | 7 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **26** | **-** | **69** | **95** | **33** | **64** | **35** | **8** | **34** | **26** | **34** | **39** | **50** | **250** | **167** | **-** | **-** | **-** | **10** | **8** |

